మహాకవి కాళిదాసకృత

# మేఘదూతం

పదచ్ఛేద, అన్వయ, ప్రతిపదార్థ, తాత్పర్య, 'శ్రీకళా'ఖ్య వ్యాఖ్యోపేతం

రచన

రామవరపు శరత్‌బాబు, ఎం.ఏ., పి.హెచ్.డి. (సంస్కృతం)

శొంఠి శారదాపూర్ణ, ఎం.ఏ., పి.హెచ్.డి. (తెలుగు)

ఆనందలహరి ప్రచురణ, విశాఖపట్టణం.



శ్లో॥ 'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణ స్సుధీః I
శారదా భూషణం చారులోకే విజయతే తమామ్ II

శ్లో॥ తస్య శిష్యః శరత్ బాబు రస్య శిష్యాచ శారదా I
మేఘదూతం 'శ్రీకళా' ఖ్య వాఖ్యా సంశోభితం నవమ్ II

శ్లో॥ సుగంధి పుష్పం సంభావ్య సరసైః స్వాదు భావితమ్ I
స్వయమర్పయతో భక్త్యా ప్రాచార్యస్య పదాబ్జయోః II





శిష్య ప్రశిష్యులు
శరత్శారదలు

ఆనందలహరి: ప్రథమ తరంగం



1998

Copies : 500

*For Copies :*

**Dr. Ramavarapu. Sarat Babu**
Head, Department of Theatre Arts
Andhra University (Retd)
Visakhapatnam - 530 003
A.P. India

**Dr. Saradapurna. Sonty**
3042 CARMEL DRIVE
Flossmoor, IL. 60422
U.S.A

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| Soft Cover : | Rs. 150/- | India | | Hard Cover : | Rs. 200/- | India |
| | $ 15/- | USA | | | $ 20/- | USA |

Printed at :
***SPAA Offset***
Visakhapatnam- 530 016
Andhra Pradesh, INDIA
✆ 547600

శ్రీః

# ఆనంద లహరి

విశుద్ధమైన భారతీయ సంస్కృతీ సభ్యతలను, సంప్రదాయాన్నీ విశ్వవ్యాప్తంచేసి భారతీయ విలువలయందు భక్తిశ్రద్ధాను రాగాల్ని ప్రపంచమంతటా వ్యాపింప చేసి ''కృణ్వన్తో విశ్వమార్యమ్'' అనే ఆర్షధ్యేయాన్ని సాధించడం 'ఆనందలహరి' లక్ష్యం.

ఈ ధ్యేయ సిద్ధికి ప్రధానంగా ఈ క్రింది కార్యక్రమాలను; దేశకాల పాత్రానుగుణంగా అప్పటికి అవసరమైనవీ 'ఆనందలహరి' చేపడుతుది.

- వేద, శాస్త్ర, ఉపనిషత్, కావ్య వాఙ్మయాన్ని సామాన్యుని అవగాహనా పరిధిలోకి తీసికొని రావడానికి అధ్యయన మండలులను, తరగతులను నిర్వహించి గ్రంథరచన చేయించి ప్రకటించడం.
- అనుష్ఠాన యోగ్యమైన మంత్ర, యంత్ర, తంత్ర విద్యా రహస్యాలను జనసామాన్యానికి విడమర్చి ఆ విజ్ఞానాన్ని అందివ్వడం, శిక్షణ నిప్పించడం.
- యోగాభ్యాస పద్ధతులను, రహస్యాలను ప్రచారంచేసి ప్రజాబాహుల్యానికి వానిపట్ల అసక్తి కలిగించి శిక్షణా తరగతుల నిర్వహించడం.
- భారతీయ సంస్కృతిని సమగ్రంగా అవగాహనచేసికోవడానికి సంస్కృత భాషా పరిజ్ఞానం ప్రధానమైనది కనుక సంస్కృత భాషా ప్రచారానికీ, తదధ్యయనానికీ వివిధ స్థాయిల్లో తరగతుల నిర్వహించి సులభ పద్ధతుల్లో త్వరితంగా సంస్కృతంనేర్పడానికి మార్గాల నన్వేషించి ఆచరణలోనికి తీసికొని రావడం.
- బాలుర నుండి వృద్ధుల వరకు యోగ్యతాను సారంగా భగవద్గీత, వేదాంత విద్యల పట్ల అనురక్తిని కల్గించి, అభ్యాసానికి అవకాశాలను కలిగించడం.
- భారతీయ సంస్కృతీ సభ్యతలకు సంకేత ప్రాయాలైన నృత్యాది లలిత కళల పట్ల సదవగాహనను జనావళిలో జాగృతం చేయడం.

ఈ షట్సూత్రప్రణాళికను అమలు చేయడం ద్వారా ప్రస్తుతం పండితలోక పరిధికి మాత్రమే పరిమితమై ఉన్న భారతీయ విజ్ఞానంపై సామాన్యునికి సైతం అవగాహన కలిగించడానికి అవకాశం కలుగుతుందని 'ఆనంద లహరి' విశ్వసిస్తోంది.

జీవిత పరమార్థం ఆనందం. ఆనందమే బ్రహ్మ పదార్థమని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి. (''ఆనందో బ్రహ్మేతి విజానాత్''–) ఉద్వేగ భరితమైన జీవన సరళి కాక మనశ్శాంతిని సాధించడమే ఆనందం. ఆ ఆనందం భారతీయ జీవన విధానంలోని ప్రధానలక్ష్యం కనుక ఈ ప్రణాళికకు 'ఆనందలహరి' అని నామకరణం చేయడం జరిగింది.

ఈమహత్తర ధ్యేయసిద్ధికి అంగబలం, అర్థబలం అపారంగా అవసరమౌతాయని విజ్ఞులకెల్లరకూ విదితమే. కనుక దీనికి వలసిన సాధన సంపత్తులను సమకూర్చుకోవడానికి ఉదారులైన వదాన్యులను స్వచ్ఛందంగా ముందుకు వచ్చి చేయూత నిచ్చి ఈ బృహత్తర జ్ఞాన యజ్ఞంలో భాగస్వాములు కావలసినదిగా 'ఆనందలహరి' విజ్ఞప్తి చేస్తోంది,

## సంస్థాపకులు

**రామవరపు శరత్‌బాబు**, ఎం.ఏ., పి.హెచ్.డి.,
Chairman, **'Ānandalahari'**,
46-18-8, Mandavaripet, Dondaparti,
Visakhapatnam - 530 016 India.
© 0891 - 505254

**శ్రీమతి. శారదాపూర్ణ**, ఎం.ఏ., పి. హెచ్. డి.,
Chairperson-at-large, **'Ānandalahari'**,
3042, CARMEL DRIVE
FLOSSMOOR, IL. 60422, USA
© 708-957-4302.

# మా మాట

విశ్వవిఖ్యాతమైన గీతికావ్యాల్లో మహాకవి కాళిదాస కృత 'మేఘదూతం' ఒక విశిష్ట స్థానాన్నందుకొంది. ప్రశాంత గంభీరమైన ఈ ప్రణయ గీతిలో ప్రకృతి ప్రధాన పాత్ర వహించడం వల్ల సంస్కృత భాషాయోషకి ది ఒక అనర్ఘరత్నంగా భాసించింది. కాళిదాస కాల నిర్ణయంలో పండితుల్లో భేదాభిప్రాయాలున్నా క్రీ.పూ. ప్రథమ శతాబ్ది ఆయన కాలమని సంప్రదాయ ప్రవణుల భావన.

ధర్మార్థకామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాలు భారతీయ సంస్కృతికి మూలస్తంభాలు. వీటిలో మొదటి త్రిపుటియైన ధర్మార్థకామాలకు గృహస్థాశ్రమమే మూలం. అట్టి మహోన్నత గార్హస్థ్య ఆదర్శపు పునాదులపై నిర్మించిన సరస సుమనోజ్ఞ శృంగార భవన నిర్మాణం ఈ మేఘదూతం. విశ్వజనీనమైన విలువల్ని కాంతాసమ్మితంగా ఉపదేశించిన కమనీయకావ్యం. భార్యావిరహియైన ఒకానొక యక్షుడు తన భవిష్యదాశనీ, స్వానుభూతిని, విశ్వసనీయతను వ్యక్తం చేస్తూ తన భార్యకు మేఘునిద్వారా పంపిన సందేశమే ఈ మేఘసందేశకావ్యం. రస నిర్భరమై, ఔచిత్యవంతమై, భవ్యభావుకతా సముపేతమై, ధ్వని ప్రస్థాన ప్రతిపాదకంగా సాగిన ఈ అద్భుత శృంగార కావ్యం అనేక శతాబ్దాలుగా రసజ్ఞులనలరిస్తూ వస్తోంది. పూర్వమేఘం, ఉత్తరమేఘమని ద్విధావిభజితమైన ఈ ఖండకావ్యంలో పూర్వార్థం యక్షునిచే తానున్న రామగిరి (నాగపూర్ సమీపంలో 'రామటేక్' అనే పేరుతో ప్రస్తుతం వ్యవహారం లో ఉన్న ప్రదేశంగా పండితులు భావిస్తున్నారు) నుండి తన ప్రణయిని నివసిస్తున్న అలకా పట్టణానికి పథనిర్దేశం, వివిధ ప్రాంతాల రామణీయకంతో ప్రవాసియైన యక్షుని అనుభూతి విశేషం, ఊహాశబలతలతో మనకి సాక్షాత్కరిస్తే ఉత్తరార్థం అలకానగర వర్ణన, యక్షపత్ని ఆవాసం, ఆమె సౌందర్యం, యక్షుని విరహోత్కంఠలతో మనల్ని దిగ్భ్రాంతుల్ని చేస్తుంది.

ఈ మేఘదూత కావ్యానికి ఇదుగో అదుగో అని అరవై వ్యాఖ్యానాల దాకా వచ్చేయంటే దీని ప్రశస్తిని వేఱుగా చెప్పనక్కరలేదు. వీటిలో ప్రాచీన తమమైంది కాశ్మీరపండితుడు వల్లభదేవుడు వ్రాసిన 'పంజికా' వ్యాఖ్యానం. పూర్ణ సరస్వతి విరచిత 'విద్యుల్లతా' వ్యాఖ్య, పరమేశ్వరకృత 'సుమనోరమణీ' వ్యాఖ్యలు కూడా ప్రసిద్ధమైనవే. ఔత్తరాహుడైన స్థిరదేవుడు 'బాలప్రబోధినీ' వ్యాఖ్యను సంతరించేడు. దాక్షిణాత్యుల్లో దక్షిణావర్తనాథుని 'ప్రదీప' వ్యాఖ్యానానికో ప్రత్యేకత ఉంది. అరుణగిరినాథుడు, చారిత్రవర్ధనుడు, దివాకరుడు మొదలైన వారెందరెందరో ఎన్నెన్నో వ్యాఖ్యలు రచించినా, వ్యాఖ్యాతృ

శ్రీః

# మేఘదూతమ్

కశ్చిత్కాన్తా విరహగురుణా స్వాధికారాత్ప్రమత్తః
శాపేనాస్తంగమిత మహిమా వర్షభోగ్యేణ భర్తుః ।
యక్షశ్చక్రే జనక తనయా స్నాన పుణ్యోదకేషు
స్నిగ్ధ ఛ్ఛాయా తరుషు వసతిం రామగిర్యాశ్రమేషు ॥ 1

**పదచ్ఛేదం:** కశ్చిత్, కాన్తా విరహగురుణా, స్వాధికారాత్, ప్రమత్తః, శాపేన, అస్తంగమిత మహిమా, వర్షభోగ్యేణ, భర్తుః, యక్షః, చక్రే, జనకతనయా స్నాన పుణ్యోదకేషు, స్నిగ్ధచ్ఛాయా తరుషు, వసతిం, రామగిర్యాశ్రమేషు.

**అన్వయం :** స్వాధికారాత్, ప్రమత్తః, కాన్తా విరహగురుణా, వర్షభోగ్యేణ, భర్తుః, శాపేన, అస్తంగమిత, మహిమా, కశ్చిత్, యక్షః, జనకతనయా స్నాన పుణ్యోదకేషు, స్నిగ్ధచ్ఛాయాతరుషు, రామగిర్యాశ్రమేషు, వసతిం, చక్రే.

**ప్రతిపదార్థం:** స్వాధికారాత్= తన విధి నుడి; ప్రమత్తః= ప్రాలుమాలిన (అశ్రద్ధవహించిన); కాన్తావిరహగురుణా = దుర్భరమైన కాంతావియోగమును; వర్షభోగ్యేణ = సంవత్సర కాలమనుభవింపతగిన; భర్తుః, శాపేన= యజమాని శాపము చేత; అస్తంగ మితమహిమా = పోగొట్టుకొనిన మహిమలు కలవాడైన; కశ్చిత్, యక్షః= ఒకానొక యక్షుడు; జనకతనయా స్నానపుణ్యోదకేషు =సీతాదేవి స్నానమాడుటచే పవిత్రమైన నీరు కలదియు; స్నిగ్ధచ్ఛాయాతరుషు= దట్టమైన నీడలనిచ్చు చెట్లు కలిగిన నటువంటి; రామగిర్యాశ్రమేషు = చిత్రకూటపర్వతమందలి ఆశ్రమ పదములయందు; వసతిం, చక్రే = నివాసమును చేసికొనెను.

**తాత్పర్యం :** తన విధులనుండి ప్రాలుమాలుట చేత దుర్భరమైన కాంతావియోగమును సంవత్సరకాలావధిగ అనుభవించుటకు యజమాని శాపము నొంది స్వీయమహిమలు పోగొట్టుకొనిన ఒకానొక యక్షుడు, సీతాదేవి స్నానమాడుటచే పునీతమైన నీరు (సరస్సులు) కలిగినటువంటియు, దట్టమైన నీడలనిచ్చు చెట్లు కలిగిన చిత్ర కూటపర్వత ప్రాంతములను తన నివాసముగ చేసికొనెను.

**'శ్రీకళా' వ్యాఖ్య :** కవికుల, తిలకుడు కాళిదాస మహా కవి రచించిన ఖండ కావ్యం ఈ మేఘసందేశం. కాళిదాసు రఘువంశం, కుమార సంభవమనే రెండు మహాకావ్యాల్నీ ఈ మేఘ దూతమనే ఖండకావ్యాన్ని, మాళవి కాగ్నిమిత్రం, విక్రమోర్వశీయం,

చక్రవర్తిగా ప్రసిద్ధుడైన ఆంధ్రుడు మల్లినాథ సూరి 'సంజీవనీ' వ్యాఖ్యే సమస్త జనావళికీ శిరోధార్యం కావడం ఆంధ్రులకు గర్వకారణం.

ప్రపంచంలోని ప్రాచీనతమ భాషల కోవలోకి చెందిన సంస్కృత భాషా ప్రభావం భారతీయ భాషలన్నిటిపై భావంలోనూ, భాషా నిర్మాణంలోనూ అపారంగా ఉందనేది నిర్వివాదాంశం. మహోన్నతమైనవేదాంతాంశాలనుంచి, మామూలు మనిషిమనుగడకు అవసరమైన మహా మహితోక్తుల వరకు మణి రాశులకుప్పగా పోసిన సంస్కృత భాష - కారణాలు ఏవైనా - నేటి జాతీయ జీవనంలో సముచిత స్థానం సముపార్జించుకోక పోవడం వలన జనావళికి దూరమైంది. కనుక ఆ గీర్వాణ వాణిలో నిక్షిప్తమైన మణులను యథాశక్తి సామాన్యులకందించాలనే ఆకాంక్షే మా ఈ అనువాద వ్యాఖ్యాన కార్యాలకు ప్రేరణ.

చతుర్విధ పురుషార్థాల్లో ద్వితీయ పురుషార్థ ప్రతిపాదకమైన చాణక్యుని 'నీతి సాహస్రి'ని గతంలో పాఠకలోకానికి తొలికానుకగా అందించిన మేము, తృతీయ పురుషార్థ ప్రవణమైన ఈ మేఘసందేశాన్ని మలికానుకగా మీముందుంచుతున్నాం. అయితే ఇది గీతికావ్యం కావడం వలన శ్లోకపఠనం సుకరం చేయాలనే దృష్టితో దిగ్దర్శనంగా కొన్ని శ్లోకాలు ఎంచి 'కేసెట్' చేసి ఈ గ్రంథంతో అందిస్తున్నాం. శ్లోకాన్ని 'భాషా పరం'గా అర్థం చేసికోవడానికి పదచ్ఛేద, అన్వయ, ప్రతిపదార్థ, తాత్పర్యాలూ; 'భావనాసరళి'ని పెంపొందించుకోవడానికి వీలుగా 'శ్రీకళా'ఖ్య వ్యాఖ్యనీ పొందుపఱచేము. పఠనాసరళికి 'కేసెట్' ఉపయుక్తమౌతుంది. ఇది శేముషీవైభవోపేతులని సంతుష్టుల్ని చేయాలని కాక సాధారణ సామాజికులను రవంత రంజింప చేయాలనే దృక్పథంతోనే వ్రాసింది కనుక విశ్వవిద్యాలయ ప్రమాణాలను పరిగణనలోకి తీసికోవడం జరగలేదని సవినయంగా మనవి చేస్తున్నాం. భారతీయ జ్ఞానపీఠపురస్కార గ్రహీత, కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు దీన్ని శిష్యునికి పాఠ ప్రవచనం చేయగా అది శిష్యుని నుండి ప్రశిష్యకు సంక్రమించింది. ఆ శిష్య ప్రశిష్యులైన మా ఉభయుల సమష్టి కృషికి వాచ్యలిఖిత రూపాలను సంతరించి ఆమహనీయునికి దినైవేద్యం చేసి సహృదయ శేఖరులకు సమర్పిస్తున్నాం.

సహృదయ శిరోమణుల సమ్మోదమే మాకు సత్కారం.

**శరత్కారదలు**

చెట్లున్నాయి. ఆచెట్ల చల్లని నీడలో విరహార్తి నపనయించే ప్రయత్నం చేస్తున్నాడు. విరహంవల్ల స్వస్థత కోల్పోయి ఉన్నచోట ఉండ కుండా ఆ ఆశ్రమ పరిసరాలంతా పరిభ్రమిస్తున్నాడు.

**తస్మిన్నద్రౌ కతిచిదబలా విప్రయుక్తః సకామీ**
**నీత్వా మాసాన్కనక వలయ భ్రంశరిక్త ప్రకోష్ఠః ।**
**ఆషాఢస్య ప్రథమ దివసే మేఘమాశ్లిష్ట సానుం**
**వప్రక్రీడా పరిణతగజ ప్రేక్షణీయం దదర్శ ॥** 2

**పదచ్ఛేదం :** తస్మిన్, అద్రౌ, కతిచిత్, అబలా విప్రయుక్తః, సః, కామీ, నీత్వా, మాసాన్, కనక వలయభ్రంశ రిక్త ప్రకోష్ఠః, ఆషాఢస్య, ప్రథమదివసే, మేఘం, ఆశ్లిష్టసానుం, వప్ర క్రీడా పరిణత గజ ప్రేక్షణీయం, దదర్శ.

**అన్వయం :** తస్మిన్, అద్రౌ, అబలా విప్రయుక్తః, కనకవలయ భ్రంశ రిక్తప్రకోష్ఠః, కామీ, సః, కతిచిత్, మాసాన్ నీత్వా, ఆషాఢస్య ప్రథమదివసే, ఆశ్లిష్ట సానుం, వప్ర క్రీడా పరిణత గజ ప్రేక్షణీయం, మేఘం, దదర్శ.

**ప్రతిపదార్థం :** తస్మిన్, అద్రౌ = ఆ (చిత్ర కూట) పర్వతమునందు; అబలా విప్రయుక్తః = కాంతావిరహియు; కనక వలయ భ్రంశ (భంశేన) = బంగారు కంకణము జారిపోవుట చేత; రిక్త ప్రకోష్ఠః = బోసిపోయిన ముంజేతితో నున్న; కామీ = కాముకుడైన; సః = అతడు (ఆయక్షుడు); కతిచిత్, మాసాన్ = కొన్ని నెలలు; నీత్వా = గడిపి; ఆషాఢస్య ప్రథమదివసే = ఆషాఢ మాసారంభదినమున (పాడ్యమి); ఆశ్లిష్టసానుం = కూటము నాక్రమించుకొన్నదియు ; వప్రక్రీడా పరిణత గజం = ఉత్ఖాత కేళినొనర్చు ఏనుగువలె; ప్రేక్షణీయం = చూడముచ్చటగానున్న ; మేఘం = మేఘుని; దదర్శ = చూచెను.

**తాత్పర్యం :** ఆ చిత్ర కూట పర్వతంలో కాంతావిరహంతో ముంజేతి బంగారు కంకణం జారిపోవుట వలన బోసి పోయిన హస్తంతో ఉన్న కాముకుడైన యక్షుడు కొన్ని నెలలు గడిపి ఆషాఢ శుద్ధపాడ్యమినాడు ఆ చిత్ర కూటాన్ని ఆక్రమించుకొని, ఉత్ఖాతకేళి చేయు ఏనుగు వలె చూడముచ్చటైన మేఘుని చూచెను.

**'శ్రీకళా' వ్యాఖ్య :** యక్షుడు విరహవ్యథతో చిక్కిపోవడం వలన అతని చేతికున్న స్వర్ణ కంకణం జారిపోయి చేయి బోసిపోతోంది. కొన్ని నెలలు గడిపేడా చిత్రకూటంలో. ఎన్నినెలలు? ఎనిమిది నెలలు. ఎలాచెప్పవచ్చంటే ఉత్తరమేఘంలో 47వ శ్లోకంలో

అభిజ్ఞానశాకున్తలమన్న మూడు నాటకాల్ని రచించేడు. ఇవికాక ఋతు సంహారమనే (ఋతువుల వర్ణన) లఘుకావ్యాన్ని కూడా రచించేడు.

ప్రకృత ఖండకావ్య విషయానికొస్తే –

''***ఖండకావ్యం భవేత్కావ్యం ఏకదేశాను సారిచ***'' అని ఖండకావ్యలక్షణం. అంటే ఒకనిర్దిష్టమైన, ఆది మధ్యావసానాలతో కూడిన కథాభాగంతో నిమిత్తం లేకుండా జీవితంలో ఒక ఘట్టాన్నో, సన్నివేశాన్నో చెప్పేది ఖండ కావ్యం.

ఈ 'మేఘదూత' ఖండ కావ్యంలో నాయకుడు యక్షుడు. ఈయన కుబేరుని కొలువులో పరిచారకుడు. తన విధి నిర్వహణలో ప్రమత్తుడై నందువలన కుబేరుని ఆగ్రహానికి పాత్రమౌతాడు. కుబేరుడు ''సంవత్సర కాలం భార్యా విరహాన్ని పొందుము'' ని శపిస్తాడు. దేవయోనులంతా కేవల ప్రణయైక జీవులు కనుక విరహం అతిదుర్భరమైంది. పైగా శాపగ్రస్తుడు కావటం వలన కామరూపాది మహిమలన్నీ కోల్పోతాడు. విరహాన్నను భవిస్తూ చిత్ర కూటా శ్రమం తనకు వసతిగా చేసికొని ఆషాఢ శుద్ధపాడ్యమినాడు మేఘ సందర్శనం కావడంతో ఆమేఘాన్ని ఆశ్రయించి తన ప్రేయసికి సందేశం పంపుతాడు. ఇందులో విషయం ఇంతే. అయితే అడుగడుగునా మహాకవి ఊహా వైభవం, అలంకార శోభ పఠితల మనస్సును పండించి రససీమకు గొనిపోయి ఆనంద పరవశుల్ని చేస్తుంది.

ఈ ప్రథమశ్లోకంలో నాయక నిరూపణ చేస్తూ మూడు విశేషణాలు ప్రయోగించేడు కవి. 'స్వాధికారాత్ ప్రమత్తః', 'అస్తంగమిత మహిమా', 'కాన్తా విరహ గురుణా.' విధి నిర్వహణలో ప్రమత్తతవలన అతనికి కలిగిన అనర్థాలు మహిమలు కోల్పోవడం, దుర్భరమైన కాంతా వియోగాన్ని పొందడం. దీనివల్ల తన విధి నిర్వహణ మానవుని ప్రధానకర్తవ్యమనే హితాన్ని ప్రబోధిస్తున్నాడు కవి. అంటే చతుర్విధ పురుషార్థాల్లోనూ మొదటది ధర్మ నిర్వహణ. ఆధర్మ నిర్వహణ సక్రమంగా చేయని నాడు అర్థకామాలకి అఘాతం కలుగు తుందనే విషయం స్ఫురింప చేస్తున్నాడు.

యక్షుని వసతి రామగిర్యాశ్రమ ప్రాంతం. అంటే చిత్ర కూట పర్వతం. దీనికి వేసిన విశేషణాలు రెండు. ఒకటి 'జనకతనయా స్నాన పుణ్యోదకేషు'. శ్రీరామచంద్రుడు జాయా భ్రాతృసమేతుడై అరణ్యవాసంలో కొన్నాళ్లు అక్కడ నివసించేడు. పరమసాధ్వి సీతాదేవి అక్కడున్న సరస్సుల్లో స్నానం చేయడంవల్ల ఆ నీటికి పవిత్రత అబ్బిందిట! ఎంతటి సున్నితమైన భావం! రెండోది 'స్నిగ్ధచ్ఛాయాతరుషు' ఎక్కువ నీడనిచ్చే

ఇంతటి అద్భుత కల్పన చేయడం మహాకవికే సాధ్య మౌతుంది. అలం : లుప్తోపమ.

**తస్య స్థిత్వా కథమపి పురః కౌతుకాధానహేతో -**
**రన్తర్బాష్పశ్చిరమను చరో రాజరాజస్య దధ్యౌ ।**
**మేఘాలోకే భవతి సుఖినో௨ప్య న్యథావృత్తి చేతః**
**కణ్ఠాశ్లేష ప్రణయిని జనే కింపునర్దూర సంస్థే ॥** 3

**పదచ్ఛేదం :** తస్య, స్థిత్వా, కథమపి, పురః, కౌతుకాధాన హేతోః, అన్తర్బాష్పః, చిరం, అనుచరః, రాజరాజస్య, దధ్యౌ, మేఘాలోకే, భవతి, సుఖినః, అపి, అన్యథా, వృత్తిః, చేతః, కంఠాశ్లేష ప్రణయిని, జనే, కిం, పునః, దూరసంస్థే.

**అన్వయం :** రాజ రాజస్య అనుచరః, అంతర్బాష్పః, కౌతు కాధాన హేతోః, తస్య, పురః, కథమపి, స్థిత్వా, చిరం, దధ్యౌ, మేఘాలోకే, సుఖినః, అపి, చేతః, అన్యథావృత్తిః, భవతి, కంఠాశ్లేష ప్రణయిని, జనే, దూరసంస్థే, కిం, పునః?

**ప్రతిపదార్థం :** రాజ రాజస్య = కుబేరుని యొక్క; అనుచరః = సేవకుడైన యక్షుడు; అంతర్బాష్పః = కన్నీటిని అణచుకొన్నవాడై; కౌతుకాధానహేతోః = ప్రణయోద్దీపన కారకుడగు; తస్య = ఆమేఘునియొక్క; పురః = ఎదుట; కథమపి = ఎట్లో అట్లు (మిక్కిలి ప్రయత్నముతో); స్థిత్వా = నిలిచి; చిరం, దధ్యౌ = దీర్ఘముగా ఆలోచించెను; మేఘాలోకే = మేఘదర్శనము వలన; సుఖినః అపి = (ప్రియజన సన్నిధిలో) సుఖముగా నున్నవారికికూడా; చేతః = మనస్సు; అన్యథావృత్తిః, భవతి = వికలము కాగలదు. (వికారము నొందగలదు); కంఠాశ్లేష ప్రణయిని జనే = కంఠమును కౌగలించుకొనదగిన ప్రేమికులు; దూరసంస్థే = దూరముగనున్నప్పుడు; కిం, పునః = చెప్పవలసిన దేమున్నది (మిక్కిలి వికారము నొందునని భావము.)

**తాత్పర్యం :** కుబేరుని అనుచరుడైన యక్షుడు కన్నీటిని అపుకొని కుతూహలంతో ఆమేఘుని ఎదుట అతిప్రయత్నం మీద నిలిచి దీర్ఘంగా ఆలోచించేడు. మేఘదర్శనం వలన ప్రియజనులు ఎదుట నుండి సుఖంగా ఉన్నవారికి కూడా మనస్సు వికల మౌతుంటే పరిష్వంగ సుఖాన్నిచ్చే ప్రియ జనులు దూరంగా ఉన్నవారి విషయంలో ఇక చెప్పేదేముంది?

**'శ్రీకళా' వ్యాఖ్య :** 'రాజరాజు' అన్నమాట రాజులకు రాజు, చక్రవర్తి అనే అర్థంలో ప్రయోగంలోఉంది.

''శేషాన్మాసాన్గమయ చతురో లోచనే మీలయిత్వా'' (మిగిలిన నాలుగు నెలల్నీ కళ్ళుమూసికొని గడుపు) అని చెప్పేడు కనుక, శాపావధి సంవత్సర కాలమని మొదటి శ్లోకంలోనే చెప్పేడు కనుక నాలుగు నెలలు మిగిలాయనడం వలన ఎనిమిది నెలలు గడిచిపోయాయని అర్థం. అంటే ఆ చిత్ర కూటంలో ఎనిమిది మాసాలు గడిపిన పిదప ఆషాఢ మాసారంభదిన మాసన్నమైంది. కనుక శాపారంభం కార్తిక శుద్ధ పాడ్యమి అని అనుకోవాలి. కార్తిక శుద్ధ ఏకాదశితో శాపాన్తమని ''శాపాన్తోమే భుజగశయనాదుత్థితే శార్ఙ్గపాణౌ'' అనే ఉత్తరార్థ శ్లోకం వల్ల తెలుస్తోంది. బుద్ధికి పదునెక్కించే ఇటువంటి శబ్దజాలంతో మహాకవుల రచన లుంటాయి.

విరహంతో చిక్కిపోయాడనడంవల్ల స్త్రీ పురుషుల మధ్య ప్రేమ ఎంత స్నిగ్ధంగా ఉండాలో కాంతా సమ్మితంగా ఉపదేశిస్తున్నాడు కవి. ఏదో వర్ణన కోసం వ్రాయడంకాదు. అతిశయోక్తి గా చెప్పడం అంతకంటె కాదు. స్త్రీ పురుషుల ప్రేమ అంత సాంద్రమైనప్పుడే తృతీయ పురుషార్థ మధురిమ మహోత్కృష్టమై తురీయ పురుషార్థానికి సోపానమౌతుంది. పూర్వకాలపు కవులకి రాజాశ్రయం వల్ల భోగభోగ్యాలకి లోటులేక ఇచ్ఛవచ్చినట్లు శృంగారాన్ని ఉద్ధోలంగా వర్ణించేరని పాశ్చాత్య భావనావిష్టులైన ఆధునికుల అధిక్షేపణ. కాని, ఇందులో ఏమాత్రం సత్యంలేదు. ఏమంటే – మన పూర్వకవులు అందునా సంస్కృతంలో కాళిదాస, భవభూతులవంటివారు, తెలుగులో కవిత్రయ ప్రభృతులూ ఋషికల్పులు. భారతీయ జీవనంలోని చతుర్విధ పురుషార్థాల్లో మోక్షానికి ప్రాధాన్యమిచ్చి మిగతా మూడూ ఆచరమ పురుషార్థ సాధనకి సోపానాలుగా తీర్చిదిద్దే రచనలే వేలార్చేరు.

ఇక మేఘాన్నియక్షుడు చూచేడు. ఆమేఘం ఉత్పాత కేళి (వప్రక్రీడ) నాచరించే (గజం) ఏనుగులాఉంది. విరహంలో వ్యక్తిశారీరకంగా క్షీణించినా అతని మనోబలం మాత్రం ఏనుగు బలం వంటిది. మనం మనసులో ఎలా ఊహిస్తే మేఘం అలాగే కనబడుతుందనేది అందరికీ అనుభవైక వేద్యమే. యక్షుడు కాముకుడు కనుక అతని భావన తదనుకూలమైన దృశ్యాలతోనే ఉంటుంది. అతని మనఃపటలంపై తాను తన ప్రేయసితో గడపిన సన్నివేశాల్నే చిత్రీకరించుకొంటూ ఉంటాడు. మదించిన ఏనుగు భూమిపై నున్న ధూళిని తన పాలభాగంతో పైకి వెదజల్లే క్రియే ఈ ఉత్పాతకేళి లేక వప్రక్రీడ. స్త్రీ పురుషుల ప్రణయ కేళిని అదృశ్యం స్ఫురింపజేస్తుంది.

పైన చెప్పిన ఆదర్శప్రణయమనే ఉపదేశాన్ని మనోహరమైన ప్రణయ కేళితో కలిపి చెప్పడమే కాంతా సమ్మితోపదేశం. కనుక ఇటువంటి సుందర, సుమనోహర రూప కల్పనలతో కవితను చెప్పినప్పుడే అది ఉత్తమ కవిత్వం అవుతుంది. అశ్లీల స్పర్శ లేకుండా

**అన్వయం :** సః, నభసి, ప్రత్యాసన్నే, దయితా జీవితాలంబనార్థీ, జీమూతేన, స్వ - కుశలమయీం, ప్రవృత్తిం, హారయిష్యన్, ప్రత్యగ్రైః, కుటజకుసుమైః, కల్పిత అర్ఘాయ, తస్మై, ప్రీతి ప్రముఖ వచనం, స్వాగతం, ప్రీతః, వ్యాజహార.

**ప్రతిపదార్థం :** సః = అతడు (ఆయక్షుడు); నభసి = శ్రావణము; ప్రత్యా సన్నే (సతి) = సమీపించగా; దయితా జీవితాలంబనార్థీ = ప్రియురాలి ప్రాణధారణోపాయము చేయబూని; జీమూతేన = మేఘుని చేత; స్వ - కుశల మయీం = తనక్షేమ మును తెలుపు; ప్రవృత్తిం = వార్తను; హారయిష్యన్ = పంపగోరి; ప్రత్యగ్రైః = అప్పుడే వికసించిన (అభినవములైన); కుటజకుసుమైః = కొండ మల్లెలతో; కల్పిత అర్ఘాయ = అర్ఘ్యమును (పూజాద్రవ్యమును) కల్పించి; తస్మై = వాని కొఱకు (ఆమేఘుని కొఱకు); ప్రీతిప్రముఖవచనం = ప్రీతి పూర్వకమైన మాటలతో; స్వాగతం = స్వాగతమును; ప్రీతః = ప్రీతితో; వ్యాజహార = పలికెను.

**తాత్పర్యం :** ఆ యక్షుడు శ్రావణ మాసము సమీపించిన దగుచుండగా ప్రియురాలి ప్రాణముల నిల్పు ఉపాయంగా మేఘుని చేత తన క్షేమ వార్తను పంపగోరి, అభినవములైన కొండమల్లెలతో పూజా ద్రవ్యమును సమకూర్చి ఆ మేఘునికి ప్రీతి పూర్వకమైన మాటలతో ప్రీతుడై స్వాగతము పలికెను.

**'శ్రీకళా' వ్యాఖ్య :** 'నభసి' అనే పదానికి 'ఆకసమునందు' అనే అర్థం అందరికీ తెలుసు. ఇక్కడ 'శ్రావణమాసం' అనే అర్థంలో కవి ప్రయోగించేడు, 'ప్రత్యాసన్నే' అనే విశేషణంతో. ఆషాఢ మాసారంభంలో మేఘుణ్ణి చూచేడు యక్షుడు. ఆషాఢమాసం తరువాత వచ్చేది శ్రావణ మాసం. వర్షాలు శ్రావణ మాసంలో ఉధృతంగా పడుతూ ఉంటే నెరవేరని సంభోగాభిలాష ప్రాణ త్యాగానికైనా దారితీస్తుంది. అందుచేత తాను క్షేమంగా ఉన్న వార్త తన ప్రియురాలి చెవిన పడితే ఆమె తన భర్త రాకపై భవిష్యత్కాలాశతో ప్రాణాలు నిలుపు కొంటుంది. ఆ ప్రయత్నంలో తన కుశల వార్తను మేఘునితో పంప నిశ్చయించేడు యక్షుడు. ప్రవృత్తి శబ్దానికి స్వభావం అనే అర్థం మనందరికీ తెలిసింది. 'వార్త' అనే అర్థంలో ఇక్కడీ శబ్దం ప్రయుక్త మైంది.

"**వార్తా ప్రవృత్తిర్వృత్తాన్తః**" అని అమరకోశం.

సరే. వార్తను పంపడానికి ఆ మేఘుణ్ణి **ప్రసన్నం** చేసి కోవాలి. మరి అందుకే - అక్కడ లభించే కొండ మల్లెలతో అయనకు **పూజా విధి** జరిపేడు. ప్రీతి పూర్వకమైన మాటలతో, ప్రీతుడై స్వాగతం పలికేడు.

*" రాజాప్రభౌనృపే చన్ద్రే యక్షేక్షత్రియ శక్రయో: "*

అని విశ్వ నిఘంటువు. అంటే రాజశబ్దానికి ప్రభువు. (యజమాని), పాలకుడు (రాజు), చంద్రుడు, యక్షుడు, క్షత్రియుడు, ఇంద్రుడు, అని నానార్థాలున్నాయి ఈసందర్భంలో 'యక్ష' అనే అర్థం తీసి కొంటే రాజులకు రాజు రాజరాజు కనుక కుబేరుడనే అర్థం వస్తుంది. అంతేకాక అమర నిఘంటువు –

*" రాజరాజో ధనాధిప: "*

అని చెబుతోంది. ధనాధిపుడు కుబేరుడు కనుక ఆ అర్థం సిద్ధిస్తోంది. ఈయక్షుడు కన్నీటిని అణుచుకొన్నాడని చెప్పడం వలన ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరశాంత, ధీరలలితులన్న చతుర్విధనాయకుల్లో మన నాయకుడైన యక్షుని ధీరోదాత్త నాయకునిగా గుర్తించాలి. యక్షునికి భార్యా వియోగ దుఃఖం అధికమై కన్నీరు వచ్చినా సామాన్య మానవునిలా కన్నీరు కార్చక కన్నీటిని అణచు కోవడం ధీరోదాత్త లక్షణం. దుఃఖాన్ని నిలువరించుకొని మనస్సులో కలిగిన వికారం ఉపశమించేదాకా ఆలోచిస్తూ మేఘుని ఎదుట నిలిచేడు. మనోవికారం ఎందుకనే ప్రశ్న మనలో కలుగుతుంటే వెంటనే సమాధానమిస్తున్నాడు కాళిదాసు ''మేఘాలోకే భవతి సుఖినో....'' అని.

మేఘదర్శనంవల్ల ప్రియజనం సన్నిధిలో నున్నప్పటికీ మనోవికారం కలుగుతుంది. పరిరంభార్హులు పర ప్రదేశంలో ఉన్నప్పుడు ఈ మేఘ దర్శనంవలన విరహం ఉద్దీపితమౌతుంది. ఆ అవస్థే ప్రస్తుతం యక్షుడు ఎదుర్కొంటోంది.

అలం : అర్థాంతర న్యాసం.

**ప్రత్యాసన్నే నభసిదయితా జీవితాలమ్బనార్థీ**
**జీమూతేన స్వకుశలమయీం హారయిష్యన్ప్రవృత్తిమ్ ।**
**స ప్రత్యగ్రైః కుటజకుసుమైః కల్పితార్ఘాయ తస్మై**
**ప్రీతః ప్రీతిప్రముఖ వచనం స్వాగతం వ్యాజహార ॥** 4

**పదచ్ఛేదం** : ప్రత్యాసన్నే, నభసి, దయితా, జీవితాలమ్బనార్థీ, జీమూతేన, స్వ – కుశలమయీం, హారయిష్యన్, ప్రవృత్తిమ్, సః, ప్రత్యగ్రైః, కుటజ కుసుమైః, కల్పిత, అర్ఘాయ, తస్మై, ప్రీతః, ప్రీతి ప్రముఖ వచనం , స్వాగతం, వ్యాజహార.

అనువిషయమున; ప్రకృతి కృపణాః, హి = స్వభావ దీనులు కదా ! (యుక్తాయుక్త విచక్షణ నెఱుగని వారుకదా !)

**తాత్పర్యం :** పొగ, వెలుతురు, నీరు, గాలుల సమాహారమైన మేఘమెక్కడ ? పటిష్ఠమైన అవయవ విన్యాసముకల ప్రాణులతో పంపతగిన సందేశాంశములెక్కడ? తనపని నెఱ వేరాలనే ఉత్సాహంలో ఈ మాత్రం కూడా యోచించకుండా యక్షుడు మేఘాన్ని (తన సందేశం ప్రియురాలి కందించమని) యాచించేడు. మదనాతురులకు ఇవి చైతన్యవంతమైనవి, ఇవి చైతన్య రహితమైనవనే ఆలోచన ఉండదు కదా !

**'శ్రీకళా' వ్యాఖ్య :** ఇవి మహాకవి కాళిదాసు వాక్యాలు.

నలోపాఖ్యానంలో దమయంతికి సందేశాన్ని తీసికొనివెళ్లిందిహంస. రామాయణంలో శ్రీరాముని సందేశాన్ని తీసికొని వెళ్ళినవాడు హనుమంతుడు. భారతంలో పాండవుల సందేశాన్ని కౌరవులకు తీసికొని వెళ్ళినవాడు శ్రీ కృష్ణుడు. పూర్వకాలంలో (తంతి తపాలాలు రాకముందు) ఆశ్వికుల చేత, పక్షుల ద్వారా సందేశాలు పంపినట్లు చరిత్ర సాక్ష్యమిస్తోంది. కనుక మనుష్యులైనా, పక్షులైనా, హంసలైనా ప్రాణులు కనుక సందేశాలు ప్రాణులద్వారానే పంపాలి. ఆ ప్రాణులు సందేశాలు చేరవేయడంలో పటిష్ఠమైన కరచరణా ద్యవయవాలుకలిగి ఉండాలి. మరి ఇక్కడ మేఘంతో పంపుతున్నాడు. మేఘమంటే ఏమిటి? పొగ, వెలుతురు, నీరు, గాలి. ఈ నాల్గింటి సమాహారం ! అంటే అచేతనం. సందేశహరణ సమర్థమైంది కాదు. ఈ మాత్రం ఆలోచించకుండా మేఘ సందేశమేమిటని విమర్శకులంటారని ఊహించి కాళిదాసు కావ్యౌచిత్యాన్ని ఈ శ్లోకంలో సమర్థించు కొంటున్నాడు.

మరి ఆమాత్రం యోచన యక్షుని కెందుకు లేక పోయిందని ప్రశ్నించుకొని మదనాతురులకి చేతనాచేతన, యుక్తాయుక్త విచక్షణ ఉండదు కదా ! అనే లోకోక్తితో యక్షుని చర్యను సమర్థించేడుకవి. భాగవతంలో గోపికలు కూడా విరహార్తలై శ్రీ కృష్ణుని వెదుకుతూ–

*"నల్లని వాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై.*
*జల్లెడివాడు మౌళి పరిసర్పిత పింఛమువాడు నవ్వురా*
*జల్లెడి మోమువాడు చెల్వల మానధనంబు తెచ్చెనో*
*మల్లియలార ! మీ పొదలమాటున లేడు కదమ్మ చెప్పరే !"*

"*శోభన మాగతం స్వాగతం*" అని స్వాగత శబ్దార్థం.

లోకంలో ఒకరివల్ల మనకి ఒక పని కావలసి వచ్చినప్పుడు – అవ్యక్తి నూతనవ్యక్తి అయినప్పుడు అతనిని మంచి మాటలతో పలకరించి (ప్రీతి ప్రముఖ వచనం) చిన్న మర్యాద చేసి (కల్పితార్ఘాయ) అతనిని ప్రసన్నుణ్ణి చేసికొని అప్పుడు అసలు విషయం చెబుతాం. ఇదిలోక మర్యాద. వ్యవహారం తెలియడం. కావ్య ప్రయోజనాల్లో ఈ వ్యవహార జ్ఞానం కలిగించడమనేది ఒకటి.

***"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతర క్షతయే।***
***సద్యఃపర నిర్వృతయే కాంతా సమ్మిత తయోపదేశయుజే ॥***

అని కావ్య ప్రయోజనాల్ని మమ్మటుడు తన 'కావ్య ప్రకాశ'లో పేర్కొన్నాడు. ఆ 'వ్యవహారవిదే' అనే ప్రయోజనానికీ శ్లోకం నిదర్శనం.

**ధూమజ్యోతిః సలిలమరుతాం సన్నిపాతః క్వమేఘః**
**సందేశార్థాః క్వపటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః।**
**ఇత్యౌత్సుక్యా దపరిగణయన్గుహ్యకస్తం యయాచే**
**కామార్తా హి ప్రకృతి కృపణా శ్చేతనా చేతనేషు ॥** 5

**పదచ్ఛేదం** : ధూమ, జ్యోతిః, సలిల, మరుతాం, సన్నిపాతః, క్వ, మేఘః, సందేశార్థాః, క్వ, పటుకరణైః, ప్రాణిభిః, ప్రాపణీయాః, ఇతి, ఔత్సుక్యాత్, అపరిగణయన్, గుహ్యకః, తం, యయాచే, కామార్తాః, హి, ప్రకృతి కృపణాః, చేతనా చేతనేషు.

**అన్వయం** : ధూమజ్యోతిః సలిల, మరుతాం సన్నిపాతః, మేఘః, క్వ? పటుకరణైః ప్రాణిభిః, ప్రాపణీయాః, సందేశార్థాః, క్వ? ఇతి, ఔత్సుక్యాత్, అపరిగణయన్, గుహ్యకః, తం, యయాచే, కామార్తాః, చేతనా చేతనేషు, ప్రకృతి కృపణాః, హి.

**ప్రతిపదార్థం** : ధూమ, జ్యోతిః, సలిల, మరుతాం, సన్నిపాతః = పొగ, వెలుతురు, నీరు, గాలుల సమాహారమైన; మేఘః, క్వ? = మేఘమెక్కడ?; పటుకరణైః = సమర్థవంతమైన ఇంద్రియములతో ఒప్పు; ప్రాణిభిః = ప్రాణులచేత; ప్రాపణీయాః = పంపతగిన; సందేశార్థాః, క్వ? = సందేశాంశము లెక్కడ?; ఇతి = ఈవిధంగా; ఔతుక్యాత్ = తనపని కావలెననెడి అభినివేశంతో; అపరిగణయన్ = యోచించక; గుహ్యకః = యక్షుడు; తం= ఆ మేఘుని; యయాచే = యాచించెను; కామార్తాః = కామముచే పీడింపబడిన వారు (మదనార్తులు); చేతనా అచేతనేషు = (ఇవి) చేతనములు (ఇవి) అచేతనములు

**'శ్రీకళా' వ్యాఖ్య:** నాల్గవ శ్లోకంలో ''ప్రీతి ప్రముఖ వచనం'' అన్న మాటకిది నిదర్శనం. లోకంలో ఒక వ్యక్తిని పొగిడేటప్పుడు నువ్వు ఇంద్రుడివి, చంద్రుడివని అంటారన్నది అందరికీ తెలిసిందే. ఇంద్రుడంతటి వాడు నీకు ప్రధాన పురుషుడయ్యా! అంటున్నాడు ''మఘోనః ప్రకృతి పురుషం''. ఇందులో చమత్కారం ఏమిటంటే మేఘాలకు ఇంద్రుడధిపతి. ఆయన ఆజ్ఞలకు బద్ధమై మేఘాలు వర్షిస్తాయి. మేఘాల్లో పుష్కరావర్తకమనే శ్రేష్ఠమైన వంశంలో జన్మించేవు, కామరూపుడివి, అటువంటి శ్రేష్ఠుడవైన నిన్ను యాచిస్తున్నాను. అన్నాడు యక్షుడు. కనుక మేఘునికిక తప్పుకోవడానికి వీలులేదు. మహాత్ముని యాచిస్తే ఆ యాచన వ్యర్థమయినా ఫరవాలేదు కాని నీచుడు దాన్ని సఫలీకృతంచేసినా శ్రేయస్కరం కాదు'', అని చెప్పడంలో కావ్య ప్రయోజనాల్లోని 'శివేతరక్షతి' (అమంగళం పోగొట్టడం) ని కాంతా సమ్మితంగా ఉపదేశిస్తున్నాడు కాళిదాస కవీంద్రుడు.

అంటే – మనకి ఒక పని కావలసివచ్చినప్పుడు గుణవంతుణ్ణే కోరాలి. ఒకవేళ అతడాపని అప్పుడు నెరవేర్చలేకపోయినా కాలాంతరంలో ఆపనో , లేదా అంత కంటె మహోప కారాన్నో చేస్తాడు. స్వతః ఉత్తముడు కనుక.

నీచుణ్ణి ఆశ్రయిస్తే స్వభావతః దుర్గుణుడు కనుక అప్పుడాపని చేసి పెట్టినట్లే చేసి కాలాంతరంలో మననుండి అనుచితమైన ప్రయోజనాలని ఆ కాంక్షిస్తాడు. లోకంలో వివిధరంగాల్లో చూస్తోందే ఇది. ధనసహాయంచేస్తే అధిక వడ్డీతో పీల్చి పిప్పి చేయడమో – యువతులకు ఉద్యోగాదులిచ్చి వారి సౌశీల్యాన్ని భంగపఱచడమో – ఇలా.

''గుణ వంతుణ్ణి ఆశ్రయించు – గుణహీనుని వద్దకు పని ఉన్నా పోకు'' అని కంఠోక్తిగా చెప్పక అదే విషయాన్ని ''యాఞ్చామోఘా వరమధి గుణేనాధమేలబ్ధకామా'' అనే వాక్యంలో ధ్వనింప చేసేడు. కాంతా సమ్మితంగా (మనోహరంగా) ఉపదేశిస్తుంది కావ్యమంటే ఇదే. **అలం :** అర్థాంతరన్యా సోప జీవిత ప్రేయోఽలంకారం.

**సంతప్తానాం త్వమసి శరణం తత్పయోద ప్రియాయాః**
**సందేశం మే హర ధనపతి క్రోధ విశ్లేషిత తస్య ।**
**గన్తవ్యా తే వసతి రలకా నామ యక్షేశ్వరాణాం**
**బాహ్యోద్యాన స్థితహర శిరశ్చన్ద్రికాధౌత హర్మ్యా ॥** 7

**పదచ్ఛేదం :** సంతప్తానాం, త్వం, అసి, శరణం, తత్, పయోద, ప్రియాయాః, సందేశం, మే, హర, ధనపతి క్రోధవిశ్లేషితస్య, గన్తవ్యా, తే, వసతిః అలకా, నామ, యక్షేశ్వరాణాం,

అని మల్లె పొదల్ని అడిగినట్లు 'తెలుగుల పుణ్యపేటి' పోతనామాత్యుడు చెప్పేడు.
అలం: అర్థాంతరన్యాసాను ప్రాణిత విషమం.

**జాతం వంశే భువన విదితే పుష్కరావర్తకా నాం**
**జానామి త్వాం ప్రకృతి పురుషం కామరూపం మఘోనః ।**
**తేనార్థిత్వం త్వయి విధివశాద్దూర బన్ధుర్గతోహం**
**యాఞ్చా మోఘా వరమధిగుణే నాధమే లబ్ధకామా ॥** 6

**పదచ్ఛేదం** : జాతం, వంశే, భువన విదితే, పుష్కరావర్తకానాం, జానామి, త్వాం, ప్రకృతి, పురుషం, కామరూపం, మఘోనః, తేన, అర్థిత్వం, త్వయి, విధివశాత్, దూరబన్ధుః, గతః, అహం, యాఞ్చా, మోఘా, వరం, అధిగుణే, న, అధమే, లబ్ధకామా.

**అన్వయం** : (హేమేఘ !) త్వాం, భువనవిదితే, పుష్కరావర్తకానాం, వంశే, జాతం; కామరూపం, మఘోనః, ప్రకృతి పురుషం; జానామి. తేన, విధివశాత్, దూరబంధుః, అహం, త్వయి, అర్థిత్వం, గతః, అధిగుణే, యాఞ్చా, మోఘా, వరం; అధమే, (యాఞ్చా) లబ్ధకామా, అపి, న(వరం).

**ప్రతిపదార్థం** : (హేమేఘ ! = ఓ మేఘుడా!); త్వాం = నిన్ను; భువనవిదితే = సమస్త భువనములలో ప్రసిద్ధి నొందిన; పుష్కరావర్తకానాం = (శ్రేష్ఠమైన) పుష్కరావర్తకము యొక్క; వంశే, జాతం = వంశము నందుద్భవించిన వానిని గను; కామరూపం = ఇచ్ఛాధీన విగ్రహము కలవానినిగను (పర్వతాదుల యందు సంచరించుటకు తగిన); మఘోనః= ఇంద్రుడు; ప్రకృతిపురుషం= ప్రధానపురుషుడైన (మూలపురుషుడుగా) వానినిగను; జానామి = ఎఱుగుదును; తేన = ఆకారణముచేత; విధివశాత్ = విధివశమువలన; దూరబంధుః, అహం= భార్యావియుక్తుడనైననేను; త్వయి, అర్థిత్వం, గతః = నీయందు అర్థిత్వము నొందితిని (నిన్నుయాచిస్తున్నాను); అధిగుణే = గుణాఢ్యులయందు; యాఞ్చా = యాచన; మోఘా, వరం = విఫలమైనను మంచిదే; అధమే = గుణహీనులయెడల; లబ్ధకామా, న = సఫల మైనను మంచిదికాదు.

**తాత్పర్యం** : ఓ మేఘుడా ! నిన్ను సకల భువన ప్రశస్తి కల పుష్కరావర్త వంశోద్భవునిగ, కామరూపిగను, ఇంద్రుడు ప్రధానపురుషుడుగా కలవానినిగ తెలియుదును. అందువలన విధివశాత్తు భార్యావియుక్తుడనైననేను నిన్ను యాచిస్తున్నాను. ఎందుకంటే గుణాఢ్యుల పట్ల యాచన విఫలమైనను మేలే ! గుణహీనుల పట్ల సఫలమైనను శ్రేయస్కరముకాదు.

కుబేరుని ఆగ్రహానికి పాత్రుడనైన నాసందేశాన్ని నా ప్రియురాలికి అందించమని రెండవ చరణంలో చెప్పేడు. మరి ఆవిడ ఎక్కడుంటుంది? అనే ప్రశ్నకు చివరి రెండు చరణాల్లోనూ సమాధానం చెప్పేడు.

ఆమె నివాసం యక్షేశ్వరుడైన కుబేరుని ముఖ్యపట్టణం అలకానగరం. ఆ నగరశోభ? ఇంటి ముందు ఉద్యానవనాలు ముచ్చట గొల్పుతుంటాయి. అక్కడి భవనాలు తెల్లగా ఉంటాయి. ఎటువంటి తెలుపది? శివుని జటాజూటంలో ఉండే, చంద్రవంకలోని వెన్నెల ఎటువంటి తెలుపో అటువంటి తెలుపు. అంతేకాదు, ఆబాహ్యోద్యానాలు శివుని ప్రతిమలతో అలరారు తున్నాయి. శివుని నివాస భూములవి.

ఇక్కడ చమత్కారం ఏమిటంటే శివుడు కుబేరుని స్నేహితుడు. కుబేరుడు ధనపతియైతే శివుడు బిచ్చగాడు. అయినా ఇంతటి ధనపతి తన స్నేహితుని ఫాలచంద్రుని కాంతి వంటి కాంతికల ధవళమైన హర్మ్యాలు నిర్మించుకొన్నాడు తన నగరంల్లో. శివుని చెప్పడంవలన ఆ పవిత్రత, చంద్రికా ధౌత మనడంలో ఆనగరం విశుద్ధతా వ్యంగ్య మర్యాద ననుసరించి చెప్పినట్లైంది. మరొక చిన్నవిశేషం భాషా సంప్రదాయ సంబంధి. ''తే గంతవ్యా'' ''అంటే నీచేత వెళ్ళ తగినది'' అని అర్థం. సంస్కృతంలోనూ, ఆంగ్లంలోనూ ఇటువంటి కర్మణి ప్రయోగాలుంటాయి. ''నీవు వెళ్ళుము'' వంటి కర్తరి ప్రయోగమే ఆంధ్ర భాషా మర్యాద.

**త్వా మారూఢం పవనపదవీ ముద్గృహీతాలకాన్తాః**
**ప్రేక్షిష్యన్తే పథిక వనితాః ప్రత్యయాదాశ్వ సన్త్యః ।**
**కః సన్నద్ధే విరహవిధురా త్వయ్యు పేక్షేత జాయాం**
**నస్యాదన్యో ఽ ప్యహమివ జనోయః పరాధీన వృత్తిః ॥** 8

**పదచ్ఛేదం** : త్వాం, ఆరూఢం, పవన పదవీం, ఉద్గృహీత + అలకాన్తాః ప్రేక్షిష్యన్తే, పథిక వనితాః, ప్రత్యయాత్, ఆశ్వసన్త్యః, కః, సన్నద్ధే, విరహవిధురాం, త్వయి, ఉపేక్షేత, జాయాం, న, స్యాత్, అన్యః, అపి, అహమ్ + ఇవ, జనః, యః, పరాధీన వృత్తిః.

**అన్వయం** : పవన పదవీం, ఆరూఢం, త్వాం, పథికవనితాః, ప్రత్యయాత్, ఆశ్వసన్త్యః, ఉద్గృహీతాలకాన్తాః ప్రేక్షిష్యన్తే, త్వయి, సన్నద్ధే, విరహవిధురాం, జాయాం, కః, ఉపేక్షేత, అన్యః, అపి, యః, జనః, అహమివ, పరాధీన వృత్తిః, న, స్యాత్.

**ప్రతిపదార్థం** : పవనపదవీం = ఆకసమును; ఆరూఢం = అధిరోహించిన; త్వాం =

బాహ్యోద్యాన స్థితహర శిరశ్చంద్రికా ధౌతహర్మ్యా.

**అన్వయం**:(హే) పయోద, త్వం, సంతప్తానాం, శరణం, తత్, ధనపతిక్రోధవిశ్లేషితస్య, మే, సందేశం, ప్రియాయాః, హర. బాహ్యోద్యానస్థిత హరశిరశ్చంద్రి కాధౌతహర్మ్యా, అలకానామ, యక్షేశ్వరాణాం, వసతిః, గంతవ్యా.

**ప్రతిపదార్థం** :హే పయోద ! = ఓ మేఘుడా !; త్వం = నీవు; సంతప్తానాం = (ఎండ చేతకాని ప్రవాస విరహముచేతకాని) బాధనొందినవారలకు; శరణం = రక్షకుడవు; ధనపతి క్రోధవిశ్లేషితస్య = కుబేరుని ఆగ్రహమునకు పాత్రుడనైన; మే సందేశం = నా సందేశమును; ప్రియాయాః = ప్రియురాలికి; హర = తీసికొని పొమ్ము; బాహ్యోద్యాన స్థితహరశిరశ్చంద్రికా = వెలుపలితోటలయందున్న ఈశ్వరుని శిరస్సు నందున్న చంద్రుని వెన్నెల వలె ; ధౌతహర్మ్యా = తెల్లనైన భవనములతోనున్న ; అలకానామ = 'అలక' అను పేరుగల; యక్షేశ్వరణాం, వసతిః = కుబేర నగరము; తే = నీచేత; గంతవ్యా = వెళ్లతగినది.

**తాత్పర్యం** : ఓమేఘుడా ! నీవు బాధితులకు రక్షకుడవు. అందువలన కుబేరాగ్రహ పాత్రుడనైన నా సందేశాన్ని ప్రియురాలికి గొనిపోయి మా విరహ వ్యధనపనయింపుము. ఇంటి ముంగిలి ప్రాంతమున ఉన్న ఉద్యానవనములలో, శివుని శిరస్సుపై నున్న వెన్నెల వలె తెల్లనైన భవనములతో ఒప్పుచున్న కుబేరుని అలకాపట్టణమునకు పొమ్ము.

**'శ్రీకళా' వ్యాఖ్య**: ఇందులో ప్రథమ పాదం మేఘుని ప్రశంస, రెండవ పాదంలో యక్షుని ప్రార్థన చివరి రెండు పాదాలు మేఘుడు చేరవలసిన – అంటే యక్షుని ప్రేయసి నివసించే అలకాపట్టణపు గుర్తులూ కవి చెప్పేడు.

''అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణం మమ'' అన్నట్లు బాధితులకు నీవే రక్షకుడవయ్యా అని మేఘుని ప్రశంసించేడు యక్షుడు. ఈ బాధితులు రెండు రకాలు. భౌతికమైన బాధ, మానసికమైన వియోగవ్యథ. ఎండవలన ప్రాణులు బాధకు లోనైనప్పుడు మేఘం వర్షించడంవల్ల శరీరానికి హాయి కలుగుతుంది. ప్రేయసీ ప్రియులు ఎడబాసి ఉన్నప్పుడు మేఘాగమనం వల్ల సమాగమేచ్ఛ ఉద్భుతమై వారు కలిసికొంటారు. దీర్ఘకాల వియోగానంతర సంయోగం ప్రేమికులకు మహోన్నతమైన ఆనందాన్ని కలిగిస్తుంది. ఆవిధంగా భౌతిక మానసిక బాధల్ని తీర్చేవాడవని మేఘుని కీర్తించడం వల్ల అతడు ప్రసన్నుడౌతాడు.

మేఘసందేశ కావ్యంచక్కనినైరూప్య చిత్రం. భావనకు మాత్రమే అందు నటువంటిది. జీవికి భావుకత మౌలికమైన ధర్మం. కాలపుతాకిడికి నిలచి శతాబ్దాలు గడిచినాచెక్కుచెదరక నిలిచేఈ నవనవోన్మేషమైన భావుకతే వ్యక్తిని మహోన్నత శిఖరాలకు చేర్చుతోంది. అలం : అర్థాంతరన్యాసం.

**మన్దం మన్దం నుదతి పవనశ్చానుకూలో యథాత్వాం**
**వామశ్చాయం నదతి మధురం చాతకస్తే సగన్ధః ।**
**గర్భాధానక్షణ పరిచయాన్నూన మాబద్ధమాలాః**
**సేవిష్యన్తే నయనసుభగం ఖే భవన్తం బలాకాః ॥** 9

**పదచ్ఛేదం :** మన్దం, మన్దం, నుదతి, పవనః, చ, అనుకూలః, యథా, త్వాం, వామః, చ, అయం, నదతి, మధురం, చాతకః, తే, సగన్ధః, గర్భాధాన క్షణపరిచయాత్, నూనం, ఆబద్ధమాలాః, సేవిష్యన్తే, నయనసుభగం, ఖే, భవన్తం, బలాకాః.

**అన్వయం :** అనుకూలః, పవనః, త్వాం మన్దం మన్దం, నుదతి, అయం, సగన్ధః, తే, వామః, చాతకః, మధురం, నదతి. గర్భాధానక్షణపరిచయాత్, బలాకాః, ఖే, ఆబద్ధమాలాః, నయనసుభగం, భవన్తం, నూనం, సేవిష్యన్తే.

**ప్రతిపదార్థం :** అనుకూలః, పవనః = అనుకూలమైనగాలి; త్వాం=నిన్ను; మన్దం మన్దం=మెల్లమెల్లగా ; నుదతి=ప్రేరేపించును; అయం, సగన్ధః=ఈగంధము(తో) గర్వముతో; తే=నీయొక్క; వామః=ఎడమవైపున; చాతకః=చాతకపక్షులు; మధురం, నదతి=శ్రావ్యమైన శబ్దములు చేయును; గర్భాధానక్షణపరిచయాత్=గర్భాధాన సుఖమునకై; బలాకాః=ఆడకొంగలు(బలాకాంగనలు); ఖే=ఆకసమున; ఆబద్ధమాలాః= బారులుతీరి; నయనసుభగం=కంటికింపై, భవన్తం=నిన్ను; నూనం=నిజముగా; సేవిష్యన్తే=సేవింతురు.

**తాత్పర్యం:** అనుకూలమైన గాలి నిన్నుమెల్లమెల్లగా ప్రేరేపిస్తుంది. గర్వించిన చాతకపక్షులు నీ ఎడమవైపున శ్రావ్యంగా నినదిస్తాయి. గర్భాధాన సుఖమును కాంక్షిస్తూ ఆకాశంలో బారులు తీరి కంటికింపైనవై నిన్ను సేవిస్తాయి.

**'శ్రీకళా' వ్యాఖ్య:** అనుకూలవాయువు, చాతకపక్షుల శబ్దాలతో ఎడమవైపుగా పక్షులు బారులు తీరడం శుభశకునాలని శకున శాస్త్రం చెబుతోంది. మేఘుని ప్రయాణానికి శుభశకునాలని ఆకాంక్షిస్తున్నాడు యక్షుడు. మేఘం తాను స్వయంగా పయనించదు.

నిన్ను; పథికవనితాః= ప్రోషిత భర్తృకలు; ప్రత్యయాత్= విశ్వాసమువలన( ప్రియులరాక యందలి విశ్వాసమువలన); ఆశ్వసన్త్యః = ఊరడిల్లినవారై ; ఉద్గృహీతాలకాన్తాః = (తమ) ముంగురులను పైకెత్తి; ప్రేక్షిష్యన్తే = చూతురు; త్వయి = నీవు; సన్నద్ధే (సతి)= తిరుగుచుండగా; విరహవిధురాం = విరహవివశలైన; జాయాం = భార్యను; కః = ఎవడు; ఉపేక్షేత = ఉపేక్షించగలడు? (ఎవడునూ ఉపేక్షించడని భావము); అన్యః + అపి = (నేనుకాక) మరెవడైనను; యః జనః = ఏజనుడు; అహమివ = నావలె; పరాధీన వృత్తిః = అస్వతంత్రుడు; న స్యాత్ = కాడు.

**తాత్పర్యం** : ఆకసమునధిరోహించిన నిన్ను విశ్వసించి ప్రోషిత భర్తృకలు తమ భర్తలు తిరిగి వత్తురని విశ్వసింతురు. తమ ఫాలభాగముపైబడు ముంగురుల అగ్రములను పైకెత్తి చూతురు. ఏలనన విరహవివశలైన భార్యను ఎవడు పేక్షించును? నావంటి అస్వతంత్రుడు తప్ప?

**'శ్రీకళా' వ్యాఖ్య** : యక్షుడు మేఘునితో చెబుతున్నాడు. ఆకాశమార్గంలో నువ్వు విహరిస్తూ ఉంటే పథిక వనితలు - పథికులంటే బాటసారులు వారిస్త్రీలు. అంటే ప్రోషిత భర్తృకలు. భర్తమరో ప్రదేశానికి వెడితే ఆ ఎడబాటుతో ఖిన్నయై భర్తరాక కోసం ఎదురు చూసే స్త్రీని అష్టవిధ నాయికల్లో 'ప్రోషిత భర్తృక' అంటారు. అటువంటి స్త్రీలకు మేఘాగమనం వల్ల భర్తృసమాగమేచ్ఛ అధికమై తమ భర్తలు కూడ మేఘ దర్శనంతో తమను కలిసి కోవడానికి వస్తారనే విశ్వాసంతో, మేఘుని తమఫాల భాగంపై చెదురుతున్న ముంగురులు పైకెత్తికొని చూస్తారు. చిత్ర కారునికి చక్కని దృశ్యాన్ని కాళిదాసు ఈ శ్లోకంలో ఇస్తున్నాడు.

ముఖ్యంగా మేఘ సందేశంలోని ప్రతి శ్లోకం చిత్రకారులకు మంచివస్తువు. పాఠకుడు భావుకుడైతే చక్కని చిత్రాన్ని తన మనోపటంపై చిత్రించుకుంటాడు. అది తానొక్కడే చూచే చిత్రంకనుక గొప్ప చిత్రకారుడు చిత్రించే చిత్రంకంటె అందమైన చిత్రాన్ని సాక్షాత్కరించుకోగలడు. శ్లోక భావాన్ని భావించు కోగల భావనాబలంపై ఆమనో చిత్రం భవ్యత ఆధారపడి ఉంటుంది.

అంతటి అద్భుత దృశ్యాన్ని చెప్పి యక్షుడు తన అశక్తతకు చింతిస్తున్నాడు. తన వంటి అస్వతంత్రుడు, పరాధీనుడు తప్ప మేఘదర్శనమైన తరువాత కూడా విరహియైన భార్యను ఎవడు ఉపేక్షిస్తాడనే అర్థాంతర న్యాసాలంకార ముక్తాయింపుతో స్వతంత్రుడైన వాడెవడూ ఆకాశంలో మేఘ సందర్శనం అయిన తరువాత క్షణకాలం కూడా ఉపేక్షించకుండా, ప్రేయసి సన్నిధికి చేరుకుంటాడంటాడు.

వాడవగుచు; అవశ్యం, ద్రక్ష్యసి= తప్పకచూడగలవు. ఆశాబన్ధః= ఆశ అనెడి బంధము; ప్రణయి= (ప్రణయిని) ప్రేమయుక్తమైన; కుసుమసదృశం= పుష్పములతో సమానమైనది (సుకుమారమైనది); విప్రయోగే= విరహమున; సద్యఃపాతి= శీఘ్రమే భ్రంశమగును; అంగనానాం = స్త్రీలయొక్క ; హృదయం= జీవితము; ప్రాయశః= సాధారణముగ; రుణద్ధి= బంధించును.

**తాత్పర్యం:** ఓమేఘుడా! శాపావసాన దినములు లెక్కించుటయందే తత్పరయై సజీవయు, పతివ్రతయు నగు సోదరపత్నియైన ఆమెను తప్పక చూడగలవు. ఆశాబంధము ప్రేమయుక్తమై సుమసుకుమారమైనది. విరహమున శీఘ్రమే భ్రంశమగును. అది (ఆశాబంధము) యే స్త్రీలయొక్క జీవితమును బంధించునది.

**'శ్రీకళ' వ్యాఖ్య:** యక్షుడు తన భార్యకు పరపురుషుడైన మేఘునితో సందేశం పంపుతున్నాడు. తన భార్య సౌశీల్యాన్నీ, ఆమెతో మేఘునకుండవలసిన సంబంధాన్నీ 'ఏకపత్నీం' 'భ్రాతృజాయాం' (మాతృసమాన) అనే పదాల్లో కవి సూచించేడు. సందేశ ప్రాముఖ్యాన్ని శ్లోకం ఉత్తరార్థంలో సూచించేడు. ప్రేమికుల జీవితాన్ని బంధించేది 'ఆశాబంధమనీ, విరహం వలన అది అతి శీఘ్రంగా తెగి మరణానికి కారణమౌతుందనీ, ఈ సందేశం తీసికొని వెళ్ళడం వలన తిరిగి జీవితాశ చిగురిస్తుందనీ చెబుతున్నాడు. అలం : అర్థాంతరన్యాసం.

**కర్తుంయచ్చ ప్రభవతి మహీముచ్ఛిలీన్ధ్రామవన్ధ్యాం**
**తచ్ఛ్రుత్వాతే శ్రవణసుభగం గర్జితం మానసోత్కాః l**
**ఆ కైలాసాద్బిసకిసలయచ్ఛేద పాథేయవన్తః**
**సంపత్స్యన్తే నభసి భవతో రాజహంసాః సహాయాః ll** 11

**పదచ్ఛేదం :** కర్తుం, యత్, చ, ప్రభవతి, మహీం, ఉత్ + శిలీన్ధ్రాం, అవన్ధ్యాం, తత్, శ్రుత్వా, తే, శ్రవణసుభగం, గర్జితం, మానసోత్కాః, ఆకైలాసాత్, బిసకిసలయ ఛ్ఛేద పాథేయవన్తః, సంపత్స్యన్తే, నభసి, భవతః, రాజహంసాః, సహాయాః.

**అన్వయం :** యత్, గర్జితం, మహీం, ఉచ్ఛిలీన్ధ్రాం, అవన్ధ్యాం, కర్తుం, ప్రభవతి, తత్, శ్రవణసుభగం, తే, (గర్భితం), శ్రుత్వా, మానసోత్కాః, (ఉత్సుకాఃభవన్తి), బిసకిసలయచ్ఛేద పాథేయవన్తః, రాజహంసాః, నభసి, భవతః, ఆకైలాసాత్, సహాయాః, సంపత్స్యన్తే.

గాలి వాటుననుసరించి మేఘగతి ఉంటుంది. అనుకూలవాయువు మెల్లమెల్లగా వీచడం వలన మేఘం చెదిరిపోయిన శకలాలుగా కాక స్థిరంగా సాగుతుంది. ఒక పని మీద వెడుతున్నప్పుడు ఇలా మృదువైన వాయువు వీచడం వల్ల ఫలం అనుకూలంగా ఉంటుంది. అదే తీవ్రమైన గాలివీస్తే వెళ్ళేపనికాదని భారతీయుల విశ్వాసం.

ఈ చల్లని గాలి ఉత్సాహాన్నిచ్చి క్రియోన్ముఖంగా ప్రేరేపిస్తుంది. నీకు ఎడమవైపున చాతకపక్షులు శ్రావ్యంగా నినదిస్తూ ఉంటాయి. అవ్యక్తమధురాలైన ఆ పక్షుల కూజితాలూ కార్యసిద్ధిని సూచించే శకునమే.

ఈ రెండు శకునాలతో పాటు మరో నిమిత్తాన్ని కూడా సూచిస్తున్నాడు. ఆకాశంలో బలాకలు ఒక మాలగా ఏర్పడి గర్భాధానోత్సవాన్ని జరుపుకుంటాయి. బలాకలు ఆకాశంలో మాలాగా ఏర్పడి క్రీడించి గర్భాల్ని ధరిస్తాయుట!

*"గర్భాధాన సుఖార్థం త్వత్సమీపే బద్ధ పంక్తయ ఇత్యర్థః"* అని మల్లినాథ సూరి వ్యాఖ్యానం. కర్ణోదయంలో –

*"గర్భంబలాకా దధతేఽభ్రయోగాన్నాకే నిబద్ధావలయః సమన్తాత్"* –

అని ఉందని కూడా మల్లినాథసూరే చెప్పేడు. అలం : అర్థాంతర న్యాసం.

**తాం చావశ్యం దివసగణనాతత్పరామేకపత్నీ-**
**మవ్యాపన్నామవిహతగతిర్ద్రక్ష్యసి భ్రాతృజాయామ్ ।**
**ఆశాబన్ధః కుసుమ సదృశం ప్రాయశోహ్యఙ్గనానాం**
**సద్యఃపాతి ప్రణయి హృదయం విప్రయోగే రుణద్ధి ॥** 10

**పదచ్ఛేదం:** తాం, చ, అవశ్యం, దివసగణనాతత్పరాం, ఏకపత్నీం, అవ్యాపన్నాం, అవిహతగతిః, ద్రక్ష్యసి, భ్రాతృజాయామ్, ఆశాబన్ధః, కుసుమసదృశం, ప్రాయశః, హి, అఙ్గనానాం, సద్యః, పాతి, ప్రణయి హృదయం, విప్రయోగే, రుణద్ధి.

**అన్వయం :** దివసగణనాతత్పరాం, అవ్యాపన్నాం, ఏకపత్నీం, భ్రాతృజాయాం, తాం, అవిహతగతిస్సన్ అవశ్యం, ద్రక్ష్యసి, ఆశాబన్ధః. ప్రణయి, హృదయం, అంగనానాం కుసుమసదృశం; విప్రయోగే, సద్యఃపాతి, ప్రాయశః, రుణద్ధి.

**ప్రతిపదార్థం :** హేమేఘ! దివసగణనాతత్పరాం=మిగిలిన దినములు లెక్కించుటలో ఆసక్తికలిగి; అవ్యాపన్నాం= సజీవయైన; ఏకపత్నీం= పతివ్రతయగు; భ్రాతృజాయామ్= సోదరపత్నియగు; తాం=ఆమెను; అవిహత గతిస్సన్ = ఆటంకములేని గమనము కల

**ప్రతిపదార్థం :** తుఙ్గం=ఎత్తైన (మహోన్నతులైన); పుంసాం= పురుషులచే; వన్ద్యైః= నమస్కరించతగిన (ఆరాధింపతగిన); రఘుపతిపదైః= శ్రీరాముని పాదములచే; మేఖలాసు= పర్వత కటకమున; అఙ్కితం= గుర్తుకలిగిన, ప్రియసఖం= ప్రియమిత్రుని; అముం, శైలం= ఈ చిత్రకూట పర్వతమును; ఆలిఙ్గ్య= కౌగలించుకొని; ఆపృచ్ఛస్వ= అడుగుము (ముచ్చటింపుము); కాలే కాలే= ప్రతి ప్రావృట్కాలమున; భవతః, సంయోగం, ఏత్య= నీసాహచర్యము నొంది (సంపర్కమునొంది); చిరవిరహజం = చాలకాలము వియోగము నొందుటచే కలిగిన; ఉష్ణం, బాష్పం, ముఞ్చతః= వేడి కన్నీటిని విడచుటచే; స్నేహవ్యక్తిః భవతి= ప్రేమ ఆవిర్భూతమగును.

**తాత్పర్యం :** శ్రీరాముని పదపంకజముద్రలు కల, నీ మిత్రుడైన చిత్రకూట పర్వతాన్ని కౌగిలించుకొని వీడ్కోలు తీసికొనుము. ప్రతి వర్షాకాలంలో నీసంపర్కం లభించడంతో దీర్ఘవియోగజనిత దుఃఖాశ్రువులు మీ ప్రేమ బంధాన్ని దృఢపరుస్తాయి.

**'శ్రీకళా' వ్యాఖ్య :** చిత్రకూటం నుంచి మేఘుడు బయలుదేరాలి. ఆచిత్రకూట పర్వతానికీ, మేఘునికీ గాఢమైన మైత్రి. మేఘుడు సంవత్సరమంతా దేశసంచారం చేసి ఆషాఢశుద్ధ పాడ్యమికి చిత్రకూటానికి చేరుతాడన్నమాట. సంవత్సర వియోగానంతరం కలిసిన మిత్రులు కౌగిలించుకొని తద్వియోగజనిత దుఃఖభారంతో అశ్రువులు విడుస్తారు. ఆరమ్యమైన సన్నివేశమే వారి మైత్రిని మరింత దృఢపరుస్తుంది.

ఇక చిత్ర కూటం ఎంతటి పవిత్రమైంది? మహాపురుషులచే పూజలనందుకొన్న శ్రీరామచంద్రుని పాదముద్రలతో శోభిస్తోంది.

ప్రథమశ్లోకంలో అచటి జలాలు సీతాసాధ్వి స్నానం చేయడంతో పవిత్ర మైనాయని చెప్పి ఇప్పుడు ఆరామపదపంకజ గుర్తులతో పర్వతం పవిత్రమైందని చెబుతున్నాడు.

శృంగారకావ్యమైనా ఆ శృంగారానికొక పవిత్రతను ఆపాదించడం వలన తృతీయ పురుషార్థ అంగిరసానికి స్వచ్ఛతాపవిత్రతలను ఆపాదించడం మహాకవి మనీష.

*మేఘపర్వతయోఽబ్జ సూర్యయోరబ్ధి చన్ద్రయోః ।*
*శిఖిజీమూతయోర్మైత్రీవాతాగ్న్యయోశ్చ స్వభావతః ॥*

పర్వతానికీ, మేఘానికీ ; పద్మానికీ, సూర్యునికీ; సముద్రానికీ, చంద్రునికీ; నెమలికి, మేఘానికీ; గాలికీ, అగ్నికి మైత్రి నిసర్గమైనదని భావం.

**ప్రతిపదార్థం** : యత్, గర్జితం=ఏ (నీయొక్క మేఘ) గర్జన; మహీం=భూమిని, ఉచ్ఛిలీన్ధ్రాం (ఉత్+ శిలీన్ధ్రాం) = క్రొత్తమొలకలను మొలిపించి; అవన్ధ్యాం=ఫలవంతము; కర్తుం, ప్రభవతి=చేయుటకు సమర్థమగుచున్నదో; తత్=ఆ, శ్రవణసుభగం= చెవికింపైన, తే( గర్జితం) శ్రుత్వా= నీ గర్జనను విని; మానస ఉత్కాః= మానస సరోవరమున ఉత్సుకము లైన; బిసకిసలయచ్ఛేదపాథేయవన్తః= తామరచిగుళ్ళను ఛేదించుటచే దారిబత్తెము కలిగిన; రాజహంసాః= రాజహంసలు; నభసి= ఆకసమునందు; భవతః= నీకు; సహాయాః సంపత్స్యన్తే= తోటి ప్రయాణీకులు కాగలరు.

**తాత్పర్యం** : ఏ(నీమేఘ) గర్జన భూమిని క్రొత్తమొలకలతో ఫలవంతమొనర్ప సమర్థమగుచున్నదో ఆ చెవికింపైన నీ గర్జనను విని మానససరోవరమున ఉత్సుకత నొంది తామర చిగుళ్ళు (శకలములను)ను దారిబత్తెము చేసికొనిన రాజహంసలు ఆకాశ( యాన) మున నీకు తోటి ప్రయాణీకులు కాలగరు.

**'శ్రీకళా' వ్యాఖ్య** : మేఘగర్జన వలన భూమిలో మొలకలు ఉత్పన్నమౌతాయని ప్రసిద్ధి. అది సఫలమై భువిని సస్యశ్యామలంచేస్తుంది. (చెవికింపైన) వీనులవిందైన ఆమేఘగర్జనను విని మానససరోవరంలో ఉత్సుకతనొందిన రాజహంసలు తామరచిగుళ్ళను చిన్న చిన్న ముక్కలుగా త్రుంపి కైలాసపర్వతం చేరడానికి ఈ శకలాలను దారిబత్తెంగా సమకూర్చుకొంటాయి. ఆ రాజహంసలు నీకు తోటి ప్రయాణీకులౌతారని మేఘుని యక్షుడు ప్రరోచన చేస్తున్నాడు.

**ఆపృచ్ఛస్వ ప్రియసఖమముం తుఙ్గమాలిఙ్గ్యశైలం**
**వన్ద్యైః పుంసాం రఘుపతిపదైరఙ్కితం మేఖలాసు ।**
**కాలేకాలే భవతి భవతో యస్య సంయోగమేత్య**
**స్నేహవ్యక్తి శ్చిరవిరహజం ముఞ్చతో బాష్పముష్ణమ్ ॥** 12

**పదచ్ఛేదం**: ఆపృచ్ఛస్వ, ప్రియసఖం, అముం, తుఙ్గం, ఆలిఙ్గ్య, శైలం, వన్ద్యైః, పుంసాం, రఘుపతిపదైః అఙ్కితం, మేఖలాసు, కాలేకాలే, భవతి, భవతః, యస్య, సంయోగం, ఏత్య, స్నేహవ్యక్తిః, చిరవిరహజం, ముఞ్చతః, బాష్పం, ఉష్ణమ్.

**అన్వయం** : ప్రియసఖం, తుఙ్గం, పుంసాం, రఘుపతిపదైః, మేఖలాసు, అఙ్కితం, అముం, శైలం, ఆలిఙ్గ్య, ఆపృచ్ఛస్వ, కాలేకాలే, భవతః, సంయోగం, ఏత్య, చిరవిరహజం, ఉష్ణం, బాష్పం, ముఞ్చతః, స్నేహవ్యక్తిః, భవతి.

'పరిలఘు' - 'స్రోతసాం' సరస్సులయందలి నీరు రాళ్ళమీద ప్రవహిస్తూ ఉంటుంది. ఆరాళ్ళు ఓషధిసంయుక్తాలై ఉంటాయి. ఆఓషధీగుణం నీటికీ సంక్రమిస్తుంది. 'నీటిమార్పు' వల్ల ఆరోగ్యంలో మంచిచెడులు సంభవిస్తూ ఉంటాయి. ''నీళ్ళు పడలేదు'' అంటూ ఉంటాం. మేఘుడు సరస్సుల్లో నీటిని స్వీకరించి దాన్నే వర్షంగా ఇస్తాడు.

''నిత్యవీప్సయోః'' అనే సూత్రం వలన నిత్యార్థంలోనూ (అంటే ఎల్లప్పుడూ అనే అర్థంలోనూ, వీపార్థంలోనూ ద్విర్భావం వస్తుంది. అంటే పదాన్ని రెండుసార్లు ప్రయోగించడం జరుగుతుంది.

''వ్యాప్తుం ఇచ్ఛావీప్సా'' అన్నిటికీ అనే అర్థం. ఉదాహరణ: వృక్షం వృక్షం సించతి, గ్రామం గ్రామం గచ్ఛతి. ఇంతేకాకుండా ఆదరార్థంలో కూడా ఈ ద్విర్భావం వస్తుంది. ఉదా: పుత్రపుత్ర. భయార్థంలో కూడా – ఉదా: సర్పః సర్పః.

**అద్రేః శృఙ్గం హరతి పవనః కింస్విదిత్యున్ముఖీభి**
**దృష్టోత్సాహశ్చకిత చకితం ముగ్ధ సిద్ధాఙ్గనాభిః।**
**స్థానా దస్మాత్సరస నిచులాదుత్పతోదఙ్ముఖఃఖం**
**దిఙ్నాగానం పథిపరిహరన్స్థూల హస్తావలేపాన్॥** 14

**పదచ్ఛేదం** : అద్రేః, శృఙ్గం, హరతి, పవనః, కింస్విత్, ఇతి, ఉన్ముఖీభిః (ఉత్+ముఖిః) దృష్టోత్సాహః, చకితచకితం, ముగ్ధసిద్ధాంగనాభిః, స్థానాత్, అస్మాత్, సరసనిచులాత్, ఉత్పతః ఉదఙ్ముఖః, ఖం, దిఙ్నాగానాం, పథి, పరిహరన్, స్థూలహస్తావలేపాన్.

**అన్వయం**: పవనః అద్రేః, శృఙ్గం, హరతి, కింస్విత్, ఇతి, ఉన్ముఖీభిః, ముగ్ధసిద్ధాంగనాభిః, చకితచకితం, దృష్టోత్సాహః, సరసనిచులాత్, అస్మాతే స్థానాత్, దిఙ్నాగానాం, స్థూలహస్తావలేపాన్, ఉదఙ్ముఖః, ఖం, హరతి.

**ప్రతిపదార్థం**: పవనః= వాయువు; అద్రేఃశృఙ్గం=కొండకొమ్మును; హరతి కింస్విత్, ఇతి= 'కొట్టుకొని వెళ్ళిపోతోందా' అని; ఉత్+ముఖీభిః= ముఖములను పైకెత్తుకొని; దృష్ట + ఉత్సాహః = ఉత్సాహముతో చూచుచు; చకితచకితం= ఆశ్చర్యాతిరేకముతో; ముగ్ధసిద్ధాంగనాభిః= అమాయికలైన సిద్ధాంగనల యొక్క; అస్మాత్ స్థానాత్ = ఆ స్థానము నుండి; సరసనిచులాత్= నీటి ప్రబ్బలినుండి; దిఙ్నాగానాం= దిగ్గజములు; స్థూలహస్తావలేపాన్= బలిష్ఠములైన చేతుల (తొండము); పరిహరన్= విదళించుచు; ఖం, ఉత్పతః, ఉదఙ్ముఖఃసన్= ఆకాశమార్గమున పైకి చూచువాడవై; హరతి కింస్విత్= విదళించి పోవుచున్నవానివలె పొమ్ము.

**మార్గం తావచ్ఛృణు కథయతస్త్వత్ప్రయాణానురూపం**
**సందేశంమే తదనుజలదశ్రోష్యసి శ్రోత్రపేయమ్ ।**
**ఖిన్నః ఖిన్నః శిఖరిషు పదం న్యస్యగన్తాసి యత్ర**
**క్షీణః క్షీణః పరిలఘు పయఃశ్రోతసాం చోపభుజ్య ॥** 13

**పదచ్ఛేదం :** మార్గం, తావత్, శృణు, కథయతః, త్వత్, ప్రయాణ + అనురూపం, సందేశం, మే, తత్, అను, జలద, శ్రోష్యసి, శ్రోత్రపేయమ్; ఖిన్నః, ఖిన్నః, శిఖరిషు, పదం, న్యస్య, గన్తాసి, యత్ర, క్షీణః, క్షీణః, పరిలఘు, పయః, శ్రోతసాం, చ, ఉపభుజ్య.

**అన్వయం :** హే జలద, తావత్, కథయతః, త్వత్, ప్రయాణానురూపం, మార్గం, శృణు, తదను, శ్రోత్రపేయం, మే, సందేశం, శ్రోష్యసి, ఖిన్నః, ఖిన్నః, శిఖరిషు, పదం, న్యస్య క్షీణః, క్షీణః, శ్రోతసాం, పరిలఘు, పయః, చ, ఉపభుజ్య, గన్తాసి.

**ప్రతిపదార్థం :** హే జలద! = ఓ మేఘుడా!; త్వత్, ప్రయాణ అనురూపం= నీ ప్రయాణమునకనుకూలమైన; మార్గం= మార్గమును; తావత్ = ఇప్పుడు; కథయతః=చెప్పుచున్నాను.; శృణు= వినుము; తదను= ఆపిమ్మట; శ్రోత్రపేయం= వీనులవిందైన; మే సందేశం= నా సందేశమును; శ్రోష్యసి= వినగలవు; ఖిన్నః ఖిన్నః= మార్గాయాసమునొందినవాడవై; శిఖరిషు= పర్వతాగ్రములయందు; పదం= (నీయొక్క) పాదమును; న్యస్య= ఉంచి; క్షీణఃక్షీణః= కృశాంగుడవై; శ్రోతసాం= సరస్సులలో; పరిలఘు= దోషరహితమైన; పయః= నీటిని; ఉపభుజ్య=సేవించి; గన్తాసి= వెళ్ళగలవు.

**తాత్పర్యం :** ఓ మేఘుడా! నీ ప్రయాణానుకూలమైన మార్గాన్ని ఇప్పుడు చెబుతున్నాను విను. ఆతర్వాతే వీనులవిందైన నా సందేశాన్ని వింటావు. మార్గాయాసంతో పర్వతాగ్రాల్లో పాదాన్ని మోపి కృశాంగుడవై సరస్సుల్లోని దోషరహితమైన నీటిని సేవించి నీ ప్రయాణాన్ని సాగించు.

**'శ్రీకళా' వ్యాఖ్య:** 'శ్రోత్రపేయం మే సందేశం' అనడంలో ప్రేమికుడు ప్రియురాలికి పంపే సందేశం అమృతతుల్యమైందని సూచితం. అంటే ఆ సందేశాలు ఎవరికైనా ఉత్కంఠను కలిగిస్తాయి. మేఘుడు మార్గాయాసం చేత అక్కడక్కడ అలసటనొందుతాడు. ఇది అందరికీ అనుభవైక వేద్యమైనదే, కొంతదూరం నడవడం విశ్రమించడం, మళ్లీ కొంతదూరం నడవడం, మంచినీరు త్రాగి బలాన్ని పుంచుకొని మళ్ళీ ప్రయాణం సాగించడం. ఇలా. అందుకే ఖిన్నః ఖిన్నః ఎడనెడ అలసిపోతూ అనడానికి ద్విరుక్తి.

రక్షించుకొంటోందని భావం. అలం: సందేహం.

**రత్నచ్ఛాయావ్యతికర ఇవ ప్రేక్ష్యమేతత్పురస్తా -**
**ద్వల్మీకాగ్రాత్ప్రభవతి ధనుఃఖణ్డమాఖణ్డలస్య।**
**యేనశ్యామం వపురతితరాం కాన్తి మాపత్స్యతే తే**
**బర్హేణేవ స్ఫురిత రుచినా గోపవేషస్య విష్ణోః॥** 15

**పదచ్ఛేదం** : రత్నఛాయావ్యతికర ఇవ, ప్రేక్ష్యమ్, ఏతత్, పురస్తాత్, వల్మీకాగ్రాత్, ప్రభవతి, ధనుఃఖండం, ఆఖండలస్య, యేన, శ్యామం, వపుః, అతితరామ్, కాన్తిమ్, ఆపత్స్యతే, తే, బర్హేణ, ఇవ, స్ఫురితరుచినా, గోపవేషస్య, విష్ణోః.

**అన్వయం** : రత్నచ్ఛాయావ్యతికర ఇవ, ప్రేక్ష్యం, ఏతత్, ఆఖండలస్య, ధనుఃఖండం, పురస్తాత్, అగ్రే, వల్మీకాగ్రాత్, ప్రభవతి. యేన, తే, శ్యామం, వపుః, స్ఫురితరుచినా, బర్హేణ, గోపవేషస్య, విష్ణోః, శ్యామం, వపురివ, అతితరాం, కాన్తిమ్, ఆపత్స్యతే.

**ప్రతిపదార్థం**: రత్నఛాయావ్యతికర ఇవ= రత్నముల కాంతి మిశ్రమమువలె; ప్రేక్ష్యం= చూడతగిన; ఆఖణ్డలస్య= దేవేంద్రుని యొక్క; ఏతత్ ధనుఃఖణ్డమ్= ఆ ఇంద్రధనుస్సు; పురస్తాత్= ముందుగా; వల్మీకాగ్రాత్= పాముపుట్టనుండి; ప్రభవతి= పుట్టుచున్నది.; ఏన= ఏ ఇంద్రధనుస్సు; తే శ్యామం, వపుః= నీ నల్లని శరీరము; స్ఫురితరుచినా = ఉజ్జ్వలమైన కాంతితో; బర్హేణ= పింఛముతోనున్న; విష్ణోః, గోపవే షస్య= గోపాలకుడైన విష్ణుమూర్తి యొక్క; శ్యామం, వపురివ= నల్లని దేహమువలె; అతితరామ్, కాన్తిమ్= ఉత్కృష్టమైన శోభను; ఆపత్స్యతే= పొందుచున్నదో.

**తాత్పర్యం**: రత్నముల కాంతి నీను ఇంద్రధనుస్సు వల్మీకాగ్రం నుంచి ఉద్భవించి (నీ శరీరముపై ప్రసరించుటవల్ల) నీ నల్లని శరీరము నెమలి పింఛమును ధరించిన గోపవేషుడైన విష్ణుని శరీరకాంతి వలె ఉత్కృష్ణ శోభతో అలరారుచున్నది.

**'శ్రీకళా' వ్యాఖ్య**: ఇంద్రధనుస్సు పాము పుట్టపై నుండి పుట్టి ఆకాశంలోకి వ్యాపిస్తుందని ఒక విశ్వాసం. ఇంద్రధనుస్సు సౌందర్యం ఎలాంటిదట? పద్మరాగాదిమణి ప్రభల మిశ్రితమై మిక్కిలి దర్శనీయమైంది. 'ఏతత్' అనడంలో చేత్తో 'ఇదిగో ఈ'... అని చూపిస్తున్నట్లు ఊహించాలి. 'వల్మీకాగ్రాత్'. వల్మీకం అంటే పుట్ట. (వల్మీకంలోంచి వచ్చినవాడు వాల్మీకి – ఆవాల్మీకి విరచిత రామాయణశోభ ఇంద్రధనుస్సు వంటిదనే స్ఫురణను కవి పాఠకునికి కలిగిస్తున్నాడు ఈ శ్లోకంలో.

**తాత్పర్యం:** ''వాయువు కొండ కొమ్ముమ హరించుకుపోతోందా?'' అనే అనుమానంతో అమాయికులైన సిద్ధాంగనలుతమ మోములెత్తి ఆశ్చర్యాతిరేకంతో ఉత్సాహంతో చూచు సిద్ధాంగనలయొక్క స్థానమును నీటి ప్రబ్బలివృక్షములను వీడి బలిష్ఠములైన తొండములను విదళించు దిగ్గజములను లెక్క చేయకపైకి చూచుచు (తల ఎత్తుకొని) సాగిపొమ్ము.

**'శ్రీకళా' వ్యాఖ్య:** 'కింస్విత్' అనేది అవ్యయం. ''లిఙ్గవచన విభక్తి శూన్యాన్యవ్యయాని'' లిఙ్గము, వచనము, విభక్తి వీటికి ఉండదు. సంశయము, వికల్పము అనే అర్థాల్లో దీని ప్రయోగం. ''నీవేం చక్రవర్తివా ఏమిటి?'' అనే అర్థంలో ''చక్రవర్తీ అహోస్విత్'' అంటారు.

'చకితచకితం' అనడంలో ఆవృత్తి. ''ప్రకారే గుణవచనస్య'' అనే వ్యాకరణ సూత్రం వల్ల వస్తుంది. పనిలోని తీరును తెలియచేయడంలో దీన్ని ఉపయోగిస్తారు. నిత్య జీవితంలో ఇటువంటి ప్రయోగాలను చూస్తాం. ''గబగబావెళ్ళు'' ''మెల్లమెల్లగా'' వగైరా.

ఈ శ్లోకంలో అర్థాంతరధ్వని – అంటే మరొక అర్థం కూడా ధ్వనిస్తోందని వ్యాఖ్యాతృ చక్రవర్తి మల్లినాథసూరి తన వ్యాఖ్యలో తెలిపేడు. అదేమంటే! దిఙ్నాగుడనే ఆయన ప్రసిద్ధుడైన కవి. (బౌద్ధమతాచార్యుడు కావచ్చు.) ఆయన కాళిదాసు ప్రతిస్పర్ధి. కాళిదాసు కావ్యాల్ని చేతులెత్తి వ్రేళ్ళు గ్రంథంలో గ్రుచ్చి ''ఇక్కడీ దోషం – ఇక్కడీ దోషం'' అంటూ చూపితే నిచులుడనే కాళిదాసు మరో మిత్రుడు దిఙ్నాగుని ఆక్షేపాలకు సమాధానంచెప్పి కాళిదాస కవితను సమర్థించేవాడట. ''దిఙ్నాగానాం'' అని బహువచనం వాడటం గౌరవ సూచకమని ''పూజాయాం బహువచనమ్'' అనీ, 'దిఙ్నాగాచార్యస్య' అనీ మల్లినాథ సూరి తన వ్యాఖ్యలో పేర్కొన్నాడు. ఈ దిఙ్నాగుడు పర్వతంలాంటి వాడు. అంటే శాస్త్రంలో అంత ఉన్నతుడన్నమాట. ''అద్రేః శృంగం హరతి'' అంటే ''అద్రికల్పుడైన దిఙ్నాగుని ప్రాధాన్యాన్ని హరిస్తూ'' అని స్వారస్యం. కనుక ఇందులో కవితన యొక్క, తన మేఘ సందేశ కావ్యం యొక్క, వైశిష్ట్యాన్ని ధ్వనింపచేసేడు.

*''సంసర్గతో దోషగుణా భవన్తి త్యేత న్మృషాయేనజలాశయేఽపి।*

*స్థిత్వానుకూలం నిచులశ్చలన్త మాత్మానమారక్షితి సింధువేగాత్ ॥''*

అని నిచులం మీద శ్లోకం చెప్పడం వల్ల ఆయనకి నిచులడని పేరొచ్చిందంటారు. ''కలయిక (స్నేహం) వల్ల దోషాలు సంక్రమిస్తా''యనడం అబద్ధం. ఎందువల్లనంటే నీటి ప్రబ్బలి చిన్నదైనా ప్రవాహవేగానికి కొట్టుకొని పోకతలవంచి, పిమ్మట తలెత్తి తనను

**తాత్పర్యం:** వ్యవసాయఫలం నీ అధీనమైందని ప్రీతితో అమాయకత్వంతో, కనుబొమల విలాసం తెలియని పామరస్త్రీ నేత్రాలు నిన్ను స్నిగ్ధంగా చూస్తుంటే, అప్పుడే దున్నడం వలన సుగంధాలీను తున్న 'మాల' అనే పీఠభూమినధిరోహించి కొంచెం వెనక్కి వెళ్ళి తీవ్ర గమనంతో మళ్ళీ ఉత్తరదిశకే సాగిపొమ్ము.

**'శ్రీకళా' వ్యాఖ్య:** యక్షుడు మేఘునికి మార్గం చెబుతూ కొంచెం ప్రక్కకి వెళ్ళమన్నాడు. సూటిగా వెడుతూ ప్రక్కకి వెళ్ళి మళ్ళీ అసలు మార్గంలోనే వేగంగా పయనించ మంటున్నాడు, ప్రక్కకి వెళ్ళడం వలన నష్టపోయిన కాలాన్ని తిరిగి పొందడానికి. అసలు ప్రక్కకి వెళ్ళడం దేనికి? అక్కడ 'మాల' అనే పేరు కల ఎత్తైన ప్రదేశం ఉంది. పీఠభూమి లేదా మెట్టభూమి. అక్కడ జానపద స్త్రీలున్నారు. వారు అమాయికలు. పట్నవాస స్త్రీలవలె కనుబొమ్మల విలాసంతో మాటలాడే శక్తిలేని వారు. పైగా వ్యవసాయం చేసినందువల్ల వచ్చే ఫలితం మేఘాధీనంగా భావిస్తారు! నిజమేకదా! ఎంత కష్టించి పొలం దున్నినా తగిన వర్షం లేక పోతే పంట దిగుబడి రాదు కదా! వర్షం కోసం ఎదురుతెన్నులు చూస్తున్న ఆస్త్రీలు నిన్ను ఆకాశంలో చూచి ఆప్యాయంగా కళ్ళతో త్రాగే చూపులు చూస్తారు. అటువంటి నిష్కళంక హృదయుల చూపులు ఒక వరమేకదా!

ఇక అచట 'మాలా' క్షేత్రం వుంది. అప్పుడే దున్నడం వలన నాగలి చాళ్ళలో మేఘుడు వర్షించడం వల్ల పృథివి సువాసనలీనుతూ ఉంటుంది.

"***గంధవతీ పృథ్వీ***" అని

ఆ సువాసనలీనుతున్న మాలక్షేత్రాన్ని నాయికగా భావించి – ఆరుహ్యా = అధిరోహించి – అనడంలో ఆస్త్రీ భోగాన్ని అనుభవించమనే ధ్వని.

"***ధ్వనిరాత్మాకావ్యస్య***"

అని ఆనందవర్ధనాచార్యుల వారి తీర్పు.

మళ్ళీ ఏమీ ఎఱుగని వాని వలె త్వరత్వరగానీ త్రోవలో సాగి పొమ్మనడంలో ఒకనొక బహువల్లభుడైన నాయకుడు రహస్యంగా నాయికతో విహరించి మళ్ళీ ఎవరూ చూడకుండా ఏమీ తెలియని వాని వలె 'పెద్దమనిషి' గా వ్యవహరిస్తాడు. స్త్రీ సల్లాపం రహస్యమైనదన్నమాట.

ఈ ఇంద్రధనుస్సు రంగులతో మేఘుని నల్లనైన దేహం మరింత ప్రకాశిస్తోంది. ఎలా ప్రకాశిస్తోందంటే గోపవేషధారి (శ్రీకృష్ణుడు) యైన విష్ణుమూర్తి శరీరం వలె. తన మనసు తాను చెప్పుకుంటూ వింటున్న మేఘునికి విసువు జనించకుండా సందర్భానుసారంగా అతణ్ణి కీర్తిస్తున్నాడు. ఇటువంటి వాటి వల్ల మేఘునికి కూడా యక్షుని పట్ల జాలి, మైత్రి పెంపొంది యక్షకార్యాన్ని సఫలం చేస్తాడా మేఘుడు.

సీతారాముల ఉనికి వల్ల పవిత్రమైంది చిత్రకూటమైతే శ్రీకృష్ణుని మేనిఛాయ వంటి ఛాయకల వాడు మేఘుడు. వర్షోన్ముఖమైన మేఘం నల్లగా ఉంటుంది, తనలో నున్న నీటివలన. ఆమేఘమే శరత్కాలంలో తెల్లగా ఉంటుంది. ఇది ఆషాఢమేఘం కాని శరన్మేఘం కాదు అలం : సంసృష్టి.

**త్వయ్యాయత్తం కృషిఫలమితి భ్రూవిలాసానభిజ్ఞైః**
**ప్రీతిస్నిగ్ధైర్జనపదవధూ లోచనైః పీయమానైః ।**
**సద్యః సీరోత్కషణ సురభిక్షేత్రమారుహ్యామాలం**
**కించిత్పశ్చాద్వ్రజ లఘుగతి ర్భూయఏవోత్తరేణ ॥** 16

**పదచ్ఛేదం :** త్వయి, ఆయత్తం, కృషిఫలం, ఇతి, భ్రూవిలాస, అనభిజ్ఞైః, ప్రీతిస్నిగ్ధైః, జనపదవధూలోచనైః పీయమానైః, సద్యః, సీర +ఉత్కషణ సురభిక్షేత్రం, ఆరుహ్య, మాలం, కించిత్, పశ్చాత్, వ్రజ, లఘుగతిః, భూయః, ఏవ, ఉత్తరేణ.

**అన్వయం:** కృషిఫలం, త్వయి, ఆయత్తం, ఇతి, ప్రీతిస్నిగ్ధైః భ్రూవిలాస అనభిజ్ఞైః, జనపదవధూలోచనైః, పీయమానః, మాలం, క్షేత్రం, సద్యః, సీరోత్కషణ సురభిం, ఆరుహ్య, కించిత్, పశ్చాత్, లఘుగతిః, భూయః, ఉత్తరేణఏవ, వ్రజ.

**ప్రతిపదార్థం:** కృషిఫలం, త్వయి, ఆయత్తం, ఇతి = వ్యవసాయఫలం నీఅధీనమైనదని; ప్రీతిస్నిగ్ధైః= అమాయకమైన ప్రేమతో; భ్రూవిలాస అనభిజ్ఞైః= కనుబొమల వికారము తెలియని; జనపదవధూలోచనైః= పామరస్త్రీలనేత్రములతో; పీయమానః= త్రాగబడుచు (ఆప్యాయతతో చూడబడినవాడవై); మాలం, క్షేత్రం ='మాల' (అనుపేరుకల పీఠభూమి)ని; సద్యః= అప్పుడే; సీరఉత్కషణ సురభిం= దున్నుటచేత సుగంధములీనుతున్న దానిని; ఆరుహ్య = అధిరోహించి; కించిత్, పశ్చాత్ లఘుగతిః= కొంచెమువెనుకకువెళ్ళి తీవ్రగమనమున; భూయః= వెంటనే; ఉత్తరేణ, ఏవ= ఉత్తరదిశకే; వ్రజ= వెళ్ళుము (సాగిపొమ్ము).

మొదట విశ్రమించిన చోట సుఖం కలిగితే యాత్ర అంతా సుఖావహమౌతుందని 'నిమిత్త నిదానం' లో ఉందని మల్లినాథ సూరి ఉదాహరిస్తున్నాడు.

*"ప్రథమావసథే యస్య సౌఖ్యం తస్యాఖిలే ఉధ్వని*
*శివం భవతి యాత్రాయామన్యథాత్వశుభంధ్రువమ్ "*

అలం: అర్థాంతరన్యాసం.

**ఛన్నోపాన్తః పరిణతఫలద్యోతిభిః కాననామ్రై -**
**స్త్వయ్యారూఢే శిఖరమచలః స్నిగ్ధవేణీ సవర్ణే ।**
**నూనంయాస్యత్యమరమిథున ప్రేక్షణీయామవస్థాం**
**మధ్యేశ్యామః స్తన ఇవభువః శేషవిస్తారపాణ్డుః ॥** 18

**పదచ్ఛేదం:** ఛన్నోపాంతః, పరిణతఫలద్యోతిభిః, కాననామ్రైః, త్వయి, ఆరూఢే, శిఖరం, అచలః, స్నిగ్ధవేణీ, సవర్ణే, నూనం, యాస్యతి, అమరమిథునప్రేక్షణీయాం, అవస్థాం, మధ్యే, శ్యామః, స్తనఇవ, భువః, శేషవిస్తార పాండుః.

**అన్వయం :** (హే మేఘ!) పరిణతఫల ద్యోతిభిః, కాననామ్రైః, ఛన్నోపాంతః, స్నిగ్ధవేణీ, సవర్ణే, త్వయి, శిఖరం, ఆరూఢే, మధ్యే, శ్యామః, శేషవిస్తారపాండుః, భువః, స్తన ఇవ, అమర మి థున ప్రేక్షణీయాం, అవస్థాం, నూనం, యాస్యతి.

**ప్రతిపదా ర్థం:** పరిణతఫల ద్యోతిభిః = పండిన ఫలములతో ప్రకాశవంతమైన, కాననామ్రైః = అడవిమావిపండ్లు; ఛన్నోపాన్తః = ప్రక్కలనలుముకొన్నవై, స్నిగ్ధవేణీసవర్ణే= అందమైనకేశపాశఛాయనొంది (శ్యామవర్ణము); త్వయి= నీవు, శిఖరం ఆరూఢే (సతి)= కొండకొమ్మును అధిరోహించగా; మధ్యే, శ్యామః= మధ్యభాగమునందలి నలుపును, శేషవిస్తారపాండుః= మిగిలిన భాగమున అధికమైన తెలుపును కలిగి; భువఃస్తన ఇవ= భూదేవి వక్షోజమువలె (నుండి); అమరమిథున ప్రేక్షణీయాం= దేవతామిథునములు చూడతగిన; అవస్థాం= స్థితిని; నూనం, యాస్యతి= నిశ్చయముగ పొందగలవు.

**తాత్పర్యం:** పండిన ఫలములతో ప్రకాశవంతమైన అడవిమావిపండ్లు ప్రక్కల వ్యాపింప అందమైన కేశపాశ ఛాయనొంది నీవు కొండ కొమ్ము నధిరోహించగా మధ్యభాగమున నలుపు చుట్టూ అధికమైన తెలుపును కలిగి భూదేవి వక్షోజము వలె నుండి దేవతామిథునములు చూడతగిన స్థితిని నిశ్చయముగా పొందగలవు.

త్వామాసారప్రశమిత వనోపప్లవంసాధుమూర్ధ్నా
వక్ష్యత్యధ్వశ్రమ పరిగతం సానుమానామ్రకూటః।
నక్షుద్రోఽపి ప్రథమ సుకృతాపేక్షయా సంశ్రయాయ
ప్రాప్తేమిత్రే భవతి విముఖః కింపునర్యస్తథోచ్చైః॥ 17

**పదచ్ఛేదం:** త్వాం, అసారఃప్రశమితఃవనోపప్లవం, సాధు, మూర్ధ్నా, వక్ష్యతి, అధ్వశ్రమ, పరిగతం, సానుమాన్, ఆమ్రకూటః, న, క్షుద్రః, అపి, ప్రథమ సుకృత, అపేక్షయా, సంశ్రయాయ, ప్రాప్తే, మిత్రే, భవతి, విముఖః, కిం, పునః, యః, తథా, ఉచ్చైః.

**అన్వయం :** ఆమ్రకూటః, సానుమాన్, ఆసారః, ప్రశమితః, వనోపప్లవం, అధ్వశ్రమ, పరిగతం, త్వాం, సాధు, మూర్ధ్నా, వక్ష్యతి, క్షుద్రః, అపి, సంశ్రయాయ, మిత్రే, ప్రాప్తే ప్రథమసుకృతాపేక్షయా. విముఖః, నభవతి;యః, తథా, ఉచ్చైః, సః, కింపునః?

**ప్రతిపదార్థం:** ఆమ్రకూటః = ఆమ్రకూటపర్వతము; ఆసార= ధారాపాతముచేత; ప్రశమితః= శమించిన; వనోపప్లవం= దావాగ్ని కలదై; అధ్వశ్రమేణ= మార్గాయాసముచేత; పరిగతం= డస్సిన; త్వాం= నిన్ను; సాధు= బాగుగా; మూర్ధ్నా, వక్ష్యతి= తలపై పెట్టుకొనును. సంశ్రయాయ= సంపర్కముచే; క్షుద్రః అపి= నీచుడైనను; మిత్రే ప్రాప్తే= స్నేహితుడు రాగా; ప్రథమసుకృతాపేక్షయా= పూర్వము చేసిన ఉపకారము దృష్ట్యా; విముఖః, న, భవతి= విముఖుడు కాలేడు. యః, తథా, తేన= ఎవడు అట్లు ఆకారణముచే; ఉచ్చైః= ఉన్నతుడైన (సత్పురుషుడైన); హని విషయమున (ఆమ్రకూట విషయంలో); కిం, పునః?= చెప్పునదేమున్నది (అసలు విముఖుడు కాడని భావం).

**తాత్పర్యం :** పూర్వం ఆమ్రకూట పర్వతము దావాగ్ని నుండి నీవలన రక్షితమైనది కనుక మార్గాయాసము నొందిన నిన్ను నెత్తిన పెట్టుకొంటుంది. నీచుడైనా ఉపకారం చేసిన మిత్రుడెదురైతే విముఖుడు కాడు. ఇక మహోన్నతుడైన ఆమ్రకూటం విషయంలో చెప్పేదేముంది?

**'శ్రీకళా' వ్యాఖ్య:** నీవు అలా వెడుతుంటే ఆమ్రకూట పర్వతం వస్తుంది. ఈ ఆమ్రకూట పర్వతంలో పూర్వంచెలరేగిన దావాగ్నిని నీధారాపాతంతో శమింపజేసేవు. కనుక నిన్ను చూడగానే ఆ పర్వతం నిన్ను నెత్తిన పెట్టుకొంటుంది. అక్కడ ఆ పర్వతంపై విశ్రమించడం వలన నీ మార్గాయాసం తీరుతుంది. మొదట మేలుపొందిన స్నేహితుని పట్ల నీచుడైనా విముఖుడు కాడు. ఇక ఉన్నతుడైన ఆమ్రకూటం విషయంలో చెప్పేదేముంది? తప్పక నిన్ను సేవించి నీకు విశ్రాంతినిస్తాడని భావం.

**'శ్రీకళా' వ్యాఖ్య:** ఆమ్రకూట పర్వత ప్రాంతాల్లో లతా గృహాల్లో వనచరస్త్రీలు క్రీడిస్తూ ఉంటారు. ఓ క్షణకాలం ఆదృశ్యం చూసి సంతుష్టుడవై బయలుదేరుము. ఎక్కువ సేపు ఆగకుసుమా! 'ముహూర్తం' అనడంలో ఉద్దేశ్యం అది. మరీ ఎక్కువ సేపు ఆగితే పనికి ఆలశ్యమౌతుంది. అక్కడ ఒక జల్లు కురవడం వల్ల నీలోని బరువు తగ్గి వేగంగా పయనించగలవు. నర్మదా (రేవా) నది అక్కడ పాయలు పాయలై ప్రవహిస్తుంది. వింధ్య పర్వతపాదంలో పాయగా ప్రవహిస్తున్న నది ఒకానొక కాముకి ప్రియుని పాదాల మీద పడినట్లుంటుందని ధ్వని.

పాయలు పాయలుగా ఉన్న నది పర్వత ప్రాంతంలో ఎలా ఉంటుందంటే – పర్వతం ఏనుగు ఆకారంలో ఉంటే భక్తితో ఆ ఏనుగుకు పూసిన విభూతి రేఖల వలె నదీ ప్రవాహం ఉంటుందని ఉపమానం చెప్పేడు.

''ఉపమా కాళిదాసస్య'' అని ఆర్యోక్తి.

కొండ ఏనుగుతో పోల్చడం, పాయలు పాయలైన నదీ ప్రవాహం విభూతి రేఖలతో పోల్చడం మనోహరమైన కల్పన.

పర్వతం నాయకునిగా, నదని నాయికగా చెప్పి కాముకియైన నాయిక నాయకుని పాదాలపై వ్రాలినట్లు ధ్వని కూడా సుమనోహరంక దా! అల ం: ఉప మ.

**తస్యాస్తిక్తై ర్వనగజమదైర్వాసితం వాన్తవృష్టి -**
**ర్జమ్బూకుఞ్జ ప్రతిహతరయం తోయమాదాయ గచ్ఛేః ।**
**అన్తఃసారం ఘన తులయితుం నానిలః శక్ష్యతిత్వాం**
**రిక్తఃసర్వోభవతి హిలఘుః పూర్ణతాగౌరవాయ ॥** **20**

**పదచ్ఛేదం:** తస్యాః, తిక్తైః, వనగజమదైః, వాసితం, వాన్తవృష్టిః, జమ్బూకుంజప్రతిహ త, రయం, తోయం, ఆదాయ, గచ్ఛేః. అన్తఃసారం, ఘనతులయితుం, న, అనిలః, శక్ష్యతి, త్వాం, రిక్తః, సర్వః, భవతి, హి, లఘుః, పూర్ణతా, గౌరవాయ.

**అన్వయం:** వాంతవృష్టిః, తిక్తైః, వనగజమదైః, వాసితం, జంబూకుంజైః, ప్రతిహతరయం, తస్యాః, తోయం, ఆదాయ, గచ్ఛేః, (హే) ఘన, అన్తఃసారం, త్వాం, అనిలః, తులయితుం, న, శక్ష్యతి, రిక్తః, సర్వః, లఘుః, భవతి, పూర్ణతా, గౌరవాయ, (భవతి)

**ప్రతిపదార్థం:** (హేమేఘ!) వాంతవృష్టిః= జడివాన కురిపిస్తూ; తిక్తైః= సువాసనతో కూడిన వగరు రుచితో; వనగజమదైః వాసితం= మదించిన అడవి ఏనుగులు నివసిస్తున్న;

**'శ్రీకళా' వ్యాఖ్య:** ఆమ్రకూటాద్రి వర్ణన. మామిడి పళ్లు బాగా పక్వదశకు వచ్చేయి. ప్రక్కల నలుముకొన్నాయి. మేఘుని వలె మనోహరమైన కేశపాశం ఛాయనొంది మధ్యభాగంలో నలుపు అంతటా విశేషమైన తెలుపుతో ఆ దృశ్యం భూదేవి వక్షోజంలా ఉంటుంది. దేవతా మిథునాలు, ఈ మనోహర దృశ్యాన్ని ఉత్కంఠతో చూస్తారు. రతిక్రీడ జరిపి అలసిన నాయకుడు నాయిక కుచకలశంపై నిద్రిస్తాడనే ధ్వని ఈశ్లోకంలో ద్యోతకమౌతోంది.

**స్థిత్వాతస్మిన్వన చరవధూ భుక్తకుఞ్జే ముహూర్తం**
**తోయోత్సర్గ ద్రుతతరగతి స్తత్పరం వర్త్మ తీర్ణః।**
**రేవాంద్రక్ష్య స్యుపలవిషమే విన్ధ్యపాదే విశీర్ణాం**
**భక్తిచ్ఛేదైరివ విరచితాం భూతి మఙ్గే గజస్య॥** **19**

**పదచ్ఛేదం :** స్థిత్వా, తస్మిన్, వనచర వధూ భుక్తకుంజే, ముహూర్తం, తోయ, ఉత్సర్గ, ద్రు తతరగతిః, తత్పరః, వర్త్మ, తీర్ణః, రేవాంద్రక్ష్యసి. ఉపలవిషమే, వింధ్యపాదే, విశీర్ణాం, భక్తిచ్ఛేదైః, ఇవ, విరచితాం, భూతిం, అంగే, గజస్య.

**అన్వయం :** వనచరవధూ భుక్తకుంజే, తస్మిన్, ముహూర్తం, స్థిత్వా, తోయోత్సర్గ, ద్రుత తరగతిః, తత్ పరం, వర్త్మ, తీర్ణః, ఉపల విషమే, వింధ్యపాదే, విశీర్ణాం, రేవాం, గజస్య, అంగే, భక్తి చ్ఛేదైః, విరచితాం, భూ తి మ్, ఇవ, ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థం:** వనచరవధూభుక్తకుంజే= వనచరస్త్రీలు క్రీడించిన లతా గృహములు కల; తస్మిన్= ఆ ఆమ్రకూట పర్వతమునందు; ముహూర్తం= క్షణకాలము (ఎక్కువ సేపు కాదు); స్థిత్వా= విశ్రమించి; తోయోత్సర్గ ద్రుతతరగతిః= నీటిని విడచి (జల్లుకురిసి) వేగమును పెంచి; తత్పరం (తస్మాత్ పరం)= ఆ ఆమ్రకూటము తరువాత; వర్త్మ తీర్ణః = మార్గమును అతిక్రమించినవాడవై; ఉపలవిషమే= ఎగుడు దిగుడు రాళ్ళతో నున్న; వింధ్యపాదే= వింధ్య పర్వత పాదమున; విశీర్ణాం= పరిసరములనున్న; రేవాం= నర్మదానదిని; గజస్య అంగే= ఏనుగు అవయుములయందు; భక్తి చ్ఛేదైః = భక్తివలన అనేక రంగులతో ; విరచితాం=రచింపబడిన; భూతిమ్ ఇవ = భస్మముతో చేసిన అలంకారము వలె; ద్రక్ష్యసి = చూడగలవు.

**తాత్పర్యం:** వనచరస్త్రీలు క్రీడించిన లతా గృహములపై క్షణకాలము నిలిచి నీటిని విడచి, (చిన్న జల్లు కురిసి) ఆ ఆమ్రకూటాన్ని విడచి వింధ్య పర్వత పాదమున నున్న నర్మదానదిని భక్తితో (అనేక రంగుల నలమిన) భస్మము నిడిన ఏనుగువలె చూడగలవు.

ప్రసిద్ధమైన విషయం. నీరు గ్రహించడం వల్ల మేఘుడు పూర్ణుడౌతున్నాడు (ఆహార స్వీకారం వలన బలం కలిగిన వాడౌతాడు) బరువుగా ఉన్న మేఘుణ్ణి గాలి ఏం చేస్తుంది. జల హీనమైన మేఘం గాలి తాకిడి చేత శిథిలీకృతమౌతుంది.

ఇంతటి ధ్వనిని ఈ శ్లోకంలో నిక్షిప్తం చేసి అర్థాంతరన్యాసాలంకారంతో శ్లోకానికి వన్నె తీసికొని వస్తాడు కాళిదాసు. లోకంలో రిక్తుడు (అంటే ఖాళీ –అంగబలం, అర్థబలం, ఇత్యాదులులేని వాడు అందరికీ చులకనే. అన్ని విధాలా బలవంతుని లోకం గౌరవిస్తుంది కదా!

**నీపం దృష్ట్వా హరిత కపిశం కేసరైరర్ధ రూఢై**
**రావి ర్భూత ప్రథమముకులాః కన్దలీశ్చాను కచ్ఛమ్ ।**
**జగ్ధ్వారణ్యేష్వధిక సురభిం గన్ధమాఘ్రాయచోర్వ్యాః**
**సారఙ్గాస్తే జలలవముచః సూచయిష్యన్తి మార్గమ్ ॥** 21

**పదచ్ఛేదం :** నీపం, దృష్ట్వా, హరిత కపిశం, కేసరైః అర్ధరూఢైః, ఆవిర్భూత ప్రథమ ముకులాః కందలీః, చ, అనుకచ్ఛమ్, జగ్ధ్వారణ్యేషు, అధిక సురభిం, గంధం, ఆఘ్రాయ, చ, ఉర్వ్యాః, సారంగాః, జలలవముచః, సూచయిష్యన్తి, మార్గమ్.

**అన్వయం :** సారంగాః, అర్ధరూఢైః, కేసరైః, హరితం, కపిశం, నీపం, దృష్ట్వా, ఆవిర్భూతః, అను కచ్ఛమ్ కందలీః, జగ్ధ్వాఅరణ్యేషు, ఉర్వ్యా, అధికసురభిం, గంధం, ఆఘ్రాయ, జలలవముచః, తే, మార్గం, సూచయిష్యన్తి.

**ప్రతిపదార్థం :** సారంగాః =చాతక పక్షులు ; అర్ధరూఢైః, కేసరైః = ఒకచోనున్న కింజల్కాలు; హరిత కపిశం = ఎఱుపుఛాయతో కూడిన పసుపురంగుకల; నీపం, దృష్ట్వా = కడిమిచెట్టును చూచి; ఆవిర్భూత = ఉదయించిన; అనుకచ్ఛమ్, కందలీః = నేల అరటి పళ్ళు; జగ్ధ్వా = భుజించి; అరణ్యేషు = అరణ్యములయందు ; ఉర్వ్యా = భూమి యొక్క; గంధం ఆఘ్రాయ = సుగంధము నాఘ్రాణించిన; జలలవముచః = నీటిబిందువులు; తే = నీకు ; మార్గం = త్రోవను; సూచయిష్యన్తి = చూప గలవు.

**తాత్పర్యం :** చాతకపక్షులు నీనీటి బిందువులను త్రావి ఎఱుపు చాయగల పసుపురంగుతో కూడిన కడిమి చెట్లను చూచుట చేత మొలకెత్తిన నేల అరటిపళ్లను తిని అరణ్యంలో భూమి యొక్క సుగంధాన్ని ఆఘ్రాణించి విడచిన నీటి బిందువులతో నీకు మార్గమును చూపగలవు.

**'శ్రీకళా' వ్యాఖ్య :** ఎక్కడెక్కడైతే కదంబ పుష్పాలు, ఉదయిస్తాయో అక్కడక్కడ

జంబూకుంజైః= నేరేడు తోపులచే; ప్రతిహతరయం= నియంత్రితమైనవేగముకల వాడవై; తస్యాః= దాని యొక్క (ఆ రేవానది యొక్క); తోయం, ఆదాయ= నీటిని స్వీకరించి; గచ్ఛేః= వెళ్ళుము; అన్తః సారః= బలము కలిగిన (నీటిని స్వీకరించడం వల్ల ఘనమై); త్వాం= నిన్ను; అనిలః= వాయువు; తులయితుం, నశక్ష్యతి=కదలించుటకు సమర్థుడుకాడు (వాయువు నిన్నేమీ చేయలేడు); రిక్తః= శక్తిహీనుడు; సర్వః, లఘుః, భవతి= అందరికీ చులకనకాగలడు. పూర్ణతా = శక్తి నిండి ఉండుట; గౌరవాయ, (భవతి) వా= గౌరవము కలిగించును కదా!

**తాత్పర్యం:** జడివాన కురిపించి (వాంతి చేసికొని) వనగజవాసి తమైన అవింధ్య పర్వత ప్రాంతాల్లో నేరేడు తోపులచే నీవేగము నియంత్రితము కాగా ఆరేవా నదీ జలములు స్వీకరించివెళ్ళు. బలవంతుడవైన నిన్ను ఆకాశవాయువు ఏమీచేయలేదు. శక్తిహీనుడందరికీ చులకనౌతాడు. శక్తివంతుడు గౌరవాన్ని పొందుతాడు కదా!

**'శ్రీకళా' వ్యాఖ్య:** మేఘుణ్ణి అక్కడ జడివాన కురిపించడం ద్వారా వాంతిచేసికోమన్నాడు. ఆతర్వాత వగరుగా నున్న నేరేడు తోపుల్లో వాటిని అఘ్రాణించడం ద్వారా వేగం నియంత్రింతమౌతుందంటున్నాడు. రేవానదీ జలాల్ని గ్రహించి బయలుదేరి వెడితే ఆకాశవాయువు నిన్నేమీ చేయలేదంటున్నాడు.

వ్యక్తి ఆరోగ్యానికి 'వమనక్రియ' ఆయుర్వేదంలో ప్రసిద్ధమైన ప్రక్రియ. ఈ వమనం వల్ల కడుపులో ఉన్న చెడుపదార్థమంతా బయటకు పోతుంది. ఆతరువాత వగరుతో నున్న కషాయం త్రాగడం వల్ల కడుపు పరిశుభ్రమై శక్తిచేకూరుతుంది. దాంతో 'వాత' గుణం హరిస్తుంది.

ఈ విషయాన్నే ప్రసిద్ధ ఆయుర్వేదా చార్యుడైన వాగ్భటుడు

***కషాయాశ్చా హిమాస్తస్య విశుద్ధౌ శ్లేష్మణోహితాః***
***కిముతిక్త కషాయావా యేనిసర్గాత్కఫావహాః।***
***కృతశుద్ధే క్రమాత్పీతపేయాదేః పథ్యభోజినః***
***వాతాదిభిర్నబాధాస్యాది న్త్రియైరివయోగినః॥*** " అని చెప్పేడు.

వాత, శ్లేష్మ, పిత్త గుణాల ప్రకోపం వల్ల అనారోగ్యం సంభవిస్తుందనేది ఆయుర్వేదం చెబుతోంది. ఇక్కడ మహాకవి ధ్వనింపజేసిన విషయం ఇదే.

ప్రకృతంలో రేవానదీ జలాలు నేరేడు వృక్ష, ఫలసంపర్కంచేత వగరుగా నుండి కషాయంగా పనిచేస్తాయి. మేఘుడు తనలోని జలాన్ని వర్షరూపేణ ప్రజలకందించి తిరిగి నీటిని నదీ జలాల నుండి స్వీకరించి తిరిగి వర్షరూపేణ మానవాళి కందించడం

నెమళ్లు; కేకాః = తమ కంఠస్వరముతో; స్వాగతీ కృత్య = స్వాగతము పలుకుటచే; ప్రత్యుద్యాతః = ఆతిథ్యమునెఱపగలవు; భవాన్, కథమపి = నీవు ఎట్లో అట్లు; ఆశు, గంతుం, వ్యవస్యేత్ = శీఘ్రముగ వెళ్ళుటకు, పూనుకొమ్ము.

**తాత్పర్యం**: ఓ మిత్రమా! నా ప్రీతికై వేగంగా సాగిపో. పొదల యందలి సుగంధకుసుమాలు ప్రతి పర్వతంపై ఆలశ్యం చేస్తాయని ఊహిస్తున్నాను. కన్నీరు నించిన కళ్లతో నెమళ్లగానం స్వాగతం పలికి ఆతిథ్యాన్ని ఇవ్వగా నీవు ఎట్లో అట్లు త్వరగా ప్రయాణం సాగించడానికి పూనుకొమ్ము.

**'శ్రీకళా' వ్యాఖ్యా** : ఆకాశంలో మేఘదర్శనం నెమళ్లకు ఆనంద హేతువు. మేఘం రావడంతోటే నెమలి పురివిప్పి నాట్యం చేస్తుంది. ఆనందాతిరేకంతో కళ్ళ వెంట నీరు కారుస్తుంది. అంటే ఆనంద బాష్పాలతో నెమళ్లు మేఘానికి తమ కేకారవాలతో స్వాగతం పలుకుతాయని చెబుతున్నాడు. ఈ మేఘదర్శనంతో కొండమీద ఉండే పుష్పాలు విచ్చుకొని సురభి పరిమళాలను వెదజల్లుతాయి. ఆపరిమళాలు ఆఘ్రాణించకుండా వెళ్ళిపోవడం రసికుని లక్షణం కాదు. వాటివల్ల కొంత ఆలశ్యం జరుగుతుంది.

యాతుం ఇచ్ఛుః యియాసుః.√ యా – గతౌ సన్‌ప్రత్య. కర్తుమిచ్ఛుః – చికీర్షుః, గన్తుమిచ్ఛుః జిగమిషుః, ద్రష్టుమిచ్ఛుః దిదృక్షుః, జేతుమిచ్ఛుః – జిగీషుః. సంస్కృతంలో శబ్దాల శోభ ఈవిధంగా ఉంటుంది. అలం : పరిణామం.

**పాణ్డుచ్ఛాయోపవన వృతయః కేతకైః సూచిభిన్నైః**
**నీడా రమ్భైర్గృహబలి భుజా మాకుల గ్రామ చైత్యాః।**
**త్వయ్యాసన్నే పరిణతఫల శ్యామ జమ్బూ వనాన్తాః**
**సంపత్స్యన్తే కతిపయ దిన స్థాయి హంసా దశార్ణాః॥** 23

**పదచ్ఛేదం** : పాండుచ్ఛాయా, ఉపవన, వృతయః, కేతకైః, సూచిభిన్నైః, నీడారంభైః, గృహబలి భుజాం, ఆకుల, గ్రామ చైత్యాః, త్వయి, ఆసన్నే, పరిణత, ఫల, శ్యామ, జంబూవనాన్తాః, సంపత్స్యన్తే, కతిపయదిన, స్థాయి, హంసాః, దశార్ణాః.

**అన్వయం**:(హేమేఘ!) త్వయి, ఆసన్నే, దశార్ణాః, సూచిభిన్నైః, కేతకైః, పాండుచ్ఛాయా, ఉపవన వృతయః, గృహబలిభుజాం, నీడారంభైః, ఆకుల గ్రామచైత్యాః, పరిణతః, ఫల, శ్యామ, జంబూవనాన్తాః, కతిపయదినస్థాయి హంసాః, సంపత్స్యన్తే.

మేఘుడు వర్షించి ఉంటాడని అనుమీయమాన మౌతోంది.

మల్లినాథ సూరి "సా రఙ్గః మతఙ్గజాః కురఙ్గా భృంగావా ! " అనే అర్థం చెప్పి "సారఙ్గ శ్చాతకేభృఙ్గే కురఙ్గేచ మతఙ్గజే" అని విశ్వనిఘంటువును ఉటంకించేడు. 'వా' అంటే వికల్పానికి బదులు 'చ' అంటే 'కూడా' అని కూడా అర్థంచెప్పుకోవచ్చునంటారు, ఎమ్.ఆర్. కాలే పండితులు. అప్పుడు 'సారఙ్గ' శబ్దానికి తుమ్మెదలు, లేళ్ళు, ఏనుగులు అని మూడర్థాలు సంక్రమిస్తాయి. సారఙ్గఃనీపందృష్ట్వా; సారఙ్గాఃకదలీఃజగ్ధ్వా, సారఙ్గః గంధ మాఘ్రాయ అనే మూడర్థాలు (తుమ్మెదలు కడిమి చెట్లను చూచి,చాతకములు ఆకడిమినితిని, మత్తగజములు వానినాఘ్రాణించి) అని మూటికీ అర్థాలు అన్వయిస్తాయి.
సారం శీఘ్రం గచ్ఛతీతి సారఙ్గః – లేడి
సారమఙ్గం యస్యాసౌసారఙ్గః – ఏనుగు
సారం సలిలం గచ్ఛతీతిసారఙ్గః – చాతకం
సారం మధురం గాయతీతి సారఙ్గః – తుమ్మెద. ఇలా ఈశబ్దానికి వ్యుత్పత్తులు సిద్ధిస్తాయి.
అలం : సందేహం.

**ఉత్పశ్యామి ద్రుతమపి సఖే మత్ప్రియార్థం యియాసోః**
**కాలక్షేపం కకుభ సురభౌ పర్వతే పర్వతే తే।**
**శుక్లా పాఙ్గైః సజలనయనైః స్వాగతీ కృత్య కేకాః**
**ప్రత్యుద్యాతః కథమపి భవాన్గన్తు మాశు వ్యవస్యేత్ ॥** 22

**పదచ్ఛేదం** : ఉత్, పశ్యామి, ద్రుతం, అపి, సఖే, మత్, ప్రియార్థం, యియాసోః, కాలక్షేపం, కకుభ సురభౌ, పర్వతే, పర్వతే, తే, శుక్లాపాంగైః, సజలనయనైః, స్వాగతీకృత్య, కేకాః, ప్రత్యుద్యాతః, కథమపి, భవాన్, గన్తుం, ఆశు, వ్యవస్యేత్.

**అన్వయం** : హేసఖే, మత్, ప్రియార్థం, ద్రుతం, యియాసోః, తే, కకుభైః, సురభౌ, పర్వతే పర్వతే, కాలక్షేపం, ఉత్పశ్యామి, సజలనయనైః, శుక్లాపాంగైః, కేకాః, స్వాగతీకృత్య, ప్రత్యుద్యాతః, భవాన్, కథమపి, ఆశు, గంతుం, వ్యవస్యేత్.

**ప్రతిపదార్థం** : హే సఖే = ఓ మిత్రమా !; మత్, ప్రియార్థం = నా ప్రీతి కై; ద్రుతం = వేగముగా; యియాసోః అపి= పయనమును సాగించు; తే = నీకు ; కకుభైః = పాదలయందలి కుసమములు; సురభౌ = సుగంధములు; పర్వతే పర్వతే = ప్రతి పర్వతమునందును; కాలక్షేపం, ఉత్పశ్యామి = ఆలశ్యము చేయునని ఊహిస్తున్నాను ; సజలనయనైః = కన్నీరు నిండిన కండ్లతో (ఆనందబాష్పాలతో); శుక్లాపాంగైః =

**ప్రతిపదార్థం** : దిక్షు = దిక్కులయందు; ప్రథిత = ప్రసిద్ధినొందిన (దిగంత విశ్రాంత కీర్తినొందిన); విదిశాలక్షణం = 'విదిశ' అను పేరుగల; రాజధానీం = రాజధానీ నగరమునకు; గత్వా = వెళ్ళి; తేషాం = ఆ దశార్ణ దేశములకు సంబంధించిన; తాం = ఆ ప్రధాన నగరమును; సద్యః = అప్పుడు ; కాముకత్వస్య = కాముకత్వమునకు ; అవికలం = సమగ్రమైన; ఫలం = ప్రయోజనమును; లబ్ధా = చేకూరును; స్వాదు = మధురమైన; చలోర్మి = వేత్రవతీ నది యొక్క; పయః = ముడివడిన కనుబొమ్మలతో నున్న; ముఖమివ = అధరమునువలె; తీరోపాన్తే = తటపరిసరంలో; స్తనితం, సుభగం = మనోహరమైన, గర్జనతో; పాస్యసి = పానము చేయగలవు.

**తాత్పర్యం**: దిగంత విశ్రాంతమైన ప్రసిద్ధికల ఆ దశార్ణ దేశాలకి రాజధానియైన విదిశానగరం వెళ్లి కాముకునికి సమగ్రమైన ఫలం పొంది చలించుచున్న తరంగములతో నున్న వేత్రవతీ నదీ తటంలో ముడివడిన కనుబొమలతో నున్న స్త్రీ అధరపానము వలె ఆస్వాదించ గలవు.

**'శ్రీకళా' వాఖ్య :**

*" ప్రధాన నగరీ రాజ్ఞాం రాజధానీతి కథ్యతే "*
*"విలాసా కాముకః కామీ స్త్రీపరో రతిలమ్పటః" (శబ్దార్ణవం)*
*"ఊర్ధ్వ ముచ్ఛలిత కణ్ణ నాసికం హుజ్కృతం స్తనితమల్ప ఘోషవత్"*
*"కామి నామధరాస్వాదః సురతాదతిరిచ్యతే"*

ఇత్యాది ఆభాణకాలిచట అనుసంధేయాలు. దేశ వాచి శబ్దాలు సంస్కృతంలో బహువచనాంతాలుగా ప్రయోగించడం పరిపాటి. అందుచేత 'తేషాం' – అంటే 'ఆ దశార్ణదేశములు' అని బహువచన ప్రయోగం. విదిశ ఆ దేశరాజధాని. అక్కడ నది వేత్రవతి. ఆ నదీ తరంగాలు కదులుతూ ఉంటే చిన్న శబ్దం వెలువడుతూ ఉంటుంది. ఆ శబ్దంతో కూడిన అలల కదలిక ప్రేయసి అధరాకృతిని స్మరింప చేస్తుంది. సంయోగకాలంలో రతి పారవశ్యంతో స్త్రీ చేసే మధుర కూజితాన్ని 'మణిత' మంటారు. ఆ నదిలో నీటిని గ్రహించినప్పటి నదీ తరంగాలు ముడివడిన కనుబొమలవలె ఉంటాయనడంలో అధర పీడన జనితమైన ప్రణయ కోపం ఊహ్యం. అట్టి అధరాస్వాదనం సురత సుఖాతి శాయి అని ధ్వని.

**ప్రతిపదార్థం** :(హేమేఘ !) త్వయి ఆసన్నే (సతి) = ఓ మేఘుడా ! నీవు సమీప మందుండగా; దశార్ణాః = దశార్ణ దేశములు; సూచిభిన్నైః = కొనలు వికసించిన; కేతకైః = మొగలి పూవులు; పాండుచ్ఛాయా = తెల్లని రంగుతో; ఉపవన వృతయః = తోటల కంచెలు కలదియు; గృహబలి భుజాం = పక్షుల; నీడారమ్భైః = గూళ్ళ కట్టుటచే; ఆకుల గ్రామ చైత్యాః =అస్తవ్యస్త మైన రచ్చబండల యందలి చెట్లు కలవియునై ; పరిణతైః = పండిన; ఫలైః = ఫలములతో; శ్యామాని జంబూవనాని = నల్లని నేరేడు తోటలు; కతిపయ దినస్థాయి హంసాః = కొద్దిదినములు నివసించు హంసలు కలిగినవి; సంపత్స్యన్తే = కాగలవు.

**తాత్పర్యం** : ఓ మేఘుడా ! నీవు సమీపంలో ఉండగా తెల్లని రంగుతో మొగలిపువ్వులు వికసించి ఉపవనాలకు ముళ్ళ కంచెలా శోభిస్తాయి. పక్షులు గూళ్ళు నిర్మించుకోవడానికి ఆశ్రయించడం వలన వృక్షాలు అస్తవ్యస్తమౌతాయి. పండిన ఫలాలతో ఉన్న నేరేడు తోటల్లో హంసలు కొద్దిరోజులుంటాయి.

**'శ్రీకళా' వ్యాఖ్య** : ఆవరించిన తెల్లని మొగలి పూల వెలుగుల మధ్య నల్లని నేరేడు గుత్తులు కదలుతాయి. ఫలవంతమైన ఈ వనంలో రాయంచలు అతిథులై కొంచెంసేపు విశ్రమించి మరలు తాయి. యక్షుడు మేఘుని ఆ సుందర వనమందు విహరించి పొమ్మని పలుకుతున్నాడు.

**తేషాందిక్షు ప్రథిత విదిశాలక్షణాం రాజధానీం**
**గత్వాసద్యః ఫలమవికలం కాముకత్వస్య లబ్ధా ।**
**తీరోపాన్త స్తనిత సుభగం పాస్యసి స్వాదుయస్మా -**
**త్సభ్రూభఙ్గం ముఖమివ పయో వేత్ర వత్యాశ్చలోర్మి ॥** **24**

**పదచ్ఛేదం** : తేషాం, దిక్షు, ప్రథిత, విదిశా, లక్షణాం, రాజధానీం, గత్వా, సద్యః ఫలం, అవికలం, కాముకత్వస్య, లబ్ధా, తీర ఉపాన్త స్తనిత, సుభగం, పాస్యసి, స్వాదు, యస్మాత్, సభ్రూభంగం, ముఖం, ఇవ, పయః, వేత్రవత్యాః, చలోర్మి.

**అన్వయం** : దిక్షు, ప్రథితం, విదిశాలక్షణం, తేషాం, రాజధానీం, తాం, గత్వా, సద్యః, కాముకత్వస్య, అవికలం, ఫలం, లబ్ధా, (త్వయి) స్వాదు, చలోర్మి, వేత్రవత్యా,పయః, సభ్రూభంగం, ముఖమివ , తీరోపాన్తే, స్తనితం, సుభగం, పాస్యసి.

విలాసోత్కర్షకవిసాక్షీభూతమైనవి. అక్కడ కొద్ది సమయం విశ్రమించ మంటున్నాడు యక్షుడు మేఘునితో. అలం : ఉత్ప్రేక్ష.

**విశ్రాన్తః సన్వ్రజవన నదీ తీరజాతాని సిఞ్చ-**
**న్నుద్యానానాం నవజలకణైర్యూథికాజాలకాని ।**
**గణ్డస్వేదాపనయనరుజాక్లాన్త కర్ణోత్పలానాం**
**ఛాయాదానాత్క్షణ పరిచితః పుష్పలావీ ముఖానామ్ ॥ ।** **26**

**పదచ్ఛేదం:** విశ్రాన్తఃసన్, వ్రజవన నదీ తీరజాతాని, సిఞ్చన్, ఉద్యానానాం, నవజలకణైః, యూథికాజాలకాని, గణ్డస్వేద, అపనయన, రుజాక్లాన్త, కర్ణోత్పలానాం, ఛాయాదానాత్, క్షణపరిచితః, పుష్పలావీముఖానాం.

**అన్వయం:** విశ్రాన్తఃసన్, వననదీతీరజాతాని, ఉద్యానానాం, యూథికాజాలకాని, నవజలకణైః, సిఞ్చన్, గణ్డస్వేద, అపనయన, రుజాక్లాన్తకర్ణోత్పలానాం, పుష్పలావీముఖానాం, ఛాయాదానాత్, క్షణపరిచితః, వ్రజ.

**ప్రతిపదార్థం:** విశ్రాన్తఃసన్= విశ్రాంతినొందినవాడవై; వననదీ తీర జాతాని= అరణ్యనదీ ఒడ్డునపుట్టిన( అకృత్రిమమైన,స్వాభావికమైన); ఉద్యానానాం= ఉద్యానవనములయందు; యూథికాజాలకాని= మల్లెమొగ్గల; నవజలకణైః= నూతనమైన నీటి బిందువుల చేత; సిఞ్చన్= తడుపుకొనుచు; గణ్డస్వేద, అపనయన రుజాక్లాన్త కర్ణోత్పలానాం= చెక్కిళ్ళపై చెమటను తుడుచుకొనుచు బాధోపశమనమునకై చెవియందు వాడిన పద్మములు కల; పుష్పలావీముఖనామ్= కుసుమాపచయమొనర్చు స్త్రీలకు; ఛాయాదానాత్= నీడనొసగి; క్షణపరిచితః= కొద్దిసేపు పరిచయముతో; వ్రజ= వెళ్ళుము.

**తాత్పర్యం:** విశ్రాంతి నొంది అరణ్యాల్లో ప్రవహించే నదీ తీరాల్లో స్వాభావికంగా పెరిగిన ఉద్యానవనాల్లో మల్లెలను నూత్న నీటి బిందువులచే తడుపుచు ఆ శ్రమవల్ల కలిగిన చెక్కిళ్లపై చెమటను తుడుచుకొనుటకై చెవియందు పద్మములధరించిన పుష్పలావికల కు నీడనొసగి క్షణకాలము పరిచితినొంది వెళ్ళుము.

**'శ్రీకళా' వ్యాఖ్య:** అక్కడనుంచి పయనంకొనసాగిస్తే అరణ్యాల్లో నిసర్గ మధురమైన ఉద్యాన వనాల్లో కుసుమాపచయంకావిస్తున్న పుష్పలావికలు మేఘునికి దృగ్గోచర మౌతారట.వారికి కొంచెం నీడనిచ్చి వారి అభిమానాన్ని క్షణకాలం పొంది తరలి పొమ్మంటున్నాడు. మేఘుడు ఆపుష్పలావికల పట్ల కాముకుడు. ఈతని దర్శనంచేత పుష్పలావికలైనఆకామినులకు ముఖవికాసం కలుగుతుందని భావం. అలం: సమాసోక్తి.

**నీచైరాఖ్యం గిరిమధివసేస్తత్ర విశ్రామహేతో -**
**స్త్వత్సంపర్కాత్పులకితమివప్రౌఢపుష్పైః కదమ్బైః ।**
**యఃపణ్యస్త్రీ రతిపరిమలో ద్గారి భిర్నాగరాణా -**
**ముద్దామాని ప్రథయతి శిలావేశ్మభిర్యౌవనాని ॥** 25

**పదచ్ఛేదం:** నీచైః, ఆఖ్యం, గిరిం, అధివసేః, తత్ర, విశ్రామహేతోః, త్వత్, సంపర్కాత్, పులికితం, ఇవ, ప్రౌఢపుష్పైః, కదమ్బైః, యః,పణ్యస్త్రీ, రతిపరిమళోద్గారిభిః, నాగరాణాం, ఉద్దామాని, ప్రథయతి, శిలావేశ్మభిః, యౌవనాని.

**అన్వయం:** తత్ర; విశ్రామహేతోః; ప్రౌఢపుష్పైః; త్వత్సంపర్కాత్; పులికితమివ; నీచైరాఖ్యం; గిరిం, అధివసేః; పణ్యస్త్రీరతిపరిమలో ద్గారిభిః, శిలావేశ్మభిః, నాగరాణాం; ఉద్దామాని; యౌవనాని; ప్రథయతి.

**ప్రతిపదార్థం:** తత్ర= ఆవిదిశానగర సమీపమున; విశ్రామహేతోః= విశ్రమించు(టకు)ము; ప్రౌఢపుష్పైః= బాగుగా పూచిన పుష్పములతో నున్న; కదమ్బైః= కదంబవృక్షములు; త్వత్ సంపర్కాత్= నీ సంయోగమువలన; పులకితం, ఇవ= పులకించి(చును); నీచైః, ఆఖ్యం= 'నీచైః' అను పేరుకల; గిరిం, అధివసేః= పర్వతమున ఉండును. యః= ఏదైతే ('నీచైః' పర్వతము); పణ్యస్త్రీరతి పరిమలోద్గారిభిః= వేశ్యల రతిక్రీడల వెదజల్లు సుగంధములు; శిలావేశ్మభిః= కందరములు, గుహలు; నాగరాణాం= పౌరుల; ఉద్దామాని= ఉత్కటమైన; యౌవనాని, ప్రథయన్తి= యౌవనమును చాటుచుండునో.

**తాత్పర్యం:** ఆవిదిశానగర సమీపమున విశ్రమించుము. బాగుగా పూచిన పుష్పములతో నున్న కదంబ వృక్షము నీ సంయోగము వలన పులకించి 'నీచైః' అను పేరు కల పర్వతమున నుండును. ఆగుట్టలులూ, వేశ్యల రతికేళి సంబంధి సుగంధముల వెదజల్లు చున్న గుహలూ పౌరుల ఉత్కటమైన యౌవనమును చాటుచుండును.

**'శ్రీకళా' వ్యాఖ్య :** విదిశానగర సమీపంలో విటుల విహారయోగ్యమైన ఒక క్రీడాపర్వత మున్నది. అది నగర పొలిమేరల కవతల ఉండి ఉండవచ్చు. అయితే ఇది పెద్దపర్వతం కాక పోవడంవల్ల దీనికి 'నిమ్నగిరి' (నీచైః) అను పేరువచ్చింది. అంటే చిన్న గుట్టవంటిదన్నమాట. అక్కడ కడిమిచెట్ల పూలు సువాసన లీనుతూ ఉంటాయి. శిలా వితర్దికలుపభోగయోగ్యాలై ఉన్నాయంట. సహజసిద్ధం కావచ్చు. లేదాకృత్రిమంగా కల్పించినవైనా కావచ్చు. విటులు వేశ్యలతోరహస్యంగాఅక్కడ యథేచ్ఛగా క్రీడిస్తూ ఉంటారు. ఆశిలావేదికలు వారవనితాసౌరభాల్ని వెదజల్లుతూ ఉంటాయి. పౌరుల

ప్రీతినొందుతారు. ఆప్రీతికి నువ్వు భాజనుడవు కాకపోతే మోసపోయిన వాడవౌతావు. అంటే ఆ అవకాశం పోగొట్టుకొన్నట్లే కదా! – లేదా – ఆపురస్త్రీల నేత్రకాంతులు చూచి ఆనందించలేని నీ కళ్ళు నిన్ను మోసం చేసినట్లేతుంది (అక్కడకి వెళ్ళకపోతే) సుందర దృశ్యాన్ని చూచి తన్మయం చెందని కళ్ల ఉండీలేనట్లే. కళ్లున్నందుకు సౌందర్యాన్ని ఆస్వాదించగలగాలి. లేకపోతే నిష్ఫలమే.

ఉజ్జయిని పుణ్యక్షేత్రం. మోక్షప్రదాలైన సప్తక్షేత్రాల్లో ఒకటి.

**అయోధ్యామధురామాయా కాశీకాఞ్చీ అవన్తికా।**

**పురీద్వారవతీచైవ సప్తైతే మోక్షదాయికాః॥**

'అవన్తిక' అన్నా ఉజ్జయినన్నా ఒకటే.

"**ఉజ్జయినీ స్యాద్విశాలావన్తీ పుష్పకరణ్డినీ**" (హేమచంద్రుడు). ఇది కాళిదాసు ప్రదేశం. విక్రమాదిత్యుడు పాలించింది. ఆనాటి నుండి నేటివరకు హైందవులు సగర్వంగా చెప్పుకోదగ్గ ప్రదేశం.

**వీచిక్షోభస్తనిత విహగ శ్రేణి కాఞ్చీ గుణాయాః**
**సంసర్పన్త్యాః స్ఖలిత సుభగం దర్శితావర్త నాభేః।**
**నిర్విన్ధ్యాయాః పథిభవ రసాభ్యన్తరః సన్నిపత్య**
**స్త్రీణా మాద్యం ప్రణయవచనం విభ్రమో హి ప్రియేషు॥** 28

**పదచ్ఛేదం** : వీచిక్షోభస్తనిత విహగశ్రేణి కాఞ్చీ గుణాయాః, సంసర్పన్త్యాః, స్ఖలిత సుభగం, దర్శితావర్తనాభేః, నిర్విన్ధ్యాయాః, పథి, భవ, రసాభ్యన్తరః, సన్నిపత్య, స్త్రీణాం, ఆద్యం, ప్రణయవచనం, విభ్రమః, హి, ప్రియేషు.

**అన్వయం** : పథి,వీచిక్షోభ స్తనిత విహగ శ్రేణి కాఞ్చీ గుణాయాః, స్ఖలిత సుభగం, సంసర్పన్త్యాః, దర్శితావర్తనాభేః, నిర్విన్ధ్యాయాః, సన్నిపత్య, రసాభ్యన్తరః, భవ, స్త్రీణాం, ప్రియేషు, విభ్రమః, ఆద్యం, ప్రణయవచనం హి.

**ప్రతిపదార్థం** : పథి = మార్గమున; వీచిక్షోభ = తరంగ చాలనచే; స్తనిత = శబ్దము చేయుచున్న; విహగ శ్రేణి = హంసల వరుస (పంక్తి) కాంచీగుణాయాః= మెలనూలుగా కలదియు; స్ఖలిత సుభగం = తొట్రుపాటుచే మనోహరమై; సంసర్పన్త్యా = ప్రవహించుచు; దర్శితావర్తనాభేః = ఆవృత్తి నొందిన నాభిని చూపుచున్న; నిర్విన్ధ్యాయాః = 'నిర్వింధ్య'

**వక్రః పన్థాయదపి భవతః ప్రస్థితస్యోత్తరాశాం**
**సౌధోత్సఙ్గప్రణయవిముఖో మాస్మభూరుజ్జయిన్యాః।**
**విద్యుద్దామస్ఫురితచకితైస్తత్ర పౌరాఙ్గనానాం**
**లోలాపాఙ్గైర్యది న రమసే లోచనైర్వఞ్చితోఽసి॥** 27

**పదచ్ఛేదం:** వక్రః, పన్థా, యత్+అపి, భవతః, ప్రస్థితస్య, ఉత్తర+ఆశాం, సౌధ, ఉత్సఙ్గ ప్రణయవిముఖః, మాస్మభూః, విద్యుద్దామస్ఫురిత చకితైః, తత్ర, పౌర+అఙ్గనానాం, లోల, అపాఙ్గైః, యది, న, రమసే, లోచనైః, వఞ్చితః, అసి.

**అన్వయం:** ఉత్తరాశాం, ప్రస్థితస్య, భవతః, పన్థా, యదపి, ఉజ్జయిన్యాః, సౌధ+ఉత్సంగ ప్రణయవిముఖః, మాస్మభూః, తత్ర, విద్యుత్ దామ స్ఫురిత చకితైః, లోల+అపాఙ్గైః, పౌర+అఙ్గానానాం, లోచనైః, న, రమసే, యది, వఞ్చితః, అసి.

**ప్రతిపదార్థం:** ఉత్తర ఆశాం= ఉత్తరదిక్కుగా; ప్రస్థితస్యభవతః= బయలుదేరిన నీకు; పన్థా, వక్రః, యదపి= మార్గము చుట్టు అయినప్పటికిని; ఉజ్జయిన్యాః= ఉజ్జయినిలో (విశాలానగరములో); సౌధ ఉత్సంగ ప్రణయవిముఖః= సౌధాగ్రపరిచయమునకు విముఖుడవు; మాస్మభూః = కాకుము (కావలదు); తత్ర విద్యుత్ దామ స్ఫురిత చకితైః= అచ్చటి విద్యుల్లతలస్ఫురణచేచకితమైన; లోల, అపాఙ్గైః= చంచలమైనచూపులు కల; పౌరఅఙ్గనానాంలోచనైః = పురస్త్రీల నేత్రముల చేత; న, రమసే,యది = ప్రీతినొందినవాడవు కాకున్నచో; త్వం, వఞ్చితః, అసి = నీవు మోసగింపబడిన వాడవగుదువు.

**తాత్పర్యం:** ఉత్తరదిక్కుగా బయలుదేరిన నీకు కొంచెం చుట్టు అయినా ఉజ్జయినిలో (విశాలనగరంలో) సౌధాగ్రపరిచయానికి విముఖుడవుకావలదు. విద్యుల్లతాస్ఫురణచే చంచలమైన దృక్కులు కల పురస్త్రీలనేత్రానందానికి భాజనుడవుకాక పోయిన మోసగింప బడినవాడవౌదువు.

**'శ్రీకళా' వ్యాఖ్య:** మేఘుడు అలకానగరికి రామగిరి నుండి బయలుదేరేడు. ఆపట్టణం ఉత్తరదిక్కుగా ఉంది. కొంచెం చుట్టు అయినా వింధ్యకు ఒకింత ప్రాగ్భానికున్న ఉజ్జయినికి వెళ్ళమంటున్నాడు. ఎందుకు? అక్కడ సుందరమైన దృశ్యాలు చూడడానికి. ఏమిటా దృశ్యాలు? ఉజ్జయినీ నగరం మెరుపు తీగల వంటి దీపకాంతుల్లో, లేదా మెరుపుల్లో అక్కడి సౌధాలు దర్శనీయమై ఉంటాయి. వాటి కాంతులు ప్రతిఫలించడం చేత చకితనేత్రలైన పౌరస్త్రీల సౌందర్యం స్పృహణీయంగా ఉంటుంది. వారు నిన్ను చూచి

*కేశానాం చముహుర్ముహుర్వివరణం వార్తా చ సఖ్యా సహ ,*
*కుర్యుః ప్రీతి వశాత్ స్త్రియః సమదనా దృష్ట్వా వరం వాఞ్ఛితమ్" ॥*

అని చిక్కని చూపులు, శరీరాలం కరణ, చెవిని మర్దించు కోవడం, నాభిని చూపడం ఎదురుగా నడవడం, చిన్న పిల్లలను కౌగిలించుకోవడం, జడను మాటి మాటికీ అల్లు కోవడం, సఖులతో ప్రణయ సంబంధి ప్రసంగం, మద నాతురలైన స్త్రీల వ్యాపారాలని చెప్పడం జరిగింది. వీటిలో నాభి దర్శనం ప్రకృత వర్ణనీయాంశం.

అదే విధంగా 'జల' శబ్దానికి –

*శృంగారాదౌజలే వీర్యే సువర్ణేవిషశుక్రయోః ।*
*తిక్తాదావమృతే చైవ నిర్యాసే పారదేధ్వనా॥ "ఆస్వాదేనవ రసం ప్రాహుః ..."*

అని నానార్థాల నిస్తోంది శబ్దార్ణవ నిఘంటువు. అలం : సంకరం.

**వేణీ భూతప్రతను సలిలా తామతీ తస్యసిన్ధుః**
**పాణ్డుచ్ఛాయా తటరుహ తరుభ్రంశి భిర్జీర్ణ పర్ణైః ।**
**సౌభాగ్యంతే సుభగ విరహావస్థయా వ్యఞ్జయన్తీ**
**కార్శ్యంయేన త్యజతి విధినా సత్వయైవో పపాద్యః ॥** 29

**పదచ్ఛేదం :** వేణీభూాత ప్రతను సలిలా, తాం, అతీతస్య, సింధుః, పాండుచ్ఛాయా, తటరుహ తరుభ్రంశిభిః, జీర్ణపర్ణైః, సౌభాగ్యం, తే, సుభగ విరహావస్థయా, వ్యంజయన్తీ, కార్శ్యం,తేన, త్యజతి, విధినా, త్వయైవ, ఉపపాద్యః.

**అన్వయం**: హే సుభగ!, వేణీ భూాత ప్రతను సలిలా, తటరుహతరుభ్రంశిభిః, జీర్ణపర్ణైః, పాండుచ్ఛాయా విరహావస్థయా, సౌభాగ్యం, వ్యంజయంతీ, సింధుః, యేన, విధినా, కార్శ్యం, త్యజతి, స(విధిః) త్వయా, ఏవ, ఉపపాద్యః.

**ప్రతి పదార్థం** : వేణీ భూాత ప్రతను సలిలా = స్వల్పమైన నీటిచే జడవలెనున్న దియు ; తట తరుభ్రంశిభిః = ఒడ్డున ఉన్న వృక్షములనుండి జారిన ; జీర్ణపర్ణైః = పండుటాకులు; పాండుచ్ఛాయా = తెల్లనివర్ణముతో నున్నవి(అందుకే); హేసుభగ! = ఓ అదృష్టవంతుడా!; విరహావస్థయా, తాం = విరహావస్థనొందిన నీకొఱకు – ఆనిర్వింధ్యను; అతీతస్య= దేశాంతరము నసున్న; తే= నీయొక్క; సౌభాగ్యం వ్యంజయన్తీ తే= అదృష్టమును

అనుపేరు కల నదిని; సన్నిపత్య = పొంది; రసాభ్యన్తరః, భవ = శృంగారాన్తరంగుడవు కమ్ము (లేదా) నీటిని పొందిన వాడవు కమ్ము; స్త్రీణాం = స్త్రీలకు; ప్రియేషు = ప్రియుల విషయమున; విభ్రమః = విలాసమే; ఆద్యం = మొదటి; ప్రణయవచనం, హి ప్రేమ పూరితమైన వాక్కు కదా!

**తాత్పర్యం** : మార్గమున తరంగ చాలనముచే ధ్వనించుచు హంసల శ్రేణియే మొల నూలుగా కల్గి మనోహరంగా ప్రవహిస్తూ (ఆవృత్తుల) సుడులనే నాభిని చూపుచున్న 'నిర్వింధ్య' అను పేరుకల నదిని పొంది శృంగారాంత రంగుడవు కమ్ము. స్త్రీలకు ప్రియుల విషయమున (వారి) విలాసమే మొదటి ప్రణయ వచనము కదా!

**'శ్రీకళా' వ్యాఖ్య** : మార్గంలో 'నిర్వింధ్య' అనే పేరు కల నది ఉంది. ఆ నదీ తరంగాలు ధ్వనిస్తున్నాయి. హంసల వరుస మొలనూలుగా భాసిస్తూ ఉంటే తరంగ ధ్వని ఆ మొలనూలి మువ్వల ధ్వనిగా ఉత్ప్రేక్షిస్తున్నాడు కవి. నదిని స్త్రీ గా ఊహిస్తే ఆ స్త్రీ ప్రియుడు మేఘుడు. నదిలో సుడులు వస్తూ ఉంటాయి. ఆ సుడి నాభిగా కవి ఉత్ప్రేక్ష. ఆనాభిని మేఘునికి చూపుతోంది నది అనే నాయిక. నదీజలాలను మేఘుడు స్వీకరిస్తాడు కదా! ఆ నీటిని స్వీకరించి నీరు కలవాడుగా మేఘుడు భాసిస్తున్నాడు. అనురాగ వతియైన స్త్రీ ప్రియుల విషయంలో కనబరచే విలాసమే ఆమె మొదటి ప్రణయ వచనమట.

ఈ శ్లోకంలో నిర్వింధ్యా నదిని నాయికగను, మేఘుని నాయకునిగను, హంసల వరుసను మొలనూలుగను, తరంగాల ధ్వనిని ఆ మొలనూలి మువ్వల శబ్దంగా, నదిలో సుడులను నాభిగా రూపారోపణ చేసి నైరూప్య చిత్రాన్ని సరస హృదయుల కందించేడు కాళిదాసు. ఈ చిత్రణకి భావుకుని భావనే భిత్తి స్థానీయమైంది. ఈ భావనకి దీప్తి నిచ్చేది 'రస' శబ్దాంతర శ్లేష. నాయిక నాయకుని ఆహ్వానిస్తోంది. ఈ ఆహ్వానం వాచ్యం కాక వ్యంగం. అది మళ్ళీ కాంతాజనోచితం. ఏమంటే –

> *"ఆకారైరిజ్గితైర్గత్యా చేష్టయా భాషణేనచ ।*
> *నేత్ర వక్త్ర వికారైశ్చ లక్ష్య తేఽన్తర్గతం మనః ॥"*

అని ఆకారం, అభిప్రాయం, నడక, చేష్ట, మాట, కళ్ళు, ముఖకవళికల వల్ల మనసులోని మర్మాన్ని తెలిసికోవాలి. 'మాట' నదికి ఉండదు కనుక తదితర సాధన సంపత్తితోనే మనసు తెలియాలి. నాయిక నాభి దర్శనం నాయకునికి ప్రణయోద్దీపకం.

> *"స్నిగ్ధం దృష్టి పథం విభూషిత తనుః కర్ణస్యక ణ్డూయనం*
> *నాభేర్దర్శన ముత్పథం చగమనం బాల స్వచాళిజ్గనమ్ ।*

శ్రీవిశాలాం = సంపత్సమృద్ధమైన; విశాలాంపురీం= విశాలా నగరమునకు; ఉపసర = వెళ్ళుము.

**తాత్పర్యం**: ఉదయనకథాకోవిదులైన గ్రామీణ వృద్ధులుకల జనపదములతో శోభించుచున్న అవన్తిని చేరి క్షీణించిన పుణ్యంతో స్వర్గలోక వాసులు భువిని పొందుచు శేషించిన పుణ్యంతో తీసికొనివచ్చిన స్వర్గలోకపు ముక్కయో అనునట్లున్న సంపత్సమృద్ధమైన విశాలానగరమునకు వెళ్ళుము.

**'శ్రీకళా' వ్యాఖ్య**: అవన్తిని చేరి విశాలానగరం వెళ్ళమంటున్నాడు యక్షుడు. ఆ అవన్తిలో వృద్ధులు వత్సరాజైన ఉదయనుని కథలు కళ్లకు కట్టినట్లు చెప్పడంలో బహునేర్పరులు. పూర్వం ఉదయన మహారాజు చేసిన పనులన్నీ ఆ ఆ ప్రదేశాలను చూపుతూ ఇక్కడిది చేసేడు - ఇక్కడిది - అంటూ రసవత్తరంగా చెబుతారు. వాసవదత్త ఆరాజు భార్య. వీరిద్దరి ప్రణయ వృత్తాంతాన్నీ కాళిదాసుకు పూర్వుడైన భాస మహాకవి 'స్వప్నవాసవ దత్త' అనే నాటకంగా వ్రాసేడు.

ఇక విశాలానగరం క్షీణించిన పుణ్యంతో స్వర్లోకవాసులు భువికి వస్తూ ఆ స్వర్గలోకపు ఒక ముక్కను తెచ్చారో అన్నట్లుంటుందిట.

''*క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి*'' అని శాస్త్రం. అలం : సంస్పృష్టి.

**దీర్ఘీకుర్వన్పటు మదకలం కూజితం సారసానాం**
**ప్రత్యూషేషు స్ఫుటిత కమలామోదమైత్రీ కషాయః ।**
**యత్ర స్త్రీణాం హరతి సురతగ్లానిమఙ్గానుకూలః**
**శిప్రా వాతః ప్రియతమ ఇవ ప్రార్థనాచాటుకారః ॥** 31

**పదచ్ఛేదం** : దీర్ఘీకుర్వన్, పటు, మదకలం, కూజితం, సారసానాం, ప్రత్యూషేషు, స్ఫుటిత, కమలా మోదమైత్రీ కషాయః, యత్ర, స్త్రీణాం, హరతి, సురతగ్లానిం, అఙ్గానుకూలః, శిప్రావాతః, ప్రియతమ, ఇవ, ప్రార్థనా చాటుకారః.

**అన్వయం**: యత్ర, ప్రత్యూషేషు, పటు,. మదకలం, సారసానాం, కూజితం, దీర్ఘీకుర్వన్, స్ఫుటిత కమలా మోదమైత్రీ కషాయః, అంగానుకూలః, శిప్రావాతః, ప్రార్థనా చాటుకారః, ప్రియతమః, ఇవ, స్త్రీణాం, సురతగ్లానిం, హరతి.

**ప్రతిపదార్థం** : యత్ర = ఎక్కడైతే (ఏవిశాలానగరంలో నైతే); ప్రత్యూషేషు = ఉషః

తెలుపుచున్నది; (అసౌ) సింధుః = ఇటువంటి నిర్వింధ్యానది; యేన విధినాం = ఏ ప్రక్రియచే కార్శ్యం త్యజతి = కృశత్వమును వీడునో; స(విధిః) = ఆవిధి – ఆవ్యాపారము; త్వయా, ఏవ, ఉపపాద్యః = నీ చేతనే చేయదగినది.

**తాత్పర్యం**: శుష్కించుటచే జడవలె సన్ననైన ఆ నిర్వింధ్యానది ఒడ్డున ఉన్న వృక్షములనుండి జారిన పండుటాకులతో తెల్లగానున్నది. (పాలిపోయింది) ఏవంవిధ విరహావస్థనొందిన ఆ నది దేశాంతరమున నున్న నీ అదృష్టాన్ని వ్యక్తంచేస్తోంది. ఏం చేస్తే ఆమె కృశత్వం వీడుతుందో ఆ పని నువ్వే చెయ్యాలి.

**'శ్రీకళా' వ్యాఖ్య** : నదీపరంగా వర్ణించడం – నాయికాపరంగా సంయోగం.

స్త్రీపురుషుని కొరకు విరహావస్థనొందడం ఆ పురుషుని అదృష్టం. ఆ స్త్రీ మనస్వితా ద్యోతకం. శృంగారంలోని పవిత్రతను ఈశ్లోకం వ్యక్త పరుస్తుంది. నాయిక దశావస్థల్లో 'తనూతా' అంటే కృశత్వాన్ని ఈ శ్లోకం ప్రతిపాదిస్తోంది. అలం : సమాసోక్తి.

**ప్రాప్యావన్తీనుదయన కథాకోవిద గ్రామవృద్ధా -**
**న్పూర్వోద్దిష్టా మనుసరపురీం శ్రీవిశాలాం విశాలామ్ ।**
**స్వల్పీభూతే సుచరిత ఫలే స్వర్గిణాం గాం గతానాం**
**శేషైః పుణ్యైర్హృత మివదివః కాన్తిమత్ఖణ్డమేకమ్ ॥** 30

**పదచ్ఛేదం** : ప్రాప్య, అవన్తీన్, ఉదయన కథాకోవిదగ్రామవృద్ధాన్, పూర్వ + ఉద్దిష్టామ్, అనుసర, పురీం, శ్రీవిశాలాం, విశాలామ్, స్వల్పీ భూతే, సుచరిత ఫలే, స్వర్గిణాం, గాం, గతానాం, శేషైః, పుణ్యైః, హృతం, ఇవ, దివః, కాంతిమత్, ఖండం, ఏకమ్.

**అన్వయం** : ఉదయనకథాకోవిద గ్రామవృద్ధాన్, పూర్వోద్దిష్టాం, అవన్తీన్, ప్రాప్య, సుచరితఫలే, స్వల్పీభూతే, గాం, గతానాం, స్వర్గిణాం, శేషైః, పుణ్యైః, హృతం, కాంతిమత్ ఏకం దివః, ఖండమ్, ఇవ (స్థితమ్) శ్రీ విశాలాం, విశాలాం, పురీం, ఉపసర.

**ప్రతిపదార్థం** : ఉదయనకథా కోవిద = ఉదయన కథలు చెప్పుటలో నేర్పరులైన; గ్రామవృద్ధాన్ = గ్రామీణ వృద్ధులుకల; పూర్వోద్దిష్టాం = ఇదివరలో చెప్పిన (27శ్లో.); అవన్తీన్ ప్రాప్య = అవన్తి జానపదములను పొంది; సుచరిత ఫలే = పుణ్యఫలము; స్వల్పీభూతే = క్షీణించినది కాగా; గాం, గతానాం = భువిని పొందిన; స్వర్గిణాం = స్వర్గవాసులు; శేషైః పుణ్యైః = శేషించిన పుణ్యములతో; హృతమ్ = తీసికొనివచ్చిన; కాంతిమత్, ఏకం, దివః ఖండమ్ ఇవ = కాంతివంతమైన స్వర్గభాగము వలెనున్న;

శిఖిభిః, దత్తనృత్యాపహారః, కుసుమ సురభిషు, లలితవనితా పాదరాంగాంకితేషు, హర్మ్యేషు, అస్యాః, లక్ష్మీం, పశ్యన్, అధ్వఖేదం, నయేథాః.

**ప్రతిపదార్థం** : జాల + ఉద్గీర్ణైః = కిటికీలనుండి బయటకు వచ్చిన; కేశసంస్కారధూపైః = తలవెంట్రుకలను ఆరబెట్టుకొనుటకు వేసిన ధూపములచేత; ఉపచిత వపుః = పెంపొందిన దేహము కలవాడవై; బంధుప్రీత్యా= బంధువ నెడి ప్రేమతో; భవన శిఖిభిః = భవనముల యందలి (పెంపుడు) నెమళ్ల చేత; దత్త నృత్యాపహారః = సమర్పిత నృత్యమును కానుకగా కలవాడవై; కుసుమ సురభిషు = పుష్పపరిమళ యుతములును; లలితవనితా పాదరాగాంకితేషు = అందమైన స్త్రీల పారాణి ముద్రలు కలిగిన; హర్మ్యేషు = భవనములయందు, అస్యాః, లక్ష్మీం, పశ్యన్= ఈ ఉజ్జయిని (సంపద) శోభను చూచుచు; అధ్వఖేదం = మార్గాయాసమును; నయేథాః = పోగొట్టుకొనుము.

**తాత్పర్యం** : కిటికీలనుండి వెలువడు కేశపాశ ధూమముల చేత దేహ పుష్టి నొందిన వాడవై బంధుప్రేమతో భవనములలోని నెమళ్ళ నృత్యమును నీకు కానుకగా సమర్పించుచుండ, పుష్పపరిమళయుతములై సుందరీ పాదముద్ర చిహ్నితమైన ఈ ఉజ్జయిని శోభను తిలకిస్తూ మార్గాయాసమును పోగొట్టుకొనుము.

**'శ్రీకళా' వ్యాఖ్య**: మార్గాయాసాన్ని పోగొట్టు కోవడానికి జలపానం, చల్లగాలి ఏవిధంగా తోడ్పడతాయో సుందరదృశ్యాలు కూడా అదే విధంగా తోడ్పడుతాయి. ఆహార, జలస్వీకారాదులు నీరసాన్ని పోగొట్టి శరీరంలో ఓపికను పుంజుకోవడానికి దోహదం చేస్తాయి. ఉజ్జయినీ నగరంలో స్త్రీలు స్నానా నంతరం కేశపాశాన్ని ఆరబెట్టుకోవడానికి సుగంధయుతమైన ధూపాలు (సాంబ్రాణిపొగ) వంటివి వేసికొంటారు. ఆ ధూమం కిటికీల్లోంచి బయటకు వస్తూ మేఘుని దేహ పుష్టిని ఇనుమడింపచేస్తుంది. ''ధూమజ్యోతి స్సలిలమరుతాం సన్నిపాతః'' అని మేఘుని శరీరాన్ని ముందే వర్ణించేడు కవి. ఈ ధూమం ఆ ధూమం కలిసి మేఘుని ఆకారం మరింత సౌష్టవాన్నొందుతుంది. ఇది భౌతికం. పెంపుడు నెమళ్ల కాన్కలైన నృత్యాలు, పుష్ప పరిమళాలు ఉత్సాహాన్ని కల్గిస్తాయి. అక్కడి భవనాలకు అచటి స్త్రీల పారాణి (లేకలత్తుక) ముద్రలు నేలకు అంటి ఒక వింత శోభను చేకూర్చి నేత్ర తర్పణం కావిస్తుంది. ఇది మానసికం. సుందర దృశ్య వీక్షణం, మధురమైన శబ్దాలను వినడం మానసిక బడలికలను తొలగిస్తాయి. దాంతో మార్గాయాసం వీడి పోతుంది. అలం : ఉదాత్తం.

కాలమున; పటు = స్పష్టమైన; మదకలం = మదముచేఅవ్యక్త మధురమైన; సారసానాం = హంసలయొక్క; కూజితం = నాదము; దీర్ఘీకుర్వన్ = కొనసాగించుచు; స్ఫుటిత కమల ఆమోద మైత్రీ కషాయః = వికసించిన కమలముల పరిమళముతోకూడిన సువాసన; అంగానుకూలః = శరీరమునకు తగిన అనుకూల స్పర్శ కల (గాఢాలింగనమువలన కలిగిన శరీర సంవాహనలు); శిప్రావాతః = శిప్రానది మీద నుండి వీచిన గాలి; ప్రార్థనా చాటుకారః ఇవ = ప్రార్థనతో కూడిన అనునయ వాక్యములవలె; స్త్రీణాం సురత గ్లానిం = స్త్రీల రతిఖేదమును; హరతి = పోగొట్టుచున్నది.

**తాత్పర్యం** : అవిశాల నగరంలో శిప్రానది ఉంది. ప్రతి రోజూ ఉషః కాలంలో గాలి శిప్రానది మీదుగా ప్రసరించడంవల్ల శీతలత్వాన్ని పొందుతుంది. గాలి వీచడంవలన హంసల అవ్యక్తమధురమైన నాదాలు దీర్ఘమైసాగు తున్నాయి. అది వికసించిన పద్మాలకు తగిలి ఆపద్మ సుగంధాన్ని కూడా పుంజుకొంటోంది. రాత్రి రతి క్రీడల వలన అలసిన స్త్రీలకి ఈ వాయువు వారి ప్రియుల అనునయవాక్యాలు వలె వారిశ్రమను మరపింపజేసి ఆనందాన్ని కలుగజేస్తోంది.

**'శ్రీకళా' వ్యాఖ్య** : ''సారసోమైథునీ కామీగోనర్దః పుష్కరాహ్వయః'' ఇతియాదవః, ''చక్రాంగః సారసోహంసః'' అని శబ్దార్ణవం.

రతి క్రీడానంతరం మరల రతిని యాచిస్తున్నారు ప్రియులు. వారి ప్రార్థన చాటూక్తులు పెంపుడు చిలుకలు మళ్ళీ మళ్ళీ పలుకుతున్నాయి. ఆ పెంపుడు చిలుకల పలుకుల్ని శిప్రావాతం పెంపొందింపజేస్తోంది. అవి మనోహరమై స్త్రీలకు మరల భోగేచ్ఛను కలుగజేస్తున్నాయి. అలం : ఉపమ.

**జాలోద్గీర్ణైరుపచిత వపుః కేశసంస్కార ధూపై -**
**ర్బన్ధు ప్రీత్యా భవనశిఖిభిర్దత్త నృత్త్యోపహారః ।**
**హర్మ్యేష్వస్యాః కుసుమ సురభిష్వధ్వ ఖేదం నయేథా**
**లక్ష్మీం పశ్యంల్లలిత వనితా పాదరాగా ఙ్కితేషు ॥** 32

**పదచ్ఛేదం** : జాల + ఉద్గీర్ణైః, ఉపచిత, వపుః, కేశసంస్కారధూపైః, బన్ధుప్రీత్యా, భవనశిఖిభిః, దత్త, నృత్త్యోపహారః, హర్మ్యేషు, అస్యాం, కుసుమ సురభిషు, అధ్వఖేదం, నయేథాః, లక్ష్మీం, పశ్యన్, లలితవనితా పాదరాగాఙ్కితేషు.

**అన్వయం** : జాలోద్గీర్ణైః, కేశసంస్కారధూపైః, ఉపచితవపుః, బంధు ప్రీత్యా, భవన

పుణ్య క్షేత్రములో 'గంధవతీ' నది ప్రవహిస్తోంది. దాంట్లో కలువపూలు ఎక్కువగా ఉంటాయి. స్త్రీలు పరిమళ ద్రవ్యాలు మేనికి పూసికొని స్నానం చేస్తారు. ఈ ద్వివిధ సువాసనలతో ఉన్ననదిపై వీచే గాలి ఆపరిసర ఉద్యానవనాలను కదుల్చుతూ ఉంటుంది. ఆ ఉద్యానవనంలో కుసుమ సౌరభంతో పాటు త్రివిధమైన పరిమళాలు నిన్ను అలరిస్తాయి. ఈ గాలులవల్ల శరీరానికి హాయి కలిగి ఐహిక ప్రయోజనం, మహా మహిమాన్వితుడైన మహాకాల సందర్శనం వలన ఆముష్మిక ప్రయోజనం చేకూరుతాయి. ఇలా ఉజ్జయిని భోగ మోక్ష ప్రదమైనదని కాళిదాసు తననివాస మహిమను ఈ శ్లోకంలో చెప్పేడు. మహాకాలుని మహిమ స్కాంద పురాణంలో –

> ''*ఆకాశేతారకం లిఙ్గం పాతాలే హాటకేశ్వరమ్ ।*
> *మర్త్యలోకే మహాకాలం దృష్ట్వా కామమవాప్నుయాత్ ॥*''

సర్వకామార్థసిద్ధిదమని వర్ణితమైంది.. అలం : ఉదాత్తం.

> **అప్యన్యస్మిఞ్జలధర మహాకాలమాసాద్య కాలే**
> **స్థాతవ్యంతే నయన విషయం యావదత్యేతి భానుః ।**
> **కుర్వన్సంధ్యా బలిపటహతాం శూలినః శ్లాఘనీయా -**
> **మామన్ద్రాణాం ఫలమవికలం లప్స్యసే గర్జితానామ్ ॥** 34

**పదచ్ఛేదం** : అపి, అన్యస్మిన్, జలధర, మహాకాలం, ఆసాద్య, కాలే, స్థాతవ్యం, తే, నయనవిషయం, యావత్, అత్యేతి, భానుః కుర్వన్, సంధ్యా, బలి, పటహతాం, శూలినః, శ్లాఘనీయాం, ఆమంద్రాణాం, ఫలం, అవికలం, లప్స్యసే, గర్జితానాం.

**అన్వయం** : హేజలధర! మహాకాలం, అన్యస్మిన్, కాలే ఆపి, ఆసాద్య, తే, యావత్, భానుః, నయనవిషయం, అత్యేతి (తావత్) స్థాతవ్యం, శ్లాఘనీయాం, శూలినః, సంధ్యాబలిపటహతాం, కుర్వన్, ఆమంద్రాణాం, గర్జితానాం, అవికలం, ఫలం, లప్స్యసే.

**ప్రతిపదార్థం** : హేజలధర ! = ఓ మేఘుడా !; మహాకాలం, అన్యస్మిన్, కాలే అపి, ఆసాద్య, తే = నీవు వేఱొక సమయమున మహాకాలుని చేరినను; యావత్ భానుః, నయన విషయం అత్యేతి = ఎంతవరకు సూర్యుడు దృష్టి పథము నతిక్రమించునో; తావత్, స్థాతవ్యం = అంతవరకు ఉండతగుదువు; సంధ్యాబలిపటహతాం = సంధ్యాకాల పూజయందు తప్పెట వాద్యమును; కుర్వన్ = చేయుచు; ఆమంద్రాణాం, గర్జితానాం = ఈషద్గంభీరములైన గర్జనలయొక్క; అవికలం, ఫలం, లప్స్యసే = అఖండ ఫల ప్రాప్తినొందగలవు.

భ ర్తుః కణ్ఠచ్ఛవిరితి గణైః సాదరం వీక్ష్యమాణః
పుణ్యం యాయాస్త్రి భువన గురోర్ధామ చణ్డీశ్వరస్య ।
ధూతోద్యానం కువలయరజోగన్ధిభిర్గన్ధవత్యా -
స్తోయక్రీడా నిరతయువతి స్నానతిక్తైర్మరుద్భిః ॥ 33

**పదచ్ఛేదం**: భర్తుః, కంఠచ్ఛవిః, ఇతి, గణైః, సాదరం, వీక్ష్యమాణః, పుణ్యం, యాయాః, త్రిభువనగురోః, ధామ, చండీశ్వరస్య, ధూత + ఉద్యానం, కువలయరజః, గంధిభిః, గంధవత్యాః, తోయక్రీడానిరత యువతి స్నాన, తిక్తైః, మరుద్భిః.

**అన్వయం**: భర్తుః, కంఠచ్ఛవిః, ఇతి, గణైః, సాదరం, వీక్ష్యమాణః, కువలయ రజోగంధిభిః, తోయక్రీడా నిరతయువతి స్నానతిక్తైః, గంధవత్యా, మరుద్భిః, ధూతోద్యానం త్రిభువన గురోః, చండీశ్వరస్య, పుణ్యం, ధామ, యాయా.

**ప్రతిపదార్థం** : భర్తుః కంఠచ్ఛవిః, ఇతి = (తమ) స్వామి, కంఠ కాంతి వంటికాంతి కలవాడవు అని; గణైః, సాదరం, వీక్ష్యమాణః= ప్రమథగణములచే ప్రేమతో చూడబడిన వాడవై; కువలయరజోగంధిభిః = కలువపూలపుప్పొడి చేత సుగంధయుతమైనదియు; తోయక్రీడానిరత = జలక్రీడల యందు ఆసక్తి కలిగిన; యువతిస్నానతిక్తైః = స్త్రీలు స్నానమునకై ఉపయోగించు సుగంధములచే; గంధవత్యాః, మరుద్భిః = 'గంధవతీ' నదిపైనుండి వీచు గాలులచే ; ధూతఉద్యానం = కదల్చబడిన ఉద్యానవనములు కలది యునైన; త్రిభువన గురోః పుణ్యం ధామ యాయాః = త్రిలోకనాథుడైన ( కాత్యాయనీ వల్లభుని పవిత్ర స్థానమునకు వెళ్ళుము.

**తాత్పర్యం**: తమస్వామి కంఠవర్ణముతో ఒప్పువాడవని ప్రమథగణాలు ఆదరంతో నిన్ను చూస్తూ ఉంటే పార్వతీ పతి పవిత్ర స్థానం చేరుకో. కలువపూల పుప్పొడి చేత సుగంధయుతమైన, జలక్రీడారతలైన జవరాండ్రు ఉపయోగించిన స్నానీయ సుగంధాలతో కలిసి 'గంధవతీ' నదిపై నుండి వీచే గాలులలతో కదల్చబడిన ఉద్యానాలు కలది (ఆస్థానం)

**'శ్రీకళా' వ్యాఖ్య** : ఆ ఉజ్జయినీ నగరంలో దర్శనీయమైన స్థానాలను చెబుతున్నాడు యక్షుడు మేఘునికి. అది 'మహాకాల'' స్వామినివాసం, పరమపవిత్రం, చండీశుని పవిత్ర క్షేత్రం. అక్కడ ప్రమథగణం తమస్వామి (శివుని) కంఠ కాంతి వంటి కాంతి (నలుపు)తో ఒప్పుతున్నావని నిన్ను మహా ఆదరంతో చూస్తారు. అక్కడ – అంటే ఆ

క్వణితరశనాః = ధ్వనించుచున్న మేఖలలు కలవారును; రత్నచ్ఛాయయా ఖచిత వవిభిః = రత్నకాంతులావరించిన గంట్లతోనున్న కాడలు కల; చామరైః = చామరముల చేత; క్లాన్తహస్తాః = బడలిన చేతులుకల; వేశ్యాః = వేశ్యలు; త్వత్తః, నఖపదసుఖాన్ = నఖక్షతములయందు సుఖమును ఇచ్చు; వర్షాగ్రబిందూన్ ప్రాప్య = తొలకరి చినుకులను పొంది; త్వయి, మధుకరశ్రేణిదీర్ఘాన్ = నీయందు తుమ్మెదలు బారుల వలె పొడవైన; కటాక్షాన్, ఆమోక్ష్యన్తే = కడగంటి చూపులను విడతురు.

**తాత్పర్యం**: ఆసంధ్యాపూజలో పాదధ్వనిచేత మొలనూళ్ళు కదిలి రత్నకాంతులావరించిన వింజామరాలతో విలాసంగా వీస్తూ ఆ శ్రమకు చేతులు బడలగా వేశ్యలు నీ తొలకరి చినుకులు వారికి నఖక్షతాల్లోపడి సుఖం కలిగిస్తే తుమ్మెద బారివంటి పొడవైన కడగంటి చూపులను (ఆప్యాయంగా) నీపై ప్రసరింపజేస్తారు.

**'శ్రీకళా' వ్యాఖ్య**: మహాకాలుని సంధ్యాపూజలో వేశ్యలు నృత్యంచేస్తారు. సాధారణంగా ఈ నృత్యం, సంగీతం మొదలైన వన్నీ ఇప్పుడు దేవాలయాల్లో ''గీతం శ్రావయామి, నృత్యం దర్శయామి'' అని పురోహితులు చదవడంతో పూర్తయి పోతోంది. శాస్త్రోక్త విధిన జరిగే కొద్ది దేవాలయ, పీఠాల్లోనూ ''గీతం శ్రావయామి'' అన్నప్పుడు ఎవరో ఒకరు పాటపాడటమైనా ఉంటోంది. కాని ''నృత్యం దర్శయామి'' అన్నప్పుడు నృత్య ప్రదర్శన జరగడంలేదు. నర్తకీమణులు లేక పోవడం వల్ల కావచ్చు.

ఆనాడు దేవదాసీవ్యవస్థ ఉండేది కనుక దేవదాసీలు నృత్య ప్రదర్శన చేసేవారు. వీరు వేశ్యలు. ఆ వేశ్యలు గతరాత్రి కాముకులు ఇచ్చిన నఖక్షతాలు శరీరం మీద కలవారు. ఆ నఖక్షతాలపై మొదటి వర్ష బిందువు పడటంవల్ల మధురగతస్మృతి కలిగి సుఖం కలుగుతుంది. ఆ సుఖం నీవలన వచ్చింది కనుక వారు కృతజ్ఞతా మిశ్రితమైన శృంగార దృక్కుల్తో నిన్ను చూస్తారు. ఆ చూపుల వరుస తుమ్మెద బారులా ఉంటుంది.

భగవంతుడైన మహాకాలునికి సంధ్యార్చనాసందర్భంలో ''చామరం వీజయామి'' అని చెప్పడం కూడా ఉంది. వీరు వింజామర చేత్తో పట్టుకొని నృత్యం చేస్తున్నారు. సాధారణంగా నృత్యంలో వస్తువులను ధరించి చేసే నృత్యం దేశి నృత్యమనీ, కేవల అభినయాత్మకమైనది మార్గినృత్యమనీ విభజించుకోవచ్చు. నృత్య సర్వస్వమనే గ్రంథంలో-

*''ఖడ్గకందుక వస్త్రాది దణ్డికాచామరస్రజః |*

*వీణాది ధృత్వాయత్కుర్య ర్నృత్యం తద్దైశికం భవేత్ ||''*

**తాత్పర్యం** : ఓ మేఘుడా ! ఒకవేళ నీవు మరొక సమయంలో మహాకాలుని చేరినను సూర్యాస్తమయం వరకు అక్కడ ఉండు. సంధ్య సమయంలో ఆయనకు జరిగే పూజలో నీ ఈషద్గంభీర గర్జనలతో పటహవాద్యం సమకూర్చి అఖండ ఫలప్రాప్తిని పొందుము.

**'శ్రీకళా' వ్యాఖ్య**: ఉజ్జయినిలో 'మహాకాల' దేవాలయం చాలా ప్రసిద్ధినొందింది. భారత దేశంలో ప్రసిద్ధినొందిన ద్వాదశ జ్యోతిర్లింగాల్లో అదొకటి.

***"సౌరాష్ట్రే సోమనాథంచ శ్రీశైలే మల్లికార్జునం***
***ఉజ్జయిన్యాం మహాకాల మోంకార పరమేశ్వరమ్ ।***
***కేదారం హిమవత్పృష్ఠేడాకిన్యాం భీమశంకరం***
***వారాణస్యాం చ విశ్వేశం త్ర్యంబకం గౌతమీ తటే ॥***
***వైద్యనాథం చితాభూమౌ నాగేశం దారుకావనే***
***సేతుబంధేచ రామేశం ఘుశ్మేశం (ఘృణేశం) చ శివాలయే ।***
***ఏతేషాం దర్శనాదేవ పాతకం నైవతిష్ఠతి ॥***

నువ్వు ఒక వేళ ఆ మహాకాలాలయానికి ఉదయాన్నే వెళ్ళినా, మధ్యాహ్నం వెళ్లినా, సూర్యాస్తమయం వరకు ఉండు. సంధ్యా కాలార్చనకు నువ్వు నీ ఉఱుములతో పటహసేవనందించి అఖండపుణ్యం సంపాదించుకోమంటున్నాడు. అలం: కావ్యలింగం.

**పాదన్యాసైః క్వణితరశనాస్తత్ర లీలావధూతై -**
**రత్నచ్ఛాయాఖచిత వలిభిశ్చామరైః క్లాన్తహస్తాః ।**
**వేశ్యాస్త్వత్తో నఖపద సుఖాన్ప్రాప్య వర్షాగ్రబిన్దూ-**
**నామోక్ష్యన్తేత్వయి మధుకర శ్రేణి దీర్ఘాన్కటాక్షాన్ ॥** **35**

**పదచ్ఛేదం** : పాదన్యాసైః, క్వణితరశనాః, తత్ర, లీలా వధూతైః, రత్నచ్ఛాయాఖచిత వలిభిః, చామరైః; క్లాన్తహస్తాః, వేశ్యాః, త్వత్తః, నఖపద సుఖాన్, ప్రాప్య, వర్షాగ్ర బిందూన్, ఆమోక్ష్యన్తే, త్వయి, మధుకరశ్రేణి దీర్ఘాన్, కటాక్షాన్.

**అన్వయం** : తత్ర, పాదన్యాసక్వణితరశనాః, లీలావధూతైః, రత్నచ్ఛాయా, ఖచిత, వలిభిః, చామరైః, క్లాన్త హస్తాః, వేశ్యాః త్వత్తః, నఖపద సుఖాన్, ప్రాప్య, త్వయి, మధుకర శ్రేణి దీర్ఘాన్, కటాక్షాన్, ఆమోక్ష్యన్తే.

**ప్రతిపదార్థం**: తత్ర, పాదన్యాస = ఆ సంధ్యా పూజలో నాట్యమున పాదములుంచుటచేత;

బంగారపు గీత ( జరీవలె ) చుట్టూ ఉన్నట్లు అనేక సార్లు అనేక రంగులతో చూడముచ్చటగా అదృశ్యం ఉండడం మనందరికీ అనుభవంలో ఉన్న విషయమే. కాళిదాసు మౌలికంగా ప్రకృతి కవి. ఆంగ్ల భాషలో వర్డ్స్‌వర్త్ కూడా ప్రకృతి నభివర్ణించి ''ప్రకృతి నీకు గురువ''నే అనే గీతాన్ని కూడా వ్రాసేడు.

ఇక్కడ కాళిదాసు మనదైనందిన జీవితంలో ఒక ఘట్టాన్ని ఈ శ్లోకంలో అభివర్ణించి మనలను అటువంటి ఘట్టాలు పరిశీలించి ఆనందాన్ని పొందుడని పరోక్షంగా ఉద్బోధిస్తున్నాడు. ప్రకృతి పరిశీలన, తత్సౌందర్యాను భూతి జీవితంనుంచి క్రమేపీ దూరమౌతున్న ఈ యాంత్రిక వేగయుగంలో దీనికెంతైనా ఆధునికత ఉంది.

సూర్యాస్తమయంలో ఎఱ్ఱని గీత మేఘ మధ్యంలోనో మేఘానికి చుట్టూనో ఉండి గజాసుర సంహారానంతరం శివుడు రక్తంతో ఓడుతున్న ఆ గజాసుర చర్మాన్ని మెళ్ళోధరించినపుడెలా ఉన్నాడో ఇప్పుడీ మేఘుడు జపాకుసుమ సదృశమైన ఆ అరుణ రేఖతో ప్రకాశిస్తున్నాడు. భవాని అపుడా శివుని చూచి భయపడింది. ఈ శివానుకరణ చేసిన మేఘునిలో శివునిపై మేఘునికి గల భక్తికి భయోద్వేగాలు లేని ప్రశాంత నేత్రాలతో చూస్తోంది.

''శివోభూత్వా శివంయజేత్'' శివుని పూజించడానికి శివునివికమ్మని శాస్త్రం. భర్త ఛాయాపటం చూచి ఆనందించే భార్య ఆనందం భర్తకూ అభిలషణీయమే కనుక శివునికే మేఘదర్శనంతో రక్తంతోతడిసిన గజాసుర చర్మాన్ని ధరించాలనే వాంఛను హరింపజేసి ఆ ఆది దంపతుల కృపకు పాత్రుడవుకమ్మని మేఘుని ఉద్బోధిస్తున్నాడు యక్షుడు. అలం: సంసృష్టి.

**గచ్ఛన్తీనాం రమణవసతిం యోషితాం తత్రనక్తం**
**రుద్ధాలోకే నరపతి పథే సూచి భేద్యై, స్తమోభిః ।**
**సౌదామన్యా, కనక నికషస్నిగ్ధయా దర్శయోర్వీం**
**తోయోత్సర్గస్తనితముఖరో మాస్మభూర్విక్లవాస్తాః ॥** 37

**పదచ్ఛేదం :** గచ్ఛం తీనాం, రమణ వసతిం, యోషితాం, తత్ర, నక్తం, రుద్ధాలోకే, నరపతి పథే, సూచి భేద్యైః, తమోభిః, సౌదామన్యా, కనక నికషస్నిగ్ధయా, దర్శయ ఉర్వీం, తోయ + ఉత్సర్గ, స్తనిత ముఖరః, మా, స్మ (చ) భూః, విక్లవాః, తాః.

**అన్వయం :** తత్ర, నక్తం, రమణవసతిం, గచ్ఛంతీనాం, యోషితాం, సూచిభేద్యైః,

అని ఉంది. కామినుల అపాంగ వీక్షణానికి భాజనుడవు కావడమే శివోపాసనకు సద్యఃఫలమనిధ్వని.

**పశ్చాదుచ్చైర్భుజ తరువనం మణ్డలేనాభిలీనః**
**సాన్ధ్యం తేజః ప్రతినవజపాపుష్పరక్తం దధానః ।**
**నృత్యారమ్భే హరపశుపతే రార్ద్ర నాగా జినేచ్ఛాం**
**శాన్తోద్వేగస్తిమితనయనం దృష్ట భక్తిర్భవాన్యా ॥** 36

**పదచ్ఛేదం** : పశ్చాత్, ఉచ్చైః, భుజతరువనం, మండలేన + అభిలీనః, సాంధ్యం, తేజః, ప్రతి, నవజపాపుష్పరక్తం, దధానః, నృత్య + ఆరమ్భే, హర, పశుపతేః, ఆర్ద్ర, నాగాజిన, ఇచ్ఛాం, శాంత + ఉద్వేగ, స్తిమితనయనం, దృష్టభక్తిః, భవాన్యా.

**అన్వయం** : పశ్చాత్, పశుపతేః, నృత్య + ఆరంభే, నవజపాపుష్పరక్తం, ప్రతి, సాంధ్యం, తేజః దధానః, ఉచ్చైః, భుజతరువనం, మండలేన, అభిలీనః, భవాన్యా, శాంత, ఉద్వేగ, స్తిమిత, నయనం, దృష్ట భక్తిః, పశుపతేః, ఆర్ద్ర నాగాజిన, ఇచ్ఛాం, హర.

**ప్రతిపదార్థం** : పశ్చాత్, పశుపతేః, నృత్య + ఆరంభే = పిమ్మట శివుని (తాండవ) నృత్తారంభవేళ; నవజపాపుష్పరక్తం ప్రతి = నూతనమైన జపాపుష్పపు ఎఱుపుతో సమానమైన; సాంధ్యం, తేజః, దధానః = సంధ్యాకాలారుణిమను ధరించు చున్నవాడవై; ఉచ్చైః భుజతరువనం = ఎత్తైన భుజములనెడి వృక్షములతోడి వనమును; మండలేన, అభిలీనః = మండలాకారముగ (గుండ్రముగ) వ్యాపించి; భవాన్యా = చండికాదేవి (మహాకాలుని భార్య) చేత; శాంత, ఉద్వేగ స్తిమితనయనం = ప్రశాంత నేత్రములతో; దృష్టభక్తిః = చూడబడిన భక్తికలవాడవై; (పశుపతేః) ఆర్ద్ర నాగ + అజిన, ఇచ్ఛాం = శివుని గజాసురుని (రక్తముతో) తడిసిన చర్మమునందలి కోర్కెను; హర = పోగొట్టుము.

**తాత్పర్యం** : సంధ్యాకాల అర్చనానంతరం శివుడు నృత్తారంభవేళ నీవు నూతనమైన జపాపుష్ప భాసమానారుణిమను దాల్చిన వాడవై ఎత్తైన భుజములనెడి వృక్షములతో నున్న వనమును గుండ్రంగా వ్యాపించి అనుద్వేగ కరమైన, శాంతి యుతమగు స్తిమిత నేత్రాలతో భవాని చేత చూడబడిన భక్తికలవాడవై శివునికి గజాసురుని రక్తంతో తడిసిన చర్మమునందలి కోర్కెను పోగొట్టుము.

**'శ్రీకళా' వ్యాఖ్య** : సూర్యాస్తమయ సమయంలో సూర్యుడు ఎఱ్ఱగా ఉంటాడు. ఆసమయంలో ఆకాశంలో మేఘం ఉన్నప్పుడు మేఘానికి కూడా ఒక్కొక్కప్పుడు

**తాంకస్యాం చిద్భవనవలభౌ సుప్త పారావతాయాం**
**నీత్వారాత్రిం చిరవిలసనాత్ఖిన్న విద్యుత్కలత్రః।**
**దృష్టేసూర్యేపునరపి భవాన్వాహయేదధ్వశేషం**
**మన్దాయన్తే నఖలు సుహృదా మభ్యు పేతార్థకృత్యాః॥** 38

**పదచ్ఛేదం :** తాం, కస్యాంచిత్, భవనవలభౌ, సుప్తపారావతాయాం, నీత్వా, రాత్రిం, చిరవిలసనాత్, ఖిన్నవిద్యుత్ కలత్రః, దృష్టే, సూర్యే, పునరపి, భవాన్, ఆహ్వాయేత్, అధ్వశేషం, మందాయన్తే, న, ఖలు, సుహృదాం, అభి + ఉపేత, అర్థకృత్యాః.

**అన్వయం :** చిరవిలసనాత్, ఖిన్న విద్యుత్ కలత్రః, భవాన్, సుప్త పారావతాయాం, కస్యాంచిత్ భవనవలభౌ, తాం, రాత్రిం, నీత్వా, సూర్యే, దృష్టే పునరపి, అధ్వశేషం, వాహయేత్, సుహృదాం, అభ్యుపేతార్థకృత్యాః, న, మందాయన్తేఖలు.

**ప్రతిపదార్థం :** చిరవిలసనాత్ = చాలాకాలము పరిశ్రమించుటచే; ఖిన్నవిద్యుత్ కళత్రః = అలసిన మెఱుపు భార్యగా కలిగిన; భవాన్ = నీవు; సుప్తపారావతాయాం = రామచిలకల పంజరములు కల; కస్యాంచిత్, భవనవలభౌ = ఒకానొక సౌధాగ్ర భాగమునందు; తాం, రాత్రిం, నీత్వ = ఆ రాత్రి గడపి; సూర్యే దృష్టే = సూర్యోదయమైనపిదప; పునరపి, అధ్వశేషం, వాహయేత్ = తిరిగిమిగిలిన మార్గమును గైకొనుము; సుహృదాం, అభ్యుపేతార్థ కృత్యాః = మిత్ర కార్యము స్వీకరించినవారు; న, మందాయంతే ఖలు = ఆలశ్యము చేయరుకదా.

**తాత్పర్యం :** భార్యతో చాలకాలము పరిశ్రమించుటచే అలసిన నీవు రామ చిలకల పంజరాలతో ఒప్పుచున్న ఒకానొక సౌధాగ్రమున ఆ రాత్రి గడిపి సూర్యోదయమైన వెంటనే మార్గమున గైకొని బయలు దేరుము. మిత్ర కార్యాచరణ తత్పరులు ఆలశ్యము సహింపరు కదా!

**'శ్రీకళా' వ్యాఖ్య :** 'విద్యుత్' అంటే మెఱపు (తీగ) మేఘునికి మెఱపు తీగ భార్యగా వర్ణిస్తారు కవులు. కొన్ని విషయాలు నిజమైనా కాక పోయినా 'భావనారమణీయత'ను సంతరించుకొన్నవాటిని 'కవిసమయం' అనడం పరిపాటి. ఉదాహరణకి గంగానదిలో పద్మాన్ని వర్ణిస్తారు కవులు. పద్మాలు సరస్సుల్లో ఉంటాయి కాని నదుల్లో అసలు ఉండవు. అక్కడా మనోహర దృశ్యం యొక్క రమణీయతే సహృదయునిచే భావ్యమానం కావాలి కాని సత్యాన్వేషణ కాదు.

మెఱుపు తీగ – విద్యుత్ – లేక సౌదామిని అభిసారికలకు మార్గదర్శనం చేసే అలసట

తమోభిః, రుద్ధ + ఆలోకే, నరపతి పథే, కనక నికషస్నిగ్ధయా, సౌదామన్యా, ఉర్వీం, దర్శయ, తోయోత్సర్గస్తనితముఖరః, మా స్మభూః, తాః, విక్లవాః.

**ప్రతిపదార్థం** : తత్ర, నక్తం = ఆ ఉజ్జయినిలో రాత్రివేళల; రమణవసతిం, గచ్ఛంతీనాం = ప్రియుల ఆవాసమునకు వెళ్ళునట్టి; యోషితాం = స్త్రీలకు (అభిసారికలకు); సూచిభేద్యైః, తమోభిః = చిమ్మచీకటులవలన; రుద్ధ + ఆలోకే (సతి) = దృష్టిఅడ్డగించగా; నరపతిపథే = రాజమార్గమున; కనక నికష స్నిగ్ధయా = ఒఱిపిడి రాయిపై గీసిన బంగారపు గీటు వంటి; సౌదామన్యా = మెఱపు (తీగె)ల చేత; ఉర్వీం, దర్శయ = భూమిని (మార్గమును) చూపుము; తోయ + ఉత్సర్గ, స్తనిత ముఖరః = జలపాతముచే కాని, ఉరుములనే గాని; మాస్మభూః = కాకుండుము (ఉరమవద్దు, వర్షించకు) తాః, విక్లవాః = ఆ స్త్రీలు పిరికివారు.

**తాత్పర్యం** : ఆ ఉజ్జయినిలో రాత్రులయందు ప్రియుల సంకేత స్థలములకు వెళ్ళు అభిసారికా స్త్రీలకు చిమ్మ చీకట్లలో దృష్టి అడ్డగిస్తే రాజమార్గంలో ఒఱిపిడి రాతిపై బంగారు గీటువంటి నీమెఱుపులతో వారికి మార్గాన్ని చూపు. వర్షం కురిపించడం కాని, ఉఱుములు ఉరమటం కాని చేయకు సుమా! ఎందుకంటే వారు పిరికి వారు కావడం వల్ల భయపడతారు.

**'శ్రీకళా' వ్యాఖ్య** : ఉజ్జయినిలో మేఘుడు చేయవలసిన పనుల్ని క్రమశః చెబుతున్నాడు యక్షుడు. ఆ పట్టణానికి ఏ వేళలో వెళ్ళినా సాయంత్రం దాకాఉండి మహాకాలుని సేవించుకోమన్నాడు. సంధ్యాకాల అర్చనా వైశిష్ట్యాన్ని చెప్పేడు. సూర్యాస్తమానసమయంలో సూర్యకాంతుల్తో కలిసినమేఘంఎలా ఉంటుందో క్రిందటి శ్లోకంలో చెప్పి ఆతరువాత రాత్రి వస్తే జరగవలసింది ఈశ్లోకంలో చెబుతున్నాడు.

రాత్రివేళల్లో అభిసారికలు తమ ప్రియుల ఆవాసానికి లేదా సంకేతస్థలానికి బయలుదేరుతారు. వారికి మెఱ పులతో మార్గాన్ని చూపమన్నాడు. వర్షించిలేదా ఉరిమి వారికి భయం కలిగించవద్దు. వారసలే భీరువులని హెచ్చరిస్తున్నాడు. స్త్రీ పట్ల పురుషుడు చూపవలసిన సున్నితత్వాని కీ శ్లోకం మరో ప్రబల నిదర్శనం

కేవలం మెఱ పు మెఱిసినప్పుడెలా ఉంటుదంటే బంగారం పరిశుద్ధతని పరీక్షించే ఒఱిపిడి రాయితో సామ్యం చెప్పేడు. ఒఱిపిడి రాయిమీద బంగారు ఆభరణంతో గీసినప్పుడు నల్లని రాయి మీద బంగారు గీతలు పడతాయి. నల్లని మేఘంపై మెఱ పు మెఱిస్తే అలాగే ఉంటుంది. అలం : సంసృష్టి.

సూర్యునికి అడ్డురాకుండా తొలగి పొమ్మని చెబుతున్నాడు.)

'శ్రీకళా' వ్యాఖ్య : సూర్యోదయ కాలం ఎటువంటిదో చెబుతున్నాడు. 'ఖండిత' నాయికా స్త్రీలను ప్రియులు ఓదార్చే సమయమది. ''జ్ఞాతేఽన్యాసఙ్గ వికృతే ఖణ్డితేర్ష్యా కషాయితా'' అని దశరూపకం ఖండిత నాయికకు ఇచ్చిన నిర్వచనం. శృంగార నాయికలను అష్టవిధనాయికలుగా వింగడించేరు ఆలంకారికులు.

''స్వాధీన పతికా చైవ తథావాసక సజ్జికా ।

విరహోత్కంఠితా చైవ విప్ర లబ్ధా చఖణ్డితా ॥

ఇవి నిజానికి 8 రకాలైన నాయికలు కాక స్త్రీ జీవితంలోని అష్టవిధ అవస్థలుగా చెప్పడం సమంజసం. గతరాత్రి అన్య స్త్రీతో గడిపి వికృతినొందిన కాంతుని చూచి ఈర్ష్యచే దుఃఖ పడే స్త్రీని 'ఖండిత' అంటారు. అట్టిస్థితిలో ఉన్న స్త్రీతో ప్రియుడు అనునయ వాక్యాలు పలికి ఆమె కన్నీటిని తుడవడం పరిపాటి. సూర్యుడు కూడా అందుకే వచ్చే డంటున్నాడు. పద్మం సూర్యుని భార్య. సూర్యోదయంతో పద్మం వికసించడం సూర్యస్తమానంతో ముకుళించుకుపోవడం మనకు అనుభవంలో ఉన్న విషయమే. రాత్రి ఆ పద్మం మీద పడ్డమంచు బిందువుల్ని కన్నీటి బిందువులుగా కవి ఉత్ప్రేక్ష. ఆ మంచు బిందువులు సూర్య కిరణాలతో తొలగిపోతాయి. 'కర' శబ్దానికి కిరణమనీ, చేయి అనీ రెండర్థాలూ ఉన్నాయి. వాటికి అడ్డం రాకుండా తొలగి పొమ్మని ఉద్బోధిస్తున్నాడు యక్షుడు. ఎందుకంటే ఆ ప్రేయసీ ప్రియులకు అడ్డం తగలడం శ్రేయస్కరం కాదని 'హితం' ఉపదేశిస్తున్నాడు. అలం: సమాసోక్తి.

**గమ్భీరాయాః పయసి సరితశ్చేతసీవ ప్రసన్నే**
**ఛాయాత్మాపి ప్రకృతి సుభగోలప్స్యతే తే ప్రవేశమ్ ।**
**తస్మాదస్యాః కుముద విశదాన్య ర్హసిత్వం నధైర్యా -**
**న్మోఘీ కర్తుంచటుల శఫరోద్వర్తన ప్రేక్షితాని ॥ 40**

**పదచ్ఛేదం** : గంభీరాయాః, పయసి, సరితః, చేతసి + ఇవ; ప్రసన్నే, ఛాయాత్మా + అపి, ప్రకృతి సుభగః, లప్స్యతే, తే, ప్రవేశం; తస్మాత్, అస్యాః, కుముద విశదాని, అర్హసి, త్వం, న, ధైర్యాత్, మోఘీకర్తుం, చటుల, శఫర + ఉద్వర్తన ప్రేక్షితాని.

**అన్వయం** : గంభీరాయాః, సరితః, చేతసీ + ఇవ; ప్రసన్నే, పయసి, ప్రకృతి సుభగః, తే, ఛాయాత్మా + అపి, ప్రవేశం, లప్స్యతే, తస్మాత్, అస్యాః, కుముదవిశదాని, చటుల, శఫర

నొందింది. ఆ అలసట చెందిన భార్యతో ఆరాత్రి ఉజ్జయినిలో గడిపి సూర్యోదయం కావడంతోనే బడలికలు తీరి సాగిపొమ్మంటున్నాడు యక్షుడు. సౌధో పరిభాగంలో వసారాలో దించిన భాగాల్ని 'వలభు' లంటారు. ఆవలభుల్లో పావురాలు, లేక రామ చిలకలు నిద్రిస్తాయట. ఆనాటి ఉజ్జయినీ నగర వాసుల జీవన విధానం, కాళిదాసు నాటి భవన నిర్మాణం ఇందులో సూచితమైంది. అలం : సంకరం.

**తస్మిన్కాలే నయన సలిలం యోషితాం ఖణ్డితానాం**
**శాన్తిం నేయం ప్రణయిభిరతో వర్త్మభానోస్త్య జాశు ।**
**ప్రాలేయా స్రం కమల వదనాత్సోఽపి హర్తుం నలిన్యాః**
**ప్రత్యావృత్తస్త్వయి కరరుధి స్యాదనల్పాభ్య సూయః ॥** 39

**పదవిభాగం** : తస్మిన్, కాలే, నయనసలిలం, యోషితాం, ఖండితానాం, శాంతిం, నేయం, ప్రణయిభిః, అతః, వర్త్మ, భానోః, త్యజ, ఆశు, ప్రాలేయాస్రం, కమలవదనాత్, సః, అపి, హర్తుం, నలిన్యాః, ప్రత్యావృత్తః, త్వయి, కరరుధి, స్యాత్, అనల్ప, అభ్యసూయః.

**అన్వయం** : తస్మిన్ కాలే, ప్రణయిభిః, ఖండితానాం, యోషితాం, నయన సలిలం, శాంతిం, నేయం, అతః, భానోః, వర్త్మ, ఆశు, త్యజ, సః, అపి, నలిన్యాః, కమలవదనాత్, ప్రాలేయాస్రం, హర్తుం, ప్రత్యావృత్తః, త్వయి, కరరుధి, అనల్ప, అభ్యసూయః, స్యాత్.

**ప్రతిపదార్థం**: తస్మిన్ కాలే = ఆ సమయమున; ప్రణయిభిః = ప్రియులచేత; ఖండితానాం, యోషితాం, నయనసలిలం = ఖండిత స్త్రీలకన్నీరు; శాంతం, నేయం = తుడువ తగినది; అతః, భానోః, వర్త్మ, ఆశు, త్యజ = అందువలన సూర్యుని మార్గమును వెంటనే విడవుము; సః, అపి = అతడును (ఆసూర్యుడు కూడ); నలిన్యాః, కమల వదనాత్ = పద్మిని యొక్క కమలముఖమునుండి; ప్రాలేయాస్రం, హర్తుం = మంచు అనెడి కన్నీటిని తొలగించుటకు; ప్రత్యావృత్తః = వచ్చిన వాడైనాడు; త్వయి కరరుధి = నీవు కిరణముల నడ్డగిస్తే; అనల్ప, అభ్యసూయః, = మిక్కిలి ద్వేషించువాడు; స్యాత్ = అగును.

**తాత్పర్యం** : ఆసమయం (అంటే ఉదయం, సూర్యోదయానంతరం) ప్రియులచేత ఖండిత స్త్రీల కన్నీరు తుడువ దగిన కాలం. అందువల్ల సూర్యుని మార్గాన్ని వెంటనే విడచి పొమ్ము. ఆ సూర్యుడు కూడా పద్మిని యొక్క కమలమనెడి ముఖమునుండి మంచు అనే కన్నీటిని తొలగించుటకు వచ్చిన వాడౌతాడు. కనుక ఆయన చేతుల్ని (కిరణాల్ని) నీవు అడ్డగిస్తే అతడు నిన్ను ద్వేషిస్తాడు. (అదినీకు మంచిది కాదు కనుక

**తస్యాః కించిత్కర ధృత మివ ప్రాప్త వానీర శాఖం**
**హృత్వానీలం సలిలవసనం ముక్తరోధో నితమ్బమ్ ।**
**ప్రస్థానంతే కథమపి సఖే లమ్బమానస్య భావి**
**జ్ఞాత్వా స్వాదో వివృత జఘనాం కోవిహాతుం సమర్థః ॥ 41**

**పదచ్ఛేదం :** తస్యాః, కించిత్, కరధృతం + ఇవ, ప్రాప్తవానీరశాఖం, హృత్వా, నీలం, సలిలవసనం, ముక్త, రోధః, నితంబం, ప్రస్థానం, తే, కథమపి, సఖే, లంబమానస్య, భావి, జ్ఞాతః, ఆస్వాదః, వివృత జఘనాం, కః, విహాతుం, సమర్థః.

**అన్వయం :**(హే) సఖే !, ప్రాప్త వానీర శాఖం, కించిత్, కరధృతం, ఇవ, ముక్త రోధః , నితంబం, నీలం, తస్యాః, సలిల వసనం, మాహృత్వా, లంబమానస్య, తే, ప్రస్థానం. కథమపి, భావి, జ్ఞాతాస్వాదః, కః, వివృత జఘనాం, విహాతుం, సమర్థః?

**ప్రతిపదార్థం :** (హే) సఖే ! = ఓ మిత్రమా !; ప్రాప్త వానీర శాఖం = 'వేతస' వృక్షశాఖల నొంది; కించిత్, కరధృతం, ఇవ = కొంచెం చేతితో పట్టుకొనినట్లున్న; ముక్త, రోధః నితంబం = విడిచిన ఒడ్డు అనెడి పిఱుదులు కలిగిన; నీలం, తస్యాః, సలిల వసనం, హృత్వా = నల్లనైన 'నీరు' అనెడి ఆ గంగానది యొక్క వస్త్రమును అపహరించి; లంబమానస్య, తే, ప్రస్థానం = ఊగిసలాడుతున్న నీ ప్రయాణము; కథమపి, భావి = సంశయగ్రస్తము కాగలదు ( కష్టమగును); జ్ఞాతాస్వాదః కః = రసికుడైన ఎవడు; వివృత జఘనాం, విహాతుం = దృశ్యమానమైన మొల ప్రదేశమును విడచుటకు; సమర్థః? = సమర్థుడగును? (ఎవడును సమర్థుడు కాడని భావము)

**తాత్పర్యం :** ఓ మిత్రమా ! వేతస చెట్టుకొమ్మలతో కొద్దిగా పట్టుకొనినట్లున్న విడిచిన ఒడ్డు అనెడి పిఱుదులు కల్గిన ఆ గంభీరా నది యొక్క నల్లని నీరనే చీరను అపహరించి ఊగిసలాడుతున్న నీ ప్రయాణం కాస్త కష్టమే అవుతుంది. కంటికి కనిపిస్తూ ఉంటే రసికుడైన వాడెవడు చూస్తూ చూస్తూ విడిచి పెట్టిపోగలడు? (ఎవడును విడువడని భావం)

**'శ్రీకళా' వ్యాఖ్య :** గంభీరానదిని స్త్రీపరంగా ధ్వనింపజేసి వర్ణిస్తున్నాడు. వేసవిలో నదిలోని నీరు జారి ఆనదీ తటంలో ఉన్నవేత సవృక్షాలదగ్గర ఉన్నప్పుడు కాముకురాలైన స్త్రీ చీరముడి జార్చినప్పటి సన్నివేశాన్ని స్ఫురింపజేస్తుంది. స్త్రీ మొల, పిఱుదులు కటి కనిపిస్తూ ఉంటే ( స్త్రీ స్వయంగా కనిపింపజేసినప్పుడు) రసికుడైనవాడెవడు చూస్తూ చూస్తూ విడిచి పెట్టగలడు? అలం : సంకరం.

+ ఉద్వర్తన ప్రేక్షితాని, త్వం, ధైర్యాత్, మోఘీకర్తుం, న, అర్హసి.

**ప్రతిపదార్థం** : గంభీరాయాః సరితః = 'గంభీరా' నదియొక్క; చేతసీ, ఇవ, ప్రసన్నే, పయసి = మనస్సువలె స్వచ్ఛమైన నీటియందు; ప్రకృతి సుభగః, తే, ఛాయాత్మా అపి = సహజ సుందరమైన నీ నీడ (యొక్క); ప్రవేశం, లప్స్యతే = ప్రవేశమును పొందగలదు; తస్మాత్, అస్మాత్ = అందుచేత ఆ నదియొక్క; కుముద విశదాని = తెల్ల కలువల వలె స్పష్టమైన; చటుల శఫర + ఉద్వర్తన, ప్రేక్షితాని = చంచలమైన చేపల కదలికలనెడి; ప్రేక్షితాని = చూపులను; త్వం, ధైర్యాత్ = నీవు దిట్టతనముతో (ధూర్తతతో); మోఘీకర్తుం, నార్హసి = విఫలమొనర్పతగదు.

**తాత్పర్యం** : మనస్సువలె స్వచ్ఛమైన గంభీరానది జలములో సహజసుందరమైన నీ నీడ ప్రతి ఫలిస్తుంది. తెల్లకలువల్లా స్పష్టమై చేప కదలికలనెడి ఆ నది యొక్క చంచల దృక్కులను విఫల మొనర్పకుము.

**'శ్రీ కళా' వ్యాఖ్య**: 'గంభీర' అనేది ఒకనదిపేరు. నాయికాధ్వని కూడా ఉంది. శబ్దసామ్యం చేత ఉదాత్తనాయిక. నదే ఒక నాయిక. ఆమె మనస్సువలెనే ఆనదిలోని నీరు కూడా స్వచ్ఛమైంది. అంటే దోషరహితమైంది. బురదలేని స్వచ్ఛమైన నీరు కావడం వల్ల మేఘం ప్రతిబింబం నీటిలో ప్రతిఫలిస్తుంది. అంటే నదీకన్యమనస్సులో మేఘుడైన నాయకుడు ప్రవేశించినట్లు. నాయిక నాయకుని పట్ల అనురక్త కనుక ఆమె చంచలమైన చూపులతో నాయకుని చూస్తుంది. అనురాగం, సిగ్గు, భయం స్త్రీ సహజాలు కనుక చూపులు నిశ్చలంగా ఉండక చంచలంగా ఉంటాయి. ఆ చూపులను నదీలో ఉండే చేపల కదలికల ద్వారా వ్యక్తం చేస్తుంది. సాధారణంగా కళ్లని చేపలతో పోలుస్తారు కవులు. 'మీననేత్రి' అనడం ప్రసిద్ధం. చేపకీ, కంటికీ రూపసాదృశ్యం, చూపుకీ, చేప కదలికకీ క్రియా సాదృశ్యం. అలాతనలోని అనురాగాన్ని వ్యక్తంచేస్తున్న ఆ నాయికా దృక్కుల్ని ధూర్తతతో విఫల మొనర్చ వద్దని మేఘుని కోరుతున్నాడు యక్షుడు. నాయికా నాయకవృత్తాంతం ధ్వని, నదీ వృత్తాంతం వాచ్యం. ఈనాయికా నాయక వృత్తాంతాన్ని భావించ గలిగినప్పుడే కావ్యాన్ని ఆస్వాదించి నట్లౌతుంది.

''ధ్వనిరాత్మాకావ్యస్య'' అని ఆలంకారిక నిర్దేశం. కావ్యాత్మ ధ్వనిలో ఉంటుంది.

అలం: సమాసోక్తి, రూపకం, ఉపమ.

ఉండాలి. ఆ సువాసనను ఏనుగులు ధ్వనిచేస్తూ ఆఘ్రాణిస్తాయి. అడవిలోని మేడిపళ్లు పండటంతో అనేక విధమైన సుగంధం బయల్పడుతుంది. వాటిపై వీచే గాలికి కూడా ఈ సువాసన అబ్బి గాలి సురభితమైపోతుంది. అదిగో అటువంటి వాయువు నిన్ను వెన్నంటి నీకు ఆనందాన్ని కలుగజేస్తుందటున్నాడు. అలం : స్వభావోక్తి.

**తత్రస్కన్దం నియతవసతిం పుష్పమేఘీకృతాత్మా**
**పుష్పాసారైః స్నపయతు భవాన్వ్యోమగఙ్గా జలార్ద్రైః।**
**రక్షాహేతోర్నవశశి భృతా వాసవీనాం చమూనా -**
**మత్యాదిత్యం హుతవహముఖే సంభృతం తద్ధితేజః॥ 43**

**పదచ్ఛేదం** : తత్ర, స్కందం, నియతవసతిం, పుష్పమేఘీకృతాత్మా, పుష్పా సారైః, స్నపయతు, భవాన్, వ్యోమగంగాజలార్ద్రైః, రక్షాహేతోః, నవశశిభృతా, వాసవీ నాం, చమూనాం, అత్యాదిత్యం, హుతవహముఖే, సంభృతం, తత్, హి, తేజః.

**అన్వయం**: తత్ర, నియతవసతిం, స్కందం, పుష్ప మేఘీకృతాత్మా, వ్యోమగంగాజలార్ద్రైః పుష్పాసారైః, భవాన్, స్నపయతు, తత్, వాసవీనాం, చమూనాం, రక్షాహేతోః, నవ శ శిభృతా, హుత వహముఖే, సంభృతం అత్యాదిత్యం, తేజః, హి.

**ప్రతిపదార్థం** : తత్ర, నియతవసతిం, స్కందం = ఆదేవగిరి యందు నివసించుచున్న కుమారస్వామిని; పుష్పమేఘీకృతాత్మా = పుష్పమేఘ రూపమును ధరించి; వ్యోమగంగాజలార్ద్రైః = ఆకాశ గంగాజలముచే తడిసిన; పుష్పసారైః, భవాన్, స్నపయతు = పుష్పవృష్టిచే నీవు అభిషేకము చేయుము; తత్ = అది (ఆకుమారస్వామి విగ్రహము); వాసవీనాం చమునాం రక్షాహేతోః = ఇంద్ర సేనల రక్షించుట కొఱకు; నవశశిభృతాహుతవహముఖే = ఈశ్వరునిచే అగ్ని హోత్రము ద్వారా; సంభృతం = సంపాదింపబడిన; అత్యాదిత్యం, తేజః, హి = సూర్యునతిక్రమిచినతేజస్సుకదా!

**తాత్పర్యం**: ఆదేవగిరియందు నివాసమేర్పఱచుకొనిన కుమారస్వామిని పుష్పమేఘరూపం ధరించి ఆకాశగంగాజలంతో తడసిన పుష్పవృష్టితో నీవు స్వయంగా అభిషేకించుము. ఆకుమార స్వామి దేవేంద్ర సైన్యమును రక్షించుటకు ఈశ్వరునిచే అగ్నిహోత్రము ద్వారా సూర్యునతిక్రమించిన తేజస్సు కదా!

'**శ్రీకళా' వ్యాఖ్య**: **ఐతిహ్యం**: కుమారస్వామి తారకాసుర సంహారానికై ఉద్భవించినవాడు, శివుని తేజస్సును అగ్నిహోత్రునకు, అటనుండి గంగాదేవికి ఆమెనుండి రెల్లు (గడ్డి) కి

**త్వన్నిష్యన్దో చ్ఛ్వసిత వసుధాగన్ధ సంపర్క రమ్యః**
**స్రోతోరన్ధ్ర ధ్వనిత సుభగం దన్తిభిః పీయమానః।**
**నీ చైర్వాస్యత్యు పజిగమిషోర్దేవ పూర్వం గిరిం తే**
**శీతో వాయుః పరిణమయితా కాననోదుమ్బరాణామ్ ॥** 42

**పదచ్ఛేదం** : త్వత్, నిష్యంద + ఉచ్ఛ్వసిత, వసుధాగంధ సంపర్క, రమ్యః, స్రోతోరంధ్ర, ధ్వనిత సుభగం, దంతిభిః, పీయమానః నీచైః, వాస్యతి, ఉపజిగమిషోః, దేవ పూర్వం, గిరిం, తే, శీతః వాయుః పరిణమయితా, కానన + ఉదుంబరాణాం.

**అన్వయం** : త్వత్, నిష్యంద + ఉచ్ఛ్వసిత, వసుధాగంధ సంపర్కరమ్యః, స్రోతోరంధ్ర ధ్వనితసుభగం, దంతిభిః, పీయమానః, కానన + ఉదుంబరాణాం, పరిణమయితా, శీతః, వాతః, దేవపూర్వగిరిం, ఉపజిగమిషోః, తే, నీచైః, వాస్యతి.

**ప్రతిపదార్థం** : త్వత్, నిష్యంద + ఉచ్ఛ్వసితవసుధా = నీవర్షధారచే ఊఱట నొందిన భూమి; గంధ సంపర్క రమ్యః = సూవాసనతో కూడుటవల్ల అందముగ నున్నటువంటియు; స్రోతోరంధ్రధ్వనిత సుభగం = ముకుపుటముల శబ్దముతో వినుటకింపై; దంతిభిః పీయమానః = ఏనుగుల చేత త్రాగబడినదియు; కానన + ఉదుంబరాణాం = అడవిలోని మేడిపళ్ళను; పరిణమయితా = పండించు, శీతః వాతః = చల్లగాలి; దేవపూర్వం గిరిం = దేవగిరిని; ఉపజిగమిషోః, తే = సమీపంపగోరునీకు; నీచైః, వాస్యతి = మెల్లగా వీయును.

**తాత్పర్యం** : నీవర్షపాతంచేత ఊరట నొందిన భూమి నుండి ఉద్భూతమైన సుగంధముతో రమణీయమై ముకుపుటముల శబ్దములతో వినుట కింపై, ఏనుగులు త్రావగా పండిన మేడిపళ్ళపై నుండి వచ్చు చల్లని పిల్లవాయువులు దేవగిరిని సమీపింప గోరు నిన్నును సరించును.

**'శ్రీకళా' వ్యాఖ్య** : గంభీరా నదిని దాటిన మేఘుని పయనం దేవగిరి అనే పర్వతానికి అభిముఖంగా సాగుతుంది. అక్కడికి వెళ్ళ గోరే మేఘునికి చల్లగాలి మెల్లగా వీస్తూ ఉపచారం సలుపుతుంది. ఆ గాలి ఎలాంటిదో ఈ శ్లోకంలో వర్ణితమైంది. వేసం కాలంలో భూమి అంతా వేడెక్కి పోతుంది. ఆ ఆవిరి వర్షం పడటంతో ఒక్కసారిగా పైకి వస్తుంది. అది భూదేవి ఉచ్ఛ్వాసంగా కవి భావిస్తున్నాడు. అప్పుడు భూమిలోంచి ఒక మంచి సువాసన వెలువడుతుంది. ఆ సుగంధంతో కూడిన భూమి పరమ రమణీయంగా ఉంటుంది. అటువంటి సన్నివేశం చూచి రమణీయతను భావించగల శక్తి భావుకునిలో

శిరశ్చంద్రికాకాంతులతో మిక్కిలి తెల్లని కంటి కొనలు కల ఆకుమారస్వామి నెమలిని దేవగిరిగహ్వరాల్లో ప్రతిధ్వనించే నీ ఉఱుములచేత నర్తింపజేయుము.

**'శ్రీకళ' వ్యాఖ్య** : పార్వతీదేవి కర్ణాభరణంగా కలువ రేకును తాల్చినా, పుత్రప్రేమ వల్ల కుమారస్వామి వాహనమైన నెమలి పింఛాన్ని కూడా దాంతో పాటు ధరిస్తుంది. శివుని శిరశ్చంద్రికలు నెమలిపై ప్రతిఫలించి అసలే తెల్లని క్రీగంటి చూపు మరింత ధవళితమైంది. అంటే శివుడూ పుత్ర ప్రేమతో కుమారస్వామి సమీపంలోనే ఉంటాడని చెప్పినట్లైంది. మేఘగర్జనకు నెమలి మైమఱచి నృత్యం చేయడం సహజం. యక్షుడు మేఘునితో ఏమంటున్నాడంటే ''నీగర్జన దేవగిరిలో ప్రతిధ్వనించడంవల్ల ఇంకా ఎక్కువ శబ్దం వస్తుంది. ఆ శబ్దాన్ని విని నెమలి అత్యద్భుతంగా నృత్యం చేస్తుంది. దానికి నువ్వు కారకుడివి కనుక పార్వతీపరమేశ్వర కుమార స్వాముల కృపా కటాక్షానికి నువ్వు పాత్రుడవౌతావు'' అని. ఇదీ ఈ శ్లోకంలో సొగసు. అలం: ఉదాత్తం.

**ఆరాధ్యైనం శరవణ భవం దేవముల్లంఘితాధ్వా**
**సిద్ధద్వన్ద్వైర్జలకణ భయాద్వీణి భిర్ముక్త మార్గః।**
**వ్యాలమ్బేథాః సురభిత నయాలమ్భజాం మానయిష్య -**
**స్రోతోమూర్త్యా భువి పరిణతాం రన్తిదేవస్య కీర్తిమ్ ॥** 45

**పదచ్ఛేదం** : ఆరాధ్య, ఏనం, శరవణభవం, దేవం, ఉల్లంఘిత + అధ్వా, సిద్ధద్వం ద్వైః, జలకణ భయాత్, వీణిభిః, ముక్తమార్గః, వ్యాలంభేథాః, సురభితనయా, ఆలంభజాం, మానయిష్యన్, స్రోతోమూర్త్యా, భువి, పరిణతా, రంతి దేవస్య, కీర్తిమ్.

**అన్వయం**: శరవణ భవం, ఏనం, దేవం, ఆరాధ్య, వీణిభిః, సిద్ధద్వంద్వైః, జలకణభయాత్, ముక్తమార్గః, ఉల్లంఘిత + అధ్వా, సురభిత నయాలమ్భజాం, భువి, స్రోతో మూర్త్యా, పరిణతాం, రంతిదేవస్య, కీర్తిం, మానయిష్యన్, వ్యాలంబేథాః.

**ప్రతిపదార్థం** : శరవణభవం, ఏనం, దేవం, ఆరాధ్య = రెల్లుగడ్డియందుద్భవించిన, ఈ కుమారస్వామిని అర్చించి; వీణిభిః, సిద్ధద్వంద్వైః = వీణావాదనము చేయుచున్న సిద్ధమిథునముల చేత; జలకణ భయాత్, ముక్తమార్గః = వర్షబిందువుల భయముచే విడువడిన మార్గము కలవాడవై; ఉల్లంఘిత అధ్వా =మార్గమున అతిక్రమించిన వాడవై; సురభితనయ, ఆలమ్భజాం = గోమేధము వలన పుట్టిన; భువి, స్రోతోమూర్త్యా = భూలోకమున ప్రవాహరూపముగా; పరిణతాం, రంతిదేవస్యకీర్తిం = పరిణమించిన

సంక్రమించి అందుండి కుమార స్వామి జననం సంభవించింది. దేవతా సేనలకు ఈయన సేనాపతి. ఇది బ్రహ్మాండ పురాణములోని గాథ. ఆ కుమారస్వామి దేవగిరిలో తన నివాసం ఏర్పఱచుకొన్నట్లు అక్కడ ఉన్నవారు చెబుతారు.

మేఘుడు కామరూపుడు, అంటే కోరుకొన్న రూపాన్ని ధరించే శక్తి సామర్థ్యాలు కలవాడు. కనుక పుష్పమేఘమై ఆ పుష్పాల్ని ఆకాశగంగాజలంతో తడిపి ఆ పూలవానని అక్కడున్న కుమార స్వామిపై వర్షించి అతని కరుణకు పాత్రుడవు కమ్మని మేఘుని ఉద్బోధిస్తున్నాడు యక్షుడు.

**జ్యోతిర్లేఖావలయి గలితం యస్య బర్హం భవానీ**
**పుత్రప్రేమ్ణా కువలయదల ప్రాపి కర్ణే కరోతి ।**
**ధౌతా పాఙ్గం హర శశిరుచా పావకేస్తం మయూరం**
**పశ్చాదద్రి గ్రహణ గురుభిర్గర్జితై ర్నర్త యేథా ః॥** 44

**పదచ్ఛేధం :** జ్యోతిర్లేఖావలయి గలితం, యస్య, బ్హర్హం, భవానీ పుత్ర ప్రేమ్ణా, కువలయ దల ప్రాపి, కర్ణే, కరోతి. ధౌత + అపాంగం, హర, శశిరుచా, పావకేః, తం, మయూరం, పశ్చాత్, అద్రిగ్రహణ, గురుభిః, గర్జితైః, నర్తయేథాః.

**అన్వయం :** జ్యోతిర్లేఖావలయి గలితం; యస్య, బ్హర్హం, భవానీ పుత్ర ప్రేమ్ణా, కువలయ దల ప్రాపి, కర్ణే, కరోతి, హర, శశి, రుచా, ధౌతాపాఙ్గం, పావకేః, తం, మయూరం, పశ్చాత్, అద్రిగ్రహణ గురుభిః, గర్జితైః, నర్తయేథాః.

**ప్రతిపదార్థం :** జ్యోతిః లేఖా, వలయి, గలితం = తేజస్సుతోకూడిన లేఖల వృత్తముతో జారిన; యస్య బ్హర్హం = ఏనెమలి పింఛమునైతే; భవానీ, పుత్రప్రేమ్ణా = పార్వతి పుత్ర వాత్సల్యంతో; కువలయదల ప్రాపి, కర్ణే, కరోతి = నల్ల కలువరేకుతో తన చెవియందుంచుకొనుచున్నదో; హర శశిరుచా = శివుని శిరః చంద్రికాకాంతులచే; ధౌతాపాఙ్గం = మిక్కిలి తెల్లనైన కంటి కొనలు కల; పావకే, తం, మయూరం = కుమారస్వామియొక్క ఆ నెమలిని; పశ్చాత్, అద్రి గ్రహణ గురుభిః = పిమ్మట (దేవగిరి) కొండలలో ప్రతిధ్వనించుటచే గొప్పవైన; గర్జితైః, నర్తయేథాః = ఉఱుములచే నర్తింపజేయుము.

**తాత్పర్యం :** తేజస్సుతో కూడిన లేఖల వృత్తంతో జారిన ఏ నెమలి పింఛము నైతే పార్వతి పుత్ర వాత్సల్యంతో కర్ణాభరణంగా కలువరేకుతో ధరిస్తోందో, శివుని

సమయానికి అదృశ్యమయ్యేవి. వాటికా అద్భుతరూపం ఎలా వచ్చిందని రంతిదేవుని గోవులు వాటిని అడిగినప్పుడు తమను యజ్ఞంలో భగవదర్పణం చేయడం వల్ల ప్రాప్తించిందని అవి సమాధానం చెప్పేయి. ఈ గోవులు రంతి దేవుని సమీపించి మనుష్య భాషణతో యజ్ఞమందు తమను వ్రేల్చుమని అర్థించ దైవనిర్ణయ మెఱిగి రంతిదేవుడు గోమేధ యాగం చేసేడు. ఆ యజ్ఞపశువులన్నీ గోలోకం చేరేయి. గోవులరుధిర మొక ప్రవాహమైంది. గోవుల చర్మాన్నుంచి స్రవించింది కనుక ఆనదికి 'చర్మణ్వతీ' అనే పేరు వచ్చింది. అలం: అపహ్నుతి.

**త్వయ్యాదాతుం జలమవనతే శార్ఙ్గిణో వర్ణచౌరే**
**తస్యాః సిన్ధోః పృథుమపి తనుం దూరభావా త్ప్రవాహమ్ ।**
**ప్రేక్షిష్యన్తే గగనగతయో నూనమావర్జ్య దృష్టీ-**
**రేకం ముక్తాగుణ మివ భువః స్థూలమధ్యే న్ద్ర నీలమ్ ॥** **46**

**పదచ్ఛేదం** : త్వయి, ఆదాతుం, జలం, అవనతే, శార్ఙ్గిణః, వర్ణచౌరే, తస్యాః, సింధోః, పృథుం, అపి, తనుం, దూరభావాత్, ప్రవాహం, ప్రేక్షిష్యన్తే, గగనగతయః, నూనం, ఆవర్జ్య, దృష్టీః, ఏకం, ముక్తాగణం, ఇవ, భువః, స్థూలమధ్యే, ఇంద్రనీలమ్.

**అన్వయం** : శార్ఙ్గిణః, వర్ణ చౌరే, త్వయి, జలం, ఆదాతుం, అవనతే, పృథుం, అపి, దూరభావాత్, తనుం, తస్యాః, సింధోః, ప్రవాహం, గగనగతయః, నూనం, దృష్టీః, ఆవర్జ్య, స్థూలం, మధ్యః, ఇంద్రనీలం, ఏకం, భువః ముక్తాగణం, ఇవ, ప్రేక్షిష్యన్తే.

**ప్రతిపదార్థం** : శార్ఙ్గిణః, వర్ణచౌరే, త్వం = విష్ణుమూర్తి రంగునపహరించిన (నల్లని) నీవు; జలం, ఆదాతుం, అవనతే = నీటిని గ్రహించుటకు వంగగా; పృథుం, అపి, దూరభావాత్ తనుం = పెద్దదైనను దూరముగ నుండుటచే చిన్నదిగానున్న; తస్యాః, సింధోః, ప్రవాహం = ఆనదీ ప్రవాహమును; గగనగతయః, నూనం, దృష్టీః, ఆవర్జ్య = వ్యోమగాములు తమ దృష్టిని క్రిందికి మరల్చి; స్థూల మధ్య + ఇంద్రనీలం = పెద్ద ఇంద్రనీల మణిని మధ్యనమర్చిన; ఏకం, భువః, ముక్తాగుణం ఇవ= భూమి ఒంటి పేట ముత్యాల హారమువలె; ప్రేక్షిష్యన్తే = చూడగలరు.

**తాత్పర్యం** : ఆకాశ సంచారం చేసేవారికి ఆ నది పెద్దదే అయినా దూరం నుంచి చూడడంవల్ల భూదేవి మెళ్ళో ధరించిన ఒంటి పేట ముత్యాల హారంలా చిన్నదిగా కనిపిస్తే ఆ నీటిని గ్రహించడానికి విష్ణుమూర్తి కాంతి నపహరించిన నీవు వంగినవడవుకాగా ఆ ముత్యాల హారం మధ్యలో అలంకరించిన ఇంద్రనీలమణిలా కనిపిస్తావు.

రంతి దేవుని కీర్తిని; మానయిష్యన్, వ్యాలంబేథాః = గౌరవించుచున్నవాడవై (తల) వంచుము.

**తాత్పర్యం :** రెల్లుగడ్డిలోపుట్టిన ఈ కుమారస్వామి నర్చించి, వీణావాదనం చేస్తున్న సిద్ధమిథునముల చేత వర్ష బిందువుల భయముతో విడువబడిన మార్గం కలవాడవై గోమేధము వలన పుట్టిన భూలోకమునందు నదీ రూపంగా పరిణమించిన రంతిదేవుని కీర్తిని గౌరవించు వాడవై (తల) వంచుము.

**'శ్రీకళా' వ్యాఖ్య :**

***ఐతిహ్యం :*** శరవణభవుడు కుమారస్వామి. శరవణము ఒక అరణ్యము. బహు సుందరము. అతి మనోహరము. పార్వతీ పరమేశ్వరుల రహస్య క్రీడా వనం. ఒకసారి జగజ్జననీ జనకులు రతి క్రీడలో నుండగా కొందరు మునులక్కడికి వచ్చారు. విగతవస్త్ర పార్వతిలజ్జతో తొలగిపోయి క్రీడాభంగం అవటం వలన కోపగించి ఆ అరణ్యానికి దశయోజనాల మేరలో వచ్చిన వారంతా స్త్రీలగుదరని శపించింది. ఇది మత్స్య పురాణ కథ.

మన్మథక్రీడా నిమగ్నులైన గౌరీశంకరుల కలాపం తెలిసి ఇంద్రుడు తనకు మించిన ప్రతిభావంతుడు జన్మించునని భయమంది వారి రతి క్రీడను భంగ పరుపు మని అగ్ని దేవుని నియమించేడు. సంభోగసమయంలో సమీపంలో ఉన్న అగ్నిని చూసి శివుడు పార్వతిని విడచి దూరంగా పోగా ఈశుని వీర్యం భూమిపై పడింది. తమ ఏకాంతాన్ని భంగపరచిన అగ్నిని ''సర్వము తెలిసి ఇట్టి దోషమొనర్చిన నీవు క్షమార్హుడవు కాదు. మాహేశ్వరుని వీర్యమూరక పోరాదు నీవే ధరింపు'' మని శాసించింది. పార్వతి వచనము నుల్లంఘనీయము కాన తానే ధరించి, ఆ భారము సహింప లేక గంగాదేవిని స్వీకరింపుమని అర్థించేడు. అప్పటికి సమ్మతించినా గంగతానూ గర్భం మోయ దుర్భరమై దానిని రెల్లుగడ్డియందు దిగవిడిచింది. సూర్యరశ్మికా అండం పెరిగి బాలుడై కృత్తికలు పెంపకాన దేవదానవులు తెల్లబోవ స్కంధుడై కుమారుడై వెలసేడు. అట్టి కుమారస్వామిని అర్చించుమని మేఘుని కోరాడు యక్షుడు.

సంకృతి కుమారుడు రంతిదేవుడు దశపురాన్నేలినరాజు. భారత భాగవతాల్లో ఈయన కథ మనకు దర్శనమిస్తుంది. రంతిదేవునికి అపారమైన గోసంపద ఉంది. రోజూ అవి పచ్చిక బయళ్లలో మేస్తున్నప్పుడు స్వర్ణశృంగాలతో, పసిడి గిట్టలతో నున్న మరి కొన్ని దివ్యమైన గోవులు స్వర్లోకం నుంచి వచ్చి వాటితో కలిసి కాలంగడిపి సాయం సంధ్యా

కలిసిన నల్లని కాంతి కలిగి కదులుచున్న మొల్లపూల ననుసరించు తుమ్మెదల శోభను ద్రోసి రాజనే రంతిదేవుని నగర స్త్రీల కుతూహలముతో కూడిన చూపులకు పాత్రమై నీ ప్రయాణమును సాగించుము.

**'శ్రీకళా' వ్యాఖ్య :** యక్షుడు మేఘునితో చెబుతున్నాడు: రంతి దేవుని కీర్తికి ప్రతీకగా నిలచిఉన్నది 'చర్మణ్వతీ' నది. ఆనదిని దాటితే రంతి దేవుని నగరం దశపురం చేరుకుంటావు. అచటి స్త్రీలు కుతూహలంతో నిన్ను చూస్తారు. పురుషుని స్త్రీకుతుహలంగా చూడడంవల్ల సంతోషం కలుగుతుంది. అనేకమంది స్త్రీలు చూడడం జీవితానికి చారితార్థ్యం సిద్ధించినట్లు భావించుకొంటాడు. అంటే తాను అనేక మంది స్త్రీలకు ప్రశంసార్హుడైనట్లు. అయితే ఈ స్త్రీలు ప్రయాణంలో తటస్థపడే వారు మాత్రమే. ఆ తరువాత ప్రయాణం ఉత్సాహంగా కొనసాగడానికి ఈ స్త్రీల చూపులు ఉత్తేజాన్నిచ్చేవన్న మాట.

అవి సాధారణమైన చూపులా ? కావు. వారి కనుబొమలు లతలవంటివి, అవి ఇదివరకు తానెటిగినవే. అయినా వాటి అందం స్పృహణీయమైంది కనుక మళ్ళీ చూడాలనిపిస్తుంది. ఈ లతలవంటి కనుబొమలు పెకెత్తుటవల్ల (మేఘుని చూడడానికి) కంటి పైటెప్ప మీది నున్న వెంట్రుకలు – వీటినే 'కనీనక' లంటాం. చిన్న తెలుపుతో గూడిన నలుపును కలిగి ఉంటాయి. కంటి టెప్పపైన కనుబొమ్మ. ఆపైన శరీరకాంతి. ఆ తెల్లని శరీర కాంతిని ఈ నల్లని కనీనకలు చేరడంవల్ల కొంచెం తెలుపుతో కూడిన నలుపు. ఆ శోభ ఎలాంటిది? తెల్లని మొల్లపూలు ఉన్నాయి. ఇవి గాలికి కదులుతున్నాయి. నల్లని తుమ్మెదలు ఈ కదిలే మొల్లపూలలోని మకరందాన్ని ఆస్వాదించడానికి బయలుదేరాయి. మొల్లపూవుకదులు తుంటే ఈ తుమ్మెదలూ తమకంతో వాటి గమనానుసారంగా కదులుతున్నాయి. అది సహృదయ భావ్యమైన సుమనోహర భావన. ఇక్కడ సొగసు పూలదీ కాదు, తుమ్మెదలదీ కాదు. అపూవు పైవ్రాలాలనే తుమ్మెదమనసులోని తొందరదే సౌందర్యమంతా. దాన్ని భావుకుడు భావించ గలిగితేనే – తద్భావనా భావితాంతః కరుణుడైన భావుకునికే కాళిదాసు కవితా సౌందర్యం కొంతవఱకైనా అవగతమై ఆస్వాదయోగ్యమయ్యేది.

గుండెలో ఇంత తవ్వుకుంటేనే రసానుభూతి. ఇది లేని కేవల చదువు చదువు కాదు. అలం : ఉపమ.

**'శ్రీకళా' వ్యాఖ్య :** నది తెల్లగా ఉంది. కనుక ముత్యాల హారంతో పోలిక. ఈ నది పెద్దదే అయినా ఆకాశంలో సంచరించేవారికి దూరం నుంచి చూడడం వల్ల చిన్నదిగా కనిపిస్తోంది. అందుచేత ఒంటి పేట ముత్యాల హారం అన్నాడు. ఎవరికి? భూదేవికి. మేఘుడు నల్లగా ఉన్నాడు. కనుక విష్ణుమూర్తి దేహచ్ఛాయ నపహరించిన వాడని సామాన్యంగా లోకంలో న్యూనతగా భావించే నలుపురంగుని చక్కని ఉపమానంతో సమర్థించేడు. ఈ మేఘుడు నదీ జలాన్ని స్వీకరించడానికి వంగేడు. కనుక ఆ ముత్యాల హారానికి మధ్యలో అమర్చిన ఇంద్రనీలమణిగా వర్ణించేడు. ఇందులో ఆకాశంలో విహరించేవారు వంగి చూసిన దృశ్యం మనోహరంగా వర్ణితమైంది.

**తాముత్తీర్య వ్రజ పరిచిత భ్రూలతా విభ్రమాణాం**
**పక్ష్మోత్క్షేపాదుపరివిలసత్కృష్ణ శార ప్రభాణామ్ ।**
**కున్దక్షేపానుగ మధుకర శ్రీ ముషామాత్మ బిమ్బం**
**పాత్రీకుర్వన్దశపుర వధూనేత్ర కౌతూహలానామ్ ॥** 47

**పదచ్ఛేదం :** తాం, ఉత్తీర్య, వ్రజ, పరిచిత, భ్రూలతా విభ్రమాణాం పక్ష్మ + ఉత్క్షేపాత్, ఉపరి, విలసత్, కృష్ణ శార ప్రభాణామ్, కుంద, క్షేప, అనుగ, మధుకర శ్రీముషాం, దశపుర వధూనేత్ర కౌతుహలానాం.

**అన్వయం :** తాం, ఉత్తీర్య, పరిచిత, భ్రూలతా విభ్రమాణాం పక్ష్మ + ఉత్క్షేపాత్, ఉపరి, విలసత్, కృష్ణ శార ప్రభాణామ్, కుంద, క్షేప, అనుగమధుకర శ్రీముషాం, దశపుర వధూనేత్ర కౌతుహలానాం, ఆత్మబింబం, పాత్రీకుర్వన్, వ్రజ.

**ప్రతిపదార్థం :** తాం, ఉత్తీర్య = దానిని (ఆచర్మణ్వతీనదిని) దాటి; పరిచిత భ్రూలతా విభ్రమాణాం = ఎటిగిన లతల వంటి కనుబొమల విలాసము కలిగినటు వంటియు; పక్ష్మ + ఉత్క్షేపాత్ = కనురెప్పలను ఎత్తుట వలన; ఉపరి, విలసత్, కృష్ణ శారప్రభాణాం = పై భాగమునమెఱయుచున్న కొంచెం తెలుపుతో కూడిన నల్లని; కుంద, క్షేప, అనుగ, మధుకరశ్రీముషాం = కదలుచున్న మొల్లపూలననుసరించు తుమ్మెదల శోభను అపహరించు; దశపుర వధూనేత్ర కౌతుహలానాం = రతిదేవునినగర స్త్రీల కు తూహలముతో కూడిన దృక్కులకు; ఆత్మబింబం, పాత్రీకుర్వన్ = నీ ఆకారమును భాజనముగా చేయుచు; వ్రజ = వెళ్ళుము.

**తాత్పర్యం:** ఆచర్మణ్వతీ నదిని దాటి నీకు పరిచితమైన లతలవంటి కనుబొమల విలాసము కలిగి, కంటి ఱెప్పలను పైకెత్తుటవలన పైభాగమున శోభిస్తున్న కొంచెం తెలుపుతో

గురుపీఠాలు, క్షేత్రాలు, ఆశ్రమ పదాలు ప్రవేశించేటప్పుడు ప్రదక్షిణం చేసిలోపలికి ప్రవేశించడం సంప్రదాయం. అందుకే దేవాలయాల్లో దైవ దర్శనం, చేసేముందు గుడికి ప్రదక్షిణం చేసి మరీ వెడతాం.

'ప్రధన' శబ్దానికి యుద్ధమని అర్థం.

''యుద్ధమాయోధనం జన్యం ప్రధనం ప్రవిదారణమ్'' అని అమరం.

ఆ బ్రహ్మావర్తదేశంలోకి ప్రవేశించిన తర్వాత చేరవలసిన క్షేత్రం కురుక్షేత్రమట ! ఆ కురుక్షేత్రం ఎటువంటి దంటే నీవలె ధారాపాతంగా వర్షం కురిసి ( నువ్వు) కమలముల శోభను పోగొట్టినట్లే ఆనాడు అర్జునుడు రాజులముఖాలనే కమలాల్ని బాణధారాపాతంతో నాశనమొనర్చెడని అర్జునునితో మేఘునకు మంచి ఉపమానం చెప్పడం ద్వారా సంతుష్టాంతరంగుణ్ణి చేసేడు. అలం : స్మృతి.

**హిత్వా హాలా మభిమతరసాం రేవతీలో చనాఙ్కాం**
**బన్ధుప్రీత్యా సమరవిముఖో లాఙ్గలీయాః సిషేవే ।**
**కృత్వా తాసామభిగమ మపాం సౌమ్య సారస్వతీనా -**
**మన్తః శుద్ధస్త్వమసి భవితా వర్ణమాత్రేణ కృష్ణః ॥** 49

**పదచ్ఛేదం** : హిత్వా, హాలాం, అభిమతరసాం, రేవతీలోచన + అఙ్కాం, బంధుప్రీత్యా, సమరవిముఖః, లాంగలీ, యాః, సిషేవే, కృత్వా, తాసాం, అభినయం, అపాం, సౌమ్య, సారస్వతీనాం, అంతః, శుద్ధత్వం, అపి, భవితా, వర్ణమాత్రేణ, కృష్ణః.

**అన్వయం** : బంధు ప్రీత్యా, సమరవిముఖః, లాంగలీ, అభిమతరసాం, రేవతీలోచనాంకాం, హాలాం, హిత్వా, యాః, సారస్వతీనాం, అపాం, సిషేవే, (హే) సౌమ్య, త్వం, అపి, తాసాం, అధిగమం, కృత్వా, అంతః, శుద్ధః, వర్ణమాత్రేణ, కృష్ణః, భవితా.

**ప్రతిపదార్థం** : బంధుప్రీత్యా, సమరవిముఖః, లాంగలీ = బంధుప్రేమచే యుద్ధవిముఖుడైన బలరాముడు అభిమతరసాం, రేవతీలోచనాంకాం = రేవతి నేత్రములు ప్రతి ఫలించిన ప్రియపానీయమైన; హాలాం హిత్వా, యాః, సారస్వతీనాం = సురనువిడచి ఏ సర్వస్వతీనదీ; అపాం సిషేవే = జలమును సేవించెనో; హే సౌమ్య = ఓ స్వాదు స్వభావుడవైన మేఘుడా!; త్వం, అపి, తాసాం, అభిగమం, కృత్వా = నీవును ఆ సరస్వతీ గమనము చేసి; అంతః శుద్ధః = శుద్ధాంతరంగుడవై; వర్ణమాత్రేణ, కృష్ణః, భవితాం = రంగుచేతనే నల్లని వాడవు కమ్ము.

**బ్రహ్మావర్తం జనపదమథచ్ఛాయయా గాహమానః**
**క్షేత్రం క్షత్ర ప్రధన పిశునం కౌరవం తద్భజేథాః।**
**రాజన్యానాం సితశర శతైర్యత్ర గాణ్డీవ ధన్వా**
**ధారా పాతై స్త్వమివ కమలాన్యభ్య వర్షన్ముఖాని ॥** 48

**పదచ్ఛేదం**: బ్రహ్మవర్తం, జనపదం, అథ, ఛాయయా, గాహమానః, క్షేత్రం, క్షత్రప్రధన పిశునం, కౌరవం, తత్, భజేథాః, రాజన్యానాం, సిత శరశతైః, యత్ర, గాండీవధన్వా, ధారాపాతైః, త్వం, ఇవ, కమలాని, అభ్య వర్షత్, ముఖాని.

**అన్వయం** : అథ, బ్రహ్మవర్తం, ఛాయయా, గాహమానః, క్షత్రప్రధన పిశునం, యత్ర గాండీవధన్వా, శిత శర శతైః, రాజన్యానాం, ముఖాని, కమలాని, ధారాపాతైః, త్వమివ, అభ్య వర్షత్, తత్ కౌరవం, క్షేత్రం, భజేథాః.

**ప్రతిపదార్థం** : అథ, బ్రహ్మావర్తం, ఛాయయాగాహమానః = పిమ్మట, బ్రహ్మావర్తాన్ని నీడతో ప్రవేశించి; క్షత్ర ప్రధనపిశునం = క్షత్రకులోచిత యుద్ధసూచకమైనట్టిదియు; యత్ర గాండీవధన్వా = ఎక్కడైతే అర్జునుడు; శిత శర శతైః, ధారాపాతైః = వాడియైన వందలాది బాణములతో; రాజన్యానాం ముఖాని, కమలాని = రాజుల ముఖ కమలములను; త్వం, ఇవ, అభ్యవర్షత్ = నీవలెవర్షించెనో; తత్, కౌరవం, క్షేత్రం, భజేథాః = ఆ కురుక్షేత్రమును సేవింపుము.

**తాత్పర్యం**: అటుపిమ్మట (దశపురాన్ని వీడినతర్వాత) బ్రహ్మావర్తాన్ని నీడతో ప్రవేశిస్తూ ఎక్కడైతే అర్జునుడు వాడియైన తన వందలాది బాణాల జడివానతో రాజముఖకమలాలను నీవలె వర్షించేడో ఆ కురుక్షేత్రాన్ని సేవించు. (పొందు)

**'శ్రీకళా' వ్యాఖ్య** : రంతిదేవుని పట్టణం దశపురం దాటేక 'బ్రహ్మావర్తం' తగులుతుంది. సరస్వతీ, దృషద్వతులనే దేవనదుల మధ్యభాగంలో ఉన్నదేశం. అదిదేవతలు నిర్మించిన దేశమనీ, దాన్ని బ్రహ్మావర్తమంటారనీ మనుధర్మ శాస్త్రం చెబుతోంది.

*"సరస్వతీ దృషద్వత్యోర్దేవ నద్యోర్యదన్తరం ।*
*తందేవ నిర్మితం దేశం బ్రహ్మావర్తం ప్రచక్షతే ॥"*

దీన్ని నీ నీడతో ప్రవేశించమంటున్నాడు. అంటే ప్రదక్షిణంగా ప్రవేశించుగాని సూటిగా వెళ్ళవద్దని అర్థం.

*"పీఠక్షేత్రా శ్రమాదీని పరివృత్యాన్యతో వ్రజేత్"*

జహ్నోః, కన్యాం, గచ్ఛేః, యా, గౌరీవక్త్ర భ్రుకుటిరచనాం, యా, విహస్య+ఇవ, ఫేనైః, ఇందులగ్న+ఊర్మిహస్తా, శంభోః, కేశగ్రహణం, అకరోత్.

**ప్రతిపదార్థం:** తస్మాత్, అనుకనఖలం= అచటి నుండి 'కనఖల' అనే పర్వత సమీపంలో; శైలారాజ, అవతీర్ణాం= హిమవత్పర్వతము నుండి దిగినదై; సగరతనయస్వర్గ సోపానపంక్తిం= సగర చక్రవర్తి కుమారులకు స్వర్గము చేరుటకు మెట్ల వరుసయై; జహ్నోఃకన్యాం, గచ్ఛేః= 'జహ్ను' మహర్షిపుత్రికయగు 'జాహ్నవి' (గంగ) ని సేవించుము; యా= ఏదైతే (గంగానదైతే); గౌరీవక్త్రభ్రుకుటిరచనాం= పార్వతి ముఖమునందలి కనుబొమల ముడిని; ఫేనైః, విహస్య, ఇవ= నురుగుతో ఎగతాళి చేయుచున్నట్లు; ఇందు, లగ్న, ఊర్మి, హస్తా= చంద్రుని యందుంచిన తరంగములనెడి చేతులతో; శంభోః; కేశగ్రహణం, అకరోత్= శివునికేశపాశ గ్రహణము చేసెనో.

**తాత్పర్యం:** అచటి (సరస్వతీనది) నుండి 'కనఖల' పర్వతసమీపంలో హిమవత్పర్వతము నుండి దిగి సగర చక్రవర్తి పుత్రులకు స్వర్గారోహణకు మెట్ల వరుసయైన గంగానదిని సేవింపుము. ఆ గంగానది పార్వతీదేవి ముఖంలో ఉన్న కనుబొమల ముడిని తన నురుగుతో ఎగతాళి చేస్తున్నట్లు చంద్రుని యందుంచిన తరంగాలనే చేతుల్తో శివుని కేశపాశగ్రహణం చేసింది. (చేసిందో ఆగంగానదిని గూర్చి వెళ్ళుము)

**'శ్రీకళా' వ్యాఖ్య:** పరమరణీయమైన భావన. స్థూలంగా చెప్పిందేమిటి? ''సరస్వతీ నది నుండి గంగానదికి వెళ్ళుము'' అని. ఆగంగానది ఎటువంటిదో మహాకవి చేసిన భావనారామణీయకత ఎంతో స్పృహణీయమైంది. రెండు పనులు చేసింది గంగ.

ఒకటి సగర చక్రవర్తికుమారులు స్వర్గం చేరడానికి ఈమె మెట్ల వరుసగా భాసించింది. ఇది పుణ్యకార్యమైతే రెండవది శృంగారపరమైంది.

అదేమిటంటే గంగానది ఆకాశంలో ఉన్నది. అక్కడి నుంచి శివుని శిరస్సు మీదకి వచ్చింది. తన భర్తకి నెత్తిమీద దేవతైన ఈమెవరని పార్వతిదేవి కనుబొమలు ముడిచి గంగను చూసిందట! సవతియైన పార్వతి ఈ చూపును తన నురుగు లనే చేతుల్తో ఎగతాళి చేస్తోందంట గంగానది. ఎగతాళి చేసినప్పుడు చేతుల్ని కదిలిస్తూ నవ్వడంలోక సహజం. గంగానదిలోని తరంగాలు ఆమె హస్తాలు. అవి కదుల్తూ ఉంటాయి. కనుక చేతులు త్రిప్పినట్లైంది. అంతేకాకుండా హసనం (నవ్వు) నుండి పుట్టిన శబ్దం హాస్యం. నవరసాల్లో ఇది ప్రధానరసమైన శృంగారం తర్వాత ద్వితీయ స్థానం ఆక్రమిస్తుంది.

**తాత్పర్యం :** ఓ స్వాదు స్వభావుడవైన మేఘుడా! బంధు ప్రేమ చేయుద్ధ విముఖుడైన బలరాముడు రేవతీ నేత్రములు ప్రతి ఫలించున్న ప్రియ పానీయము సురను విడచి ఏ సరస్వతీ నదీ జలములను సేవించెనో, నీవును ఆ సరస్వతీ నదిని సేవించి శుద్ధాంతరంగుడవై రంగుచేతనే నల్లని వాడవు కమ్ము.

**'శ్రీకళా' వ్యాఖ్య :** నలుపు పాపానికీ, తెలుపు పరిశుద్ధతకూ సంకేతం. మేఘం రంగులో నల్లగా ఉంటుంది. ''రంగుతో మాత్రమే నల్లని వాడవి కమ్ము'' అంటే నీ అంతరంగం పరిశుద్ధ పఱచుకొమ్మని అర్థం. సరస్వతీ నదీ తీర్థాలు గ్రోలడంవల్ల అంతరంగం– అంటే మనస్సు పావనమౌతుంది.

**ఐతిహ్యం :** పూర్వం బలరాముడు మధుపాన ప్రియుడు. తన ప్రియభార్య రేవతితో కలసి మధువును సేవించేవాడు. పాత్రలో మధువును పోసికొని ఆ పాత్రలో రేవతి నేత్రాలు ప్రతిబింబిస్తూ ఉంటే ఆ మధువును సేవించేవాడు. అంటే ఒకరికొకరు అంతటి సమీపంగా ఉండి అంత ప్రేమతో ఒకే పాత్రలోని 'సుర' ని సేవించేవారన్నమాట. రేవతీ లోచనాంకాం అభిమతరసాం'' అనే వాక్యాన్ని అంతలోతుగా భావించగలిగినప్పుడే ఆ సాహిత్యంలోని స్వారస్యం అనుభూతమౌతుంది. అంత ప్రీతి పాత్రమైన మధువుని సైతంవీడి బంధుప్రీతి చేత కురుక్షేత్రయుద్ధంలో ఎవరి పక్షమూ వహించక సరస్వతీ నదీ తీరానికి వెళ్ళి తపస్సు చేసికొన్నాడు.

సరస్వతీనది దేవనదిగా 48వ శ్లోకంలో చెప్పనే చెప్పేడు. అంతటి మహిమాన్వితమైన ఆ నది పాపహారిణి.

**తస్మాద్గచ్ఛేరను కనఖలంశైలరాజావ తీర్ణాం**
**జహ్నోః కన్యాం సగరతనయ స్వర్గ సోపానపఙ్క్తిమ్ ।**
**గౌరీవక్త్ర భ్రుకుటిరచనాం యావిహస్యేవ ఫేనైః**
**శంభోః కేశ గ్రహణ మకరో దిన్దులగ్నోర్మిహస్తా ॥ 50**

**పదచ్ఛేదం :** తస్మాత్, గచ్ఛేః, అనుకనఖలం, శైలరాజ, అవతీర్ణాం, జహ్నోః, కన్యాం, సగరతనయస్వర్గ సోపానపంక్తిం, గౌరీవక్త్ర భ్రుకుటిరచనాం, యా, విహస్య+ఇవ, ఫేనైః, శంభోః, కేశగ్రహణం, అకరోత్, ఇందులగ్న + ఊర్మిహస్తా.

**అన్వయం:** తస్మాత్, అనుకనఖలం, శైలరాజావతీర్ణాం, సగరతనయస్వర్గసోపానపంక్తిం,

ఉంటుంది.

**'శ్రీకళా' వ్యాఖ్య** : మేఘుడు విలాసంగా తలక్రిందులుగా వ్రేలాడుతూ పడుకొని నీటిని త్రాగినట్లుగా గంగానదీ జలాన్ని గ్రోలాలనుకుంటే ఎలా ఉంటుందో కవి ఈ శ్లోకంలో వర్ణించేడు. ఆమేఘుని ఆకారం అప్పుడు దిగ్గజంలా ఉంటుందనీ, అతని నీడ గంగానదిలో ప్రతిఫలించి యమునా నది వలె ఉంటుందనీ – దిగ్గజంతోనూ, యమునానదితోను మేఘుని పోల్చి అతనికి ఆనందం కలుగజేస్తున్నాడు యక్షుడు. లోకంలో మనకి ఒకరి వల్ల పనికావాలంటే వారిని పొగుడుతాం ''మీరంతటివారు, ఇంతటి వారు'' అని. అలాగే భిన్న భిన్న సందర్భాల్లో మేఘుని రూపాన్ని విష్ణుమూర్తితోను, అతని వర్షాన్ని అర్జున విశిఖ వృష్టితోనూ, ఇత్యాదిగా చెప్పి ఇక్కడ దిగ్గజంతోనూ, యమునతోనూ పోల్చి చెప్పేడు.

*''కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే......''*

అంటే ఇది. అలా ఉన్న ఆగంగానదీ దృశ్యం ఎలా ఉంటుందట? ''ప్రదేశం కాని ప్రదేశంలో యమునా సంగమం కలిగిందేమిటబ్బా!'' అని చూపరులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుందట! త్రివేణీ సంగమం గంగాయమునలు కలిసే స్థలం. యమునానది నల్లగా ఉంటుంది. మేఘుడు నల్లగా ఉంటాడు. ఇది త్రివేణి కాదు కదా! ఇక్కడ యమునా సంగమం గంగకు కలిగిందనే భ్రాంతి కలుగజేస్తుందా దృశ్యం. అలం: ఉత్ప్రేక్ష.

**ఆసీనానాం సురభితశిలం నాభిగన్ధైర్మృగాణాం**
**తస్యా ఏవ ప్రభవ మచలం ప్రాప్య గౌరం తుషారైః।**
**వక్ష్యస్యధ్వ శ్రమవినయనే తస్యశృఙ్గే నిషణ్ణః**
**శోభాం శుభ్రత్రినయనవృషోత్ఖాత పఙ్కోపమేయామ్ ॥ 52**

**పదచ్ఛేదం** : ఆసీనానాం, సురభితశిలం, నాభిగంధైః, మృగాణాం, తస్యాఏవ, ప్రభవం, అచలం, ప్రాప్య, గౌరం, తుషారైః, వక్ష్యసి, అధ్వశ్రమ, వినయనే, తస్య, శృంగే, నిషణ్ణః, శోభాం, శుభ్ర త్రినయనవృష + ఉత్ఖాతపంక+ ఉపమేయామ్.

**అన్వయం** : ఆసీనానాం మృగాణాం, నాభిగంధైః, సురభితశిలం, తస్యాఏవ, తుషారైః, గౌరం, అచలం, ప్రాప్య, అధ్వశ్రమవినయనే, తస్య, శృంగే, నిషణ్ణః, శుభ్ర త్రినయనవృష + ఉత్ఖాత, పంక + ఉపమేయాం, శోభాం, వక్ష్యసి.

**ప్రతిపదార్థం** : ఆసీనానాం, మృగాణాం, నాభిగంధైః = కూర్చొన్న కస్తూరి మృగముల బొడ్డు (నందలి కస్తూరి) సువాసనలచే; సురభిత శిలం= పరిమళముల వెదజల్లు ఱాలు కలిగిన; తస్యాఏవ, ప్రభవం, తుషారైః, గౌరం = ఆనదికి జన్మస్థానమై మంచుచే తెల్లనైన;

''శృంగారహాస్య కరుణా రౌద్ర వీరభయానకా

బీభత్సాద్భుత శాంతాశ్చ .......... '' అని రసాలు తొమ్మిది. ఒకొక్కరసానికో అధిదేవత, రంగు ఆలంకారికులు చెప్పేరు. హాస్యానికి తెలుపు వర్ణం. గంగానదిలోని తరంగాలు తెల్లని నురుగు తో కూడి ఉన్నాయి కనుక ఆ నురుగు తోనే నవ్వుతుంది. నవ్వి ఊరుకుందా? లేదే! అసలే తెల్లనైన తన తరంగ హస్తాల్లో శివుని ఫాలభాగంలో ఉన్న చంద్రునితో కలిసి వాటిని మరింత తెలుపుచేసి వాటితో ఈశ్వరుని జుట్టు పట్టుకొని (జటాజూట గ్రహణం) తన ఆధిక్యతనిరూపించుకొందంటాడు, కవికుల గురువు కాళిదాసు. ఎంతటి మనోహరమైన భావన ! అలం: ఉత్ప్రేక్ష.

**తస్యాః పాతుం సురగజ ఇవ వ్యోమ్ని పశ్చార్ధలమ్బీ**
**త్వం చేదచ్ఛస్ఫటిక విశదం తర్కయేస్తిర్యగమ్భః।**
**సంసర్పన్త్యా సపది భవతః స్రోతసి చ్ఛాయయాసౌ**
**స్యాదస్థానోపగతయమునా సఙ్గమేవాభిరామా ॥** 51

**పదచ్ఛేదం :** తస్యాః, పాతుం, సురగజ ఇవ, వ్యోమ్ని, పశ్చార్ధలంబీ, త్వం, చేత్, అచ్ఛస్ఫటిక విశదం, తర్కయేః, తిర్యక్, అంభః, సంసర్పంత్యా, సపది, భవతః, స్రోతసి, ఛాయయా, అసౌ, స్యాత్, అస్థాన, ఉపగత, యమునాసంగం, ఏవ, అభిరామా.

**అన్వయం :** సురగజ ఇవ, వ్యోమ్ని, పశ్చార్ధలంబీ, అచ్ఛస్ఫటిక విశదం, తస్యాః, అంభః, తిర్యక్, పాతుం, తర్కయేః, చేత్, సపది, స్రోతసి, సంసర్పన్త్యా, భవతః, ఛాయయా, అసౌ, అస్థాన, ఉపగత, యమునాసంగం, ఏవ, అభిరామా, స్యాత్.

**ప్రతిపదార్థం:** సురగజ ఇవ, వ్యోమ్ని= ఒకానొక దిగ్గజమువలె ఆకాశములో; పశ్చార్ధలంబీ= పశ్చిమార్ధంలో వ్రేలాడుచు (తలక్రిందులు వ్రేలాడుతూ); అచ్ఛ, స్ఫటిక, విశదం, తస్యాః= స్వచ్ఛమైన స్ఫటికమువలె పరిశుద్ధమైన ఆగంగా నది యొక్క; అంభః, తిర్యక్, పాతుం, తర్కయేః చేత్ = నీటిని అడ్డంగా (నిలబడి) త్రాగాలని ఆలోచిస్తే; సపది, స్రోతసి, సంసర్పంత్యా, భవతః= అప్పుడు నదిలో వ్యాపిస్తున్న నీ యొక్క; ఛాయయా= నీడతో; అసౌ, అస్థాన ఉపగతయమునా సంగమ ఇవ= ఈ గంగానది కాని ప్రదేశంలో పొందిన యమున కూడికవలె; అభిరామా, స్యాత్= మనోహరమైనదగును.

**తాత్పర్యం:** ఒకానొక దిగ్గజంలా ఆకాశంలో తలక్రిందులుగా వ్రేలాడుతూ పడుకొని త్రాగినట్లుగా ఆనదీ జలాన్ని త్రాగాలని నువ్వు అనుకుంటే అప్పుడు గంగానదిలో నీ నీడపడి కాని ప్రదేశంలో యమునా నదితో కలిసినట్లుకనిపించి ఆదృశ్యం మనోహరంగా

'సరల' వృక్షముల ఊాపిడిచే కల్గిన; (దేవదారు వృక్ష మూలములు ఒకదానినొకటి ఒఱిపిడివలన) ఉల్కాక్షపితచమరీవాలభారః= నిప్పురవ్వలచే దహనమైన చమరీమృగముల తోకలు కల; దవాగ్నిః= కార్చిచ్చు; తం= ఆహిమవత్పర్వతమును; బాధేత, చేత్= బాధిస్తుంటే; ఏనంః ఆ దవాగ్నిని; వారిధారాసహస్రైః= అనేక నీటిధారలచే (వర్షపాతం); అలం, శమయితుం= బాగుగా చల్లార్చుటకు; అర్హసి= సమర్థుడవౌదువు. ఉత్తమానాం= సత్పురుషులయొక్క; సంపదః= భాగ్యములు; ఆపన్న+ఆర్తి= కష్టములలో నున్న వారి బాధను ప్రశమన= తొలగించుటయే; ఫలాః, హి= ప్రయోజనముగా కలవికదా!

**తాత్పర్యం :** గాలివీస్తూ ఉంటే దేవదారు వృక్షాల బోదెలు ఒకదానినొకటి ఒరుసుకొనుటచే ఆ ఊాపిడి నుండి పుట్టిన దావాగ్ని అక్కడి చమరీమృగాలతోకలకు అంటుకొని ఆ కార్చిచ్చు హిమవత్పర్వతాన్ని బాధిస్తుంటే నువ్వు అనేకమైన వర్షధారలచే ఆ దావాగ్నిని చల్లార్చు. సత్పురుషుల సంపదలు ఆపదలలో నున్న వారి బాధలను తొలగించుటయే ప్రయోజనముగా కలవి కదా!

**'శ్రీకళా' వ్యాఖ్య :** అలంః అర్థాంతరన్యాసం.

**యేసంరమ్భోత్పతనరభసాః స్వాఙ్గభఙ్గాయతస్మి -**
**న్ముక్తాధ్వానం సపది శరభాలఙ్ఘయేయుర్భవన్తమ్ ।**
**తాన్కుర్వీథాస్తుముల కరకావృష్టి పాతావకీర్ణా -**
**న్కేవానస్యుః పరిభవపదం నిష్ఫలారమ్భయత్నాః ॥** 54

**పదచ్ఛేదం:** యే, సంరభః, ఉత్పతనరభసాః, స్వ+ అంగభంగాయ, తస్మిన్, ముక్తాధ్వానం, సపది శరభాః, ఆలంఘయేయుః, భవంతం, తాన్, కుర్వీథాః, తుముల, కరకా వృష్టి-పాతవకీర్ణాన్ , కే, వా, న, స్యుః, పరిభవపదం, నిష్ఫల +ఆరంభయత్నాః.

**అన్వయం :** సంరంభ+ ఉత్పతనరభసాః, యే, శరభాః, ముక్తాధ్వానం, భవంతం, సపది, స్వ+అంగభంగాయ, లంఘయేయుః, తాన్, తుములకరకాదృష్టిపాతావకీర్ణాన్, కుర్వీథాః, నిషల+ ఆరంభయత్నాః, కేవా, పరిభవపదం, న స్యుః.

**ప్రతిపదార్థం :** సంరంభ, ఉత్పతనరభసాః= కోపముతో మీది కెగురవలయునను తొందరపాటుతో; యే, శరభాః= ఏశరభమృగాలైతే; స్వ+అంగభంగాయ= తమ అవయుములు విరుగ కొట్టుకోవడానికి; ముక్త+అధ్వానం= త్రోవను వదలిన; భవన్తం=

అచలం, ప్రాప్య, అధ్వశ్రమవినయనే= పర్వతమును పొంది మార్గాయాసము పోగొట్టుకొనుటకు; తస్య, శృంగే, నిషణ్ణః= ఆహిమవత్పర్వత శిఖరమున కూర్చుండి; శుభ్ర, త్రినయన, వృష+ ఉత్ఖాత = తెల్లని శివుని వృషభ వాహనము నంది త్రవ్విన; పంక, ఉపమేయాం= బురదతో పోల్చదగిన; శోభాం, వక్ష్యసి= కాంతిని వహించగలవు.

**తాత్పర్యం :** (నువ్వు) కూర్చున్న కస్తూరి మృగముల నాభిపరిమళాల్ని వెదజల్లుతున్న ఊాలతో ఆగంగా నది ఉత్పత్తికి కారణమై మంచుతో తెల్లనైన ఆ హిమవన్నగాన్ని చేరి దాని శిఖరంపై కూర్చుని మార్గాయాసం తీర్చుకొంటూంటే (నువ్వెలా ఉంటావంటే) శివుని వాహనమైన తెల్లని నంది త్రవ్విన బురదతో పోల్చదగి ఉంటావు.

**'శ్రీకళా' వ్యాఖ్య:** హిమవత్పర్వతం మంచుతో తెల్లగా ఉంటుంది. శివుని వృషభవాహనం కూడా తెలుపురంగుదే. కస్తూరి మృగం బొడ్డు నుండి కస్తూరి (సుగంధద్రవ్యం) పుడుతుంది. ఆమృగాలు ఆపర్వతం ఊాల మీద కూర్చోవడం వల్ల ఊాలకీ సుగంధం అంటుతుంది. పరిమళభరితమైన ఆ ఊాల మీద కాస్సేపు కూర్చోవడం వల్ల మేఘుని మార్గాయాసం తీరుతుంది. నల్లని మేఘం తెల్లని ఆ కొండ శిఖరంపై చేరినప్పుడీ దృశ్యం ఎలా ఉంటుందంటే శివుని వాహనమైన నందీశ్వరుడు క్రీడార్థం భూమిని త్రవ్వినప్పుడు దాని కొమ్ములకి అంటిన బురదలా ఉంటుంది! ఈ ఉత్ఖాతకేళి 2వ శ్లోకంలో వర్ణితమైంది. అలం: ఉపమ.

**తం చేద్వాయౌసరతి సరల స్కన్ధ సంఘట్టజన్మా**
**బాధేతోల్కాక్షపిత చమరీ వాలభారో దవాగ్నిః।**
**అర్హస్యేనం శమయితుమలం వారిధారా సహస్రై-**
**రాపన్నార్తి ప్రశమనఫలాః సంపదోహ్యుత్తమానామ్॥ 53**

**పదచ్ఛేదం:** తం, చేత్, వాయౌ, సరతి, సరలస్కంధసంఘట్టజన్మా, బాధేత్, ఉల్కాక్షపిత చమరీవాలభారః, దవాగ్నిః, అర్హసి, ఏనం, శమయితుం, అలం, వారిధారాసహస్రైః, ఆపన్న+ ఆర్తిప్రశమనఫలాః, సంపదః, హి, ఉత్తమానామ్.

**అన్వయం:** వాయౌ, సరతి, సరలస్కన్ధ, సంఘట్ట జన్మా, ఉల్కాక్షపిత చమరీవాలభారః, దవాగ్నిః, తం, బాధేత, చేత్, ఏనం, వారిధారాసహస్రైః, అలం, శమయితుం, అర్హసి, ఉత్తమానాం, సంపదః, ఆపన్న+ ఆర్తి, ప్రశమనఫలాః, హి.

**ప్రతిపదార్థం:** వాయౌసరతి (సతి) = గాలివీచుచుండగా; సరలస్కంధ సంఘట్టజన్మా=

బలిం= పూజకల్గిన; అర్థ+ ఇందుమౌలేః= చంద్రమౌళియొక్క; చరణన్యాసం= పాదముద్రను; భక్తినమ్రః= భక్తితో శిరము వంచి; పరీయాః= ప్రదక్షిణ మొనర్పుము; యస్మిన్= (ఏపాదముద్ర) ఏది; దృష్టే= చూడబడగా; ఉద్ధూత = విదళింపబడిన; పాపాః= పాపములు కలవారై; శ్రద్ధధానాః= విశ్వాసము కలవారై; కరణవిగమాత్, ఊర్ధ్వం= శరీరత్యాగానంతరము; స్థిర= శాశ్వతమైన; గణప్రాప్తయే= ప్రమథగణప్రాప్తి నొందుటకు; కల్పిష్యన్తే= సమర్థులగుదురో.

**తాత్పర్యం:** ఆ హిమాద్రిపై ఒకానొక శిలపై శివుని పాదముద్ర తరతరములుగ యోగులచే అర్చనల నొంధుచున్నది. నీవును దానిని ప్రదక్షిణ మొనర్చి సేవింపుము. తద్దర్శనముచే పాపములను పటాపంచలొనర్చుకొని, శరీరత్యాగానంతరం ప్రమథగణములో స్థానము నొందుటకు సమర్థుడవౌదువు.

**'శ్రీకళా' వ్యాఖ్య : ''మృదంగం దైవతం విప్రం ఘృతం మధుచతుష్పథం।**
**ప్రదక్షిణాని కుర్వీత విజ్ఞాతాంశ్చ వనస్పతీన్॥''**

అని మృదంగము, దేవత, బ్రాహ్మణుడు, నేయి, తేనె, నాలుగుబాటల కలయిక– వీటికి ప్రదక్షించడం భారతీయ సంప్రదాయం.

**శబ్దాయన్తే మధురమనిలైః కీచకాః పూర్యమాణాః**
**సంసక్తాభిస్త్రిపుర విజయోగీయతే, కింనరీభిః।**
**నిర్హ్రాదస్తే మురజ ఇవ చేత్కన్ద రేషు ధ్వనిః స్యా-**
**త్సంగీతార్థో ననుపశుపతే స్తత్రభావీ సమగ్రః॥** 56

**పదచ్ఛేదం :** శబ్దాయంతే, మధురం, అనిలైః, కీచకాః, పూర్యమాణాః, సంసక్తాభిః, త్రిపురవిజయః, గీయతే, కింనరీభిః, నిర్హ్రాదః, తే, మురజ ఇవ, చేత్, కందరేషు, ధ్వనిః, స్యాత్, సంగీతార్థః, నను, పశుపతేః, తత్ర, భావీ, సమగ్రః.

**అన్వయం :** (హే! మేఘ!) అనిలైః, పూర్యమాణాః, కీచకాః, మధురం, శబ్దాయంతే, సంసక్తాభిః, కింనరీభిః, త్రిపుర విజయః, గీయతే, తే, నిర్హ్రాదః, మురజ ఇవ, స్యాత్, చేత్, తత్ర, పశుపతేః, సంగీతార్థః, సమగ్రః, భావీ, నను.

**ప్రతిపదార్థం :** హేమేఘ ! = ఓ మేఘుడా !; అనిలైః= గాలులచేత; పూర్యమాణాః= పూరింపబడిన; కీచకాః= వెదురుగొట్టములు; మధురం= ఇంపుగా ; శబ్దాయంతే= ధ్వనించుచుండును. సంసక్తాభిః= కలిసియున్న; కింనరీభిః= కిన్నెరస్త్రీలచే;

నిన్ను; సపది= ఆసమయంలో; లంఘయేయుః= దాటుతాయో; తాన్= వాని (శరభమృగాల్ని); తుములకరకావృష్టిపాత+ అవకీర్ణాన్= అమితమైన వడగళ్ళ వృష్టిచే బాధించుము; నిష్ఫల= ఫలించని; ఆరంభ= పనులయందు; యత్నాః= ప్రయత్నాలు, చేయువారు, కేవా ఎవరైననూ; పరిభవపదం= అవమానమునకు గురియగువారుగా; నస్యుః= కాకుందురు?

**తాత్పర్యం:** (నిన్ను ఏనుగని భావించి) చంపాలని కోపంతో నీ మీదకి ఎగరాలనే తొందరలో ఏశరభమృగాలైతే తమ అంగాలు విరగకొట్టుకోవడానికి త్రోవను వదలిన నిన్ను దాటిపోతాయో ఆశరభ మృగాలపై అమితమైన వడగళ్ల వాన వర్షించి వాటిని కష్టపెట్టు. ఫలోన్ముఖం కాని పనులు చేపట్టిన వారెవరు అవమానానికి గురికాకుండా ఉంటారు?

**'శ్రీకళ' వ్యాఖ్య:** శరభమృగానికి 8 కాళ్లు ఉంటాయనీ, సింహాన్ని సైతం చంపగల శక్తి కలదనీ ప్రతీతి.

మల్లినాథ సూరి మేఘుని ఆకారసాదృశ్యం చేత శరభమృగం ఏనుగని భ్రమిస్తుందని తన వ్యాఖ్యానంలో పేర్కొన్నాడు. అది సంభవమే అయినా సింహాన్ని సైతం శరభం అవలీలగా చంపగలదు. కనుక మేఘగర్జనను సింహమని శరభం భ్రాంతిపడిందనిచెప్పికోవడంలో విశేషస్వారస్యం కనిపిస్తుంది. ఎందుచేతనంటే ముందు ధ్వని విని రూపాన్ని తర్వాత చూస్తాం కనుక. అలం : అర్థాంతరన్యాసం.

**తత్రవ్యక్తం దృషదిచరణన్యాసమర్ధేన్దుమౌలేః**
**శశ్వత్సిద్ధైరుపచిత బలిం భక్తి నమ్రః పరీయాః।**
**యస్మిన్దృష్టేకరణ విగమాదూర్ధ్వము ద్ధూతపాపాః**
**సంకల్పన్తే స్థిరగణ పదప్రాప్తయే శ్రద్ధధానాః॥** 55

**పదచ్ఛేదం:** తత్ర, వ్యక్తం, దృషది, చరణన్యాసం, అర్ధ+ఇందుమౌలేః, శశ్వత్, సిద్ధైః, ఉపచితబలిం, భక్తినమ్రః, పరీయాః, యస్మిన్, దృష్టే కరణ విగమాత్, ఊర్ధ్వం, ఉద్ధూతపాపాః, సంకల్పంతే, స్థిరగణపదప్రాప్తయే, శ్రద్ధధానాః.

**అన్వయం** : తత్ర, దృషది, వ్యక్తం, శశ్వత్, సిద్ధైః, ఉద్ధూతపాపాః, శ్రద్ధధానాః, కరణవిగమత్, ఊర్ధ్వం, స్థిరగణపదప్రాప్తయే, కల్పిష్యన్తే.

**ప్రతిపదార్థం:** తత్ర= ఆ హిమవత్పర్వతమునందలి; దృషది= ఱాతిమీద; వ్యక్తం= తెలియుచున్న; శశ్వత్=అనేకసార్లు; సిద్ధైః= యోగులచే; ఉపచిత=సమకూర్చబడిన;

**అన్వయం :** ప్రాలేయాద్రేః, ఉపతటం, తాంస్తాన్, విశేషాన్, అతిక్రమ్య, హంసద్వారం, భృగుపతి యశోవర్త్మ, యత్, క్రౌంచరంధ్రం, తేన, బలినియమనాభ్యుద్యతస్య, విష్ణోః, శ్యామః, పాద ఇవ, తిర్యగాయామశోభీ, ఉదీచీం దిశం, అనుసరేః.

**ప్రతిపదార్థం :** ప్రాలేయ+అద్రేః= హిమవత్పర్వతం యొక్క; ఉపతటం= గట్టు వద్ద; తాంస్తాన్, విశేషాన్= ఆ ఆ విశేషములను; అతిక్రమ్య= దాటి; హంసద్వారం= హంసల (మానస సరోవరమునకేగు) దారియు; భృగుపతి= పరశురాముని; యశః, వర్త్మ= కీర్తిమార్గమును ఐన; యత్, క్రౌంచరంధ్రం= ఏక్రౌంచ పర్వత రంధ్రముకలదో; తేన= దానిచే; బలి= బలిచక్రవర్తిని; నియమన= బంధించుటలో; అభి+ఉద్యతస్య=పూనుకొన్న; విష్ణోః= విష్ణుమ్మూర్తి; శ్యామ= నల్లనైన; పాద ఇవ= అడుగువలె; తిర్యక్+ ఆయామశోభి= అడ్డముగను, నిలువగను ప్రకాశిస్తూ; ఉదీచీందిశం= ఉత్తరదిక్కుగా; అనుసరేః= (అనుసరించి) వెళ్ళుము.

**తాత్పర్యం :** హిమవత్పర్వత ప్రాంతంలో దర్శనీయ ఘట్టాలను దాటి హంసలు మానస సరోవరానికి వెళ్ళేదారి, పరశురాముని కీర్తి పతాకయైన ఏ క్రౌంచపర్వత రంధ్రం ఉందో, దానిచేత బలిబంధన కారోద్యుక్తుడైన విష్ణుమూర్తి నల్లని పాదమువలె అడ్డంగానూ, నిలువుగాను శోభిస్తూ ఉత్తరదిక్కుగా పయనమై పోవుము.

**'శ్రీకళా' వ్యాఖ్య :** హిమవత్పర్వత ప్రాంతంలో దర్శించతగిన ఘట్టాలనేకం ఉన్నా అవి చూస్తూ కాలహరణం చేయక దాటి పొమ్మంటున్నాడు. అక్కడ క్రౌంచ పర్వత బిలం (రంధ్రం) ఉంటుంది. అది హంసలు మానస సరోవరానికి వెళ్ళడానికి మార్గంగా ఉంటుంది. పరశురాముని కీర్తి పతాకాయమానమై శోభిల్లుతూ ఉంటుంది. అతర్వాత బలిని బంధించిన విష్ణుమూర్తి నల్లని పాదంలా అడ్డంగానూ నిలువుగానూ పెరిగి శోభిస్తూ ఉత్తర దిక్కుగా వెళ్ళమంటున్నాడు. అలం: సంసృష్టి.

**గత్వాచోర్ధ్వం దశముఖభుజో చ్ఛ్వాసిత ప్రస్థసంధేః**
**కైలాసస్య త్రిదశవనితా దర్పణస్యాతిథిః స్యాః।**
**శృఙ్గోచ్ఛ్రాయైః కుముద విశదైర్యో వితత్య స్థితః ఖం**
**రాశీభూతః ప్రతిదినమివ త్ర్యంబక స్యాట్టహాసః॥** 58

**పదచ్ఛేదం :** గత్వా, చ, ఊర్ధ్వం, దశముఖాభుజ, ఉచ్ఛ్వాసిత, ప్రస్థ, సంధేః, కైలాసస్య, త్రిదశ వనితాదర్పణస్య, అతిథిః, స్యాః, శృఙ్గోచ్ఛ్రాయైః, కుముదవిశదైః, యః, వితత్య, స్థితః, ఖం, రాశీభూతః, ప్రతిదినం, ఇవ, త్ర్యంబకస్య, అట్టహాసః.

త్రిపురవిజయః= శివుని విజయగీతములు; గీయతే= గానము చేయబడుచున్నవి; తే= నీ యొక్క; నిర్హ్రాదః= ఉఱుములధ్వని; మురజ ఇవ= మృదంగమువలె; స్యాత్, చేత్= అయినట్లైన; తత్ర= అచటి; పశుపతేః= ఈశ్వరుని యొక్క; సంగీతార్థః= సంగీతము; సమగ్రః= సంపూర్ణత నొందినది; భావీ, నను= అగును కదా !

**తాత్పర్యం** : ఓ మేఘుడా ! వెదురుగొట్టాల్లో (రంధ్రాల్లో) గాలి చేరి వేణునాదం వలె మధురమైన శబ్దాలు వినిపిస్తాయి. కిన్నర స్త్రీలు కలసి (ఆవేణు నాదానికి అనుగుణంగా) శివుని కీర్తిని గానం చేస్తూ ఉంటారు. నీ ఉఱువుల ధ్వనివానికి కలిస్తే అది మృదంగాయమానమై ఈశ్వరుని సంగీతం సంపూర్ణత నొందుతుంది కదా!

**'శ్రీకళా' వ్యాఖ్య : *''గీతం నృత్తం తథావాద్యం త్రయః సంగీతముచ్యతే''***

గానం, నృత్యం, వాద్యం మూడూ కలిస్తే సంగీతమంటారని 'సంగీత' శబ్ద ప్రాచీన నిర్వచనం. అర్వాచీనకాలంలో సంగీత నృత్యాలు వేర్వేరు శాఖలుగా, ప్రవృద్ధం కావడం వేఱే సంగతి. శివుడు తాండవ నృత్యం చేస్తుంటే ఆయన కీర్తిని కిన్నరస్త్రీలు కలసి (బృందగానంగా) గానంచేస్తున్నారు. ప్రక్క వాద్యంగా వేణునాదం సహజంగా సిద్ధిస్తోంది. ఎలా అంటే అచటి వృక్షాల్లో వెదురుపై పక్షులు, తుమ్మెదలు రంధ్రాలు ఏర్పరిస్తే, అందులో గాలి చేరి మధురమైన శబ్దాలు ఆవెదురులోంచి ఉత్పన్నమౌతాయి. వేణువు లేదా మురళీ లేదా వంశీ వాద్యం వెదురురంధ్రాల్లోంచి ఉత్పన్నమయ్యేదే కదా! అయితే ఇప్పుడు దానికి మృదంగం ఒకటి తక్కువౌతోంది. నీ ఉఱువుల ధ్వని మృదంగాయమానంగా ఉండి శివుని సంగీతం సంపూర్ణత నొందుతుంది. ప్రక్క వాద్యం అమర్చిన నీ (మేఘుని) యందు శివుడు ప్రసన్నుడౌతాడు. శివుని వంటి వాని సంగీతానికి ప్రక్క వాద్యం సమకూర్చిన నీకూ చారితార్థ్యం సిద్ధిస్తుంది. అలం : సంకరం.

**ప్రాలేయాద్రేరుపతటమతిక్రమ్య తాంస్తాన్విశేషా -**
**న్హంసద్వారం భృగుపతి యశోవర్త్మ యత్క్రౌంచరన్ధ్రమ్ ।**
**తేనోదీచీం దిశమను సరేస్తిర్య గాయామశోభి**
**శ్యామః పాదో బలినియమనాభ్యుద్యతస్యేవ విష్ణోః ॥** 57

**పదచ్ఛేదం**: ప్రాలేయ+ అద్రేః, ఉపతటం, అతిక్రమ్య, తాంస్తాన్, విశేషాన్, హంసద్వారం, భృగుపతి యశోః, వర్త్మ, యత్, క్రౌంచరంధ్రం, తేన, ఉదీచీం, దిశం, అనుసరేః, తిర్యక్, ఆయామశోభీ, శ్యామః, పాదః, బలినియమన, అభ్యుద్యతస్య, ఇవ, విష్ణోః.

ఛ్ఛేద, గౌరస్య తస్య, అద్రేః, మేచకే, వాససి, అంస, న్యస్తే, హలభృత, ఇవ, స్తిమితనయన, ప్రేక్షణీయాం, శోభాం, భవిత్రీం, ఉత్ప్రశ్యామి.

**ప్రతిపదార్థం**: స్నిగ్ధ=మెత్తగా; భిన్న= నూరిన; అంజన= కాటుకవలె; ఆభే= ప్రకాశిస్తున్న; త్వయి= నీవు; తటగతే= (కొండ) చరియ యందుండగా; సద్యః= అప్పుడు; కృత్త= నఱికిన; ద్విరద= ఏనుగుయొక్క; రదన= దంతములయొక్క; ఛేద= ముక్కవలె; గౌరస్య= తెల్లనైన; తస్య= ఆ; అద్రేః= పర్వతమునకు; మేచకే= నల్లని; వాససి= వస్త్రము; అంసన్యస్తే= భుజమునందున్న; హలభృత ఇవ= నాగలి ధరించిన వానివలె (బలరామునివలె); స్తిమిత= నిశ్చలమైన; నయన= నేత్రములచే; ప్రేక్షణీయం= చూడతగిన; శోభాం= కాంతిని; భవిత్రీం= పొందినదానినిగ; ఉత్ప్రశ్యామి= చూచుచున్నాను.

**తాత్పర్యం** : మెత్తగా నూరిన కాటుక కాంతులీనే నీవు కొండ చరియ వద్ద నున్నప్పుడు అపుడు నఱికిన ఏనుగు దంతపు ముక్కవలె తెల్లనైన ఆపర్వతానికి ( నీవు) నల్లనివస్త్రమై బలరాముని వలె శోభనొంది దర్శనీయుడవౌదువు.

**'శ్రీకళా' వ్యాఖ్య** : అలం : పూర్ణోపమ.

> **హిత్వాతస్మిన్భు జగవలయం శంభునా దత్తహస్తా**
> **క్రీడాశైలే యది చ విచరేత్పాద చారేణ గౌరీ ।**
> **భఙ్గీభక్త్యా విరచితవపుఃస్తమ్భితాన్తర్జలౌఘః**
> **సోపానత్వం కురుమణి తటారోహణాయాగ్రయాయీ ॥ 60**

**పదచ్ఛేదం** : హిత్వా, తస్మిన్, భుజగవలయం, శంభునా, దత్తహస్తా, క్రీడాశైలే, యది, చ, విచరేత్, పాదచారేణ, గౌరీ, భంగీ, భక్త్యా, విరచితవపుః, స్తంభిత, అంతర్జల, ఓఘః, సోపానత్వం, కురు, మణితట+ ఆరోహణయా, అగ్రయాయీ.

**అన్వయం**: తస్మిన్, క్రీడాశైలే, శంభునా, భుజగవలయం, హిత్వా, దత్తహస్తా, గౌరీ, పాదచారేణ, విహరేత్+యది, అగ్రయాయీ, స్తంభిత, అంతర్జల+ ఓఘః, భంగీభక్త్యా, విరచితవపుః, మణితట+ ఆరోహణాయ, సోపానత్వం, భజ.

**ప్రతిపదార్థం**: తస్మిన్, క్రీడాశైలే= ఆ కైలాసమున; శంభునా= శివునిచేత; భుజగవలయం= కంకణమైన పామును; హిత్వా= విడచి; దత్తహస్తా= చేయూతనొంది; గౌరీ= పార్వతి;

**అన్వయం:** ఊర్ధ్వం, చ, గత్వా, దశముఖ, భుజ, ఉచ్ఛ్వాసిత, ప్రస్థ, సంధేః, త్రిదశవనితా దర్పణస్య, కైలాసస్య; యః, కుముదవిశదైః, శృంగోచ్ఛ్రాయైః, ఖం, వితత్య, ప్రతిదినం, రాశీభూతః, త్ర్యంబకస్య, అట్టహాస, ఇవ, స్థితః అతిథిః, స్యాః.

**ప్రతిపదార్థం:** ఊర్ధ్వం, చ, గత్వా= పైకివెళ్ళి; దశముఖ= రావణుని; భుజ= బాహువులచే; ఉచ్ఛ్వాసిత= కదలిపోయిన; ప్రస్థ= సానువుల; సంధేః= కీళ్ళుకలిగినదియు; త్రిదశవనితా= దేవతాస్త్రీల; దర్పణస్య= అద్దమునునైన; యః =ఏ; కైలాసస్య= కైలాసపర్వతము; కుముదవిశదైః= కలువవలె స్వచ్ఛమైన; శృంగ, ఉచ్ఛ్రాయైః= ఉన్నతమైన శిఖరములతో; ఖం= ఆకాశమును; వితత్య= నిండి; ప్రతిదినం= ప్రతిరోజూ; రాశీభూతః= కుప్పగా చేయబడిన; త్ర్యంబకస్య= శివునియొక్క; అట్టహాసః, ఇవ= పెద్ద నవ్వువలె; స్థితః= ఉన్నదో (తస్య=దానికి); అతిథిః= అతిథివి; స్యాః= కమ్ము.

**తాత్పర్యం :** అలాపైకి వెళ్ళి రావణుని బాహువులచే కదిలిన సానువుల కీళ్ళు కలిగి, దేవతాస్త్రీల అద్దమై (తెల్ల) కలువలవలె స్వచ్ఛమై, ఉన్నతమైన శిఖరాలతో ఆకాశాన్ని వ్యాపించి, ప్రతిరోజూ కుప్పలుపోసిన శివుని అట్టహాసమో అనునట్లున్న కైలాస పర్వతమునకు అతిథివికమ్ము.

**'శ్రీకళా' వ్యాఖ్య:** కైలాసపర్వతం వెండికొండ. కనుక దేవతాస్త్రీలు చూసికొనే అద్దమని కవి ఊహ! తెల్ల కలువ వలె స్వచ్ఛమై ఎత్తైన శిఖరాలతో ఆకాశమంతటా వ్యాపించి ప్రతిరోజూ కుప్పలు పోసిన ముక్కంటి అట్టహాసమో అన్నట్లున్న కైలాసపర్వతానికి అతిథివి కమ్మంటున్నాడు. ఈ కైలాస పర్వత సానువుల సంధి బంధాలు పూర్వం రావణాసురుడు పెకలించడం వల్ల కదిలిపోయాయంటున్నాడు. అలం: ఉత్ప్రేక్ష.

**ఉత్పశ్యామి త్వయి తటగతే స్నిగ్ధభిన్నాఞ్జనాభే**
**సద్యః కృత్త ద్విరద రద నచ్ఛేద గౌరస్య తస్య।**
**శోభామద్రేః స్తిమితనయన ప్రేక్షణీయాం భవిత్రీ**
**మంసన్యస్తే సతి హలభృతో మేచకే వాససీవ॥** 59

**పదచ్ఛేదం :** ఉత్+పశ్యామి, త్వయి, తటగతే, స్నిగ్ధ, భిన్న, అంజనాభే, సద్యః, కృత్త, ద్విరద, రదనచ్ఛేద, గౌరస్య, తస్య, శోభాం, అద్రేః, స్తిమితనయనప్రేక్షణీయాం, భవిత్రీం, అంసన్యస్తే సతి, హలధృతః, మేచకే, వాససి+ఇవ.

**అన్వయం :** స్నిగ్ధ, భిన్న, అంజన, ఆభే, త్వయి, తటగతే, సద్యః, కృత్త, ద్విరద, రదన,

స్యాత్, యది, క్రీడాలోలాః, తాః, శ్రవణపరుషైః, గర్జితైః, భాయయేః.

**ప్రతిపదార్థం** : తత్ర = ఆకైలాసమున; సురయువతయః= దేవతాస్త్రీలు; అవశ్యం= అన్ని విధాలా; వలయి కులిశ, ఉద్ఘట్టన+ఉదీర్ణతోయం= (తమ) గాజుల అంచుల దెబ్బలతో స్రవించు నీరు గల వాడవైన; త్వాం= నిన్ను; యంత్రధారాగృహత్వం = యంత్రముల ద్వారా నీటిని ప్రవహింప జేయు గృహముగా ; నేష్యంతి=పొందింపగలరు; సఖ!= ఓ మిత్రమా! ఘర్మలబ్ధస్య= వేసవియందులభించిన; తవ= నీకు; తాభ్యః= వారి నుండి; మోక్షః= విడుదల; యదినస్యాత్= లేనిచో; క్రీడాలోలాః= ఆటలతో మునిగిన తాః= వారిని; శ్రవణపరుషైః= కర్ణకఠోరమైన; గర్జితైః= ఉఱుములచే; భాయయేః= భీతినొందింపుము.

**తాత్పర్యం :** ఆ కైలాస పర్వతంలో దేవతాస్త్రీలు తమ కరకంకణపు అంచులతో నిన్ను తాటించి (ఆరంధ్రాల్లోనుండి) నీరు ఉబికి వచ్చేట్లుచేసి, అన్ని విధాలా నిన్ను జలయంత్ర ధారగా రూపొందించి ఆనందిస్తారు. వేసవిలో లభించిన నీకు వారి నుండి విడుదల లేకపోతే క్రీడాసక్తులైన వారిని నీకర్ణకఠోరమైన ఉఱుములచే భయపెట్టుము.

**'శ్రీకళా' వ్యాఖ్య:** అది వేసవి. వేసవిలో (అప్పుడే వర్షరువు ప్రారంభమైనా వేసవి తీవ్రత వెంటనే పోదుగదా!) దొరికిన నిన్ను ఎవరూ అంత తేలికగావదలరు. అందునా దేవతాస్త్రీలు. నీలోజలముందని వారికి తెలుసు. కనుక వారు తమచేతిగాజులతో నిన్ను కొట్టి నీకురంధ్రాలు కల్పిస్తారు. ఆరంధ్రాల్లోంచి నీరు చిమ్ముతూ ఉంటే 'యంత్రధార'లా నిన్ను రూపొందిస్తారు. ఆనీటితో జలక్రీడాసక్తులైన ఆదేవతాస్త్రీలు నిన్నొక పట్టాన వదలకపోతే నువ్వు కర్ణకఠోరమైన ఉఱుములతో వారిని భయపెట్టి నీ ప్రయాణాన్ని కొనసాగించు మని (వారిని వదలమని) మేఘుడు యక్షుని ప్రబోధిస్తున్నాడు.

**హేమా మ్భోజ ప్రసవి సలిలం మానసస్యాదదానః**
**కుర్వన్కామం క్షణ ముఖ పటప్రీతిమై రావతస్య ।**
**ధున్వన్కల్పద్రుమ కిసలయా న్యంశకానీవ వాతై -**
**ర్నానా చైష్టైర్జలద లలితై ర్నిర్విశేస్తం నగేన్ద్రమ్ ॥** 62

**పదచ్ఛేదం :** హేమ + అంభోజ ప్రసవి, సలిలం, మానసస్య, ఆదదానః, కుర్వన్, కామం, క్షణముఖ పట ప్రీతిం, ఐరావతస్య; ధున్వన్, కల్పద్రుమ కిసలయాని, అంశకాని, ఇవ, వాతైః, నానాచేష్టైః, జలద, లలితైః, నిర్విశేః, తం, నగేంద్రమ్.

పాదచారేణ= కాలినడకతో; విహరేత్+యది= విహరించుచో; అగ్రయాయీ= ముందు నడుచుచున్న వాడవై; స్తంభిత= ఘనీభవించిన; అంతః+జల, ఓఘః=లోనున్న జలప్రవాహముతో; భంగీభక్త్యా= కణుపుల కూర్పుచేత; విరచితవపుః= శరీరమును అమర్చి; మణితట= రత్నములు(పొదిగిన)పీఠమును; ఆరోహణాయ= ఎక్కుటకొఱకు; సోపానత్వం= మెట్లుగా ఏర్పడుటను; భజ= పొందుము.

**తాత్పర్యం :** ఆకైలాస పర్వతమున శివుడు చేతికంకణమైన పామును విడచి పార్వతికి చేయూతనిచ్చి కాలినడకతో విహరించే సన్నివేశంలో నువ్వు వారికి ముందుండి నీలో జలమును ఘనీభవింపజేసికొని కణుపుల కూర్పుతో నీ శరీరాన్ని అమర్చి రత్న పీఠము ను వారెక్కుటకు నువ్వు మెట్లుగా ఏర్పడి వారిని సేవింపుము.

**'శ్రీకళా' వ్యాఖ్య:** ఆదిదంపతులైన పార్వతీపరమేశ్వరులు కైలాసపర్వతంపై పాదచారులై విహరిస్తూ ఉంటారు. ఆసన్నివేశంలో పరమేశ్వరుడు చేతికంకణంగా అమర్చుకొన్న సర్పాన్ని పార్వతీ సౌలభ్యం కోసం విడచి ఆమెకు తన చేయూతనిస్తాడు. అప్పుడు మేఘుడు తనజలాన్ని లోపలఘనీభవింపజేసికొని (వర్షించకుండా) వారికి మెట్లుగా ఏర్పడి సేవించడం వల్ల వారి అనుగ్రహానికి పాత్రుడౌతాడు.

కైలాస, మేరు, మంధర, గంధమాదన పర్వతాలు శివునికి క్రీడాస్థానాలని శంభురహస్యంలో ఉంది:

*కైలాసం కనకాద్రిశ్చ మంధరోగంధమాదనః ।*
*క్రీడార్థం నిర్మితాఃశంభోర్దేవైః క్రీడాదయోఽభవన్ ॥*

అలం : రూపకం.

**తత్రావశ్యం వలయకులిశోద్ఘట్టనోద్గీర్ణతోయం**
**నేష్యన్తిత్వాం సురయువతయో యన్త్రధారాగృహత్వమ్ ।**
**తాభ్యోమోక్షస్తవ యదిసఖే ఘర్మలబ్ధస్య నస్యా -**
**త్క్రీడాలోలాః శ్రవణ పరుషైర్గర్జితైర్భాయయేస్తాః ॥** 61

**పదచ్ఛేదం :** తత్ర, అవశ్యం, వలయకులిశ+ ఉద్ఘట్టన+ఉద్గీర్ణతోయం, నేష్యంతి, త్వాం, సురయువతయః, యంత్రధారా గృహత్వమ్, తాభ్యః, మోక్షః, తవ, యది, సఖే, ఘర్మలబ్ధస్య, న, స్యాత్, క్రీడాలోలాః, శ్రవణ పరుషైః, గర్జితైః, భాయయేః, తాః.

**అన్వయం:** తత్ర, సురయువతయః, అవశ్యం, వలయకులిశ+ ఉద్ఘట్టన+ ఉద్గీర్ణతోయం, త్వాం, యంత్రధారాగృహత్వం, నేష్యన్తి. సఖే! ఘర్మలబ్ధస్య, తవ, తాభ్యః మోక్షః, న

సలిల + ఉద్గారం, అభ్రబృందం, కామినీ, ముక్తాజాల గ్రథితం, అలకం, ఇవ, వహతి.

**ప్రతిపదార్థం** : (హే) కామచారిన్ = స్వేచ్ఛా సంచారివగు ఓ మేఘుడా!; ప్రణయిన ఇవ = ప్రియునివలె; తస్య = ఆకైలాస పర్వతముయొక్క; ఉత్సంగే = తొడయందు; స్రస్త = జారిన; గంగా దుకూలాం, ఇవ = గంగానది యొక్క శ్రేష్ఠమైన వస్త్రమువలె; అలకాం = అలకాపట్టణమును; దృష్ట్వా = చూచి; త్వం, పునః = నీవైతే; నజ్ఞాస్యస ఇతిన = తెలిసికోక పోవు; ఉచ్చైః, విమానా = ఎత్తైన భవనములతో; యా = ఏ అలకాపురి; వః = మీయొక్క, కాలే = కాలమున (వర్షర్తువునందు); సలిల + ఉద్గారం = నీటిని స్రవించు; అభ్రబృందం = మబ్బుల సమూహమును; కామినీ = స్త్రీయొక్క; ముక్తాజాల గ్రథితం = ముత్యాలతో కూర్చిన; అలకమివ = ముంగురులవలె; వహతి = వహించు చున్నదో!

**తాత్పర్యం** : స్వేచ్ఛా సంచారివగు ఓ మేఘమా! ప్రియునివలె ఆ కైలాస పర్వతం తొడపై జారిన గంగానదీ వెలిపట్టు చీర వంటి అలకాపట్టణాన్ని నువ్వు తెలిసి కోకపోవు. ఏఅలకాపురి ఎత్తైన ప్రాసాదాలతో వర్షర్తువులో నీటి ధారలను స్రవించే మేఘబృందం స్త్రీల ముత్యాలతో కూర్చిన ముంగురుల్లా వహిస్తోందో!

**'శ్రీకళా' వ్యాఖ్య** : కైలాస పర్వతం నాయకునిగా, అలకానగరాన్ని నాయికగా భావించి వర్ణిస్తున్నాడు కవి. నాయకుడు అనుకూలుడు. నాయిక స్వాధీనపతిక.

"**ఏకాయత్తోఽను కూలస్యాత్**" అని అనుకూల నాయకుని నిర్వచనం. అంటే ఏక పత్నీవ్రతుడు. "***ప్రియోపలాలితా నిత్యం స్వాధీన పతికామతా***" అని స్వాధీన పతికా నాయిక లక్షణం. అంటే ప్రియుడు నిత్యం మధుర చాటుక్తులతో ఆమెను లాలిస్తూ ఉంటాడు. ప్రేయసికి ఎందుకో ప్రియునిపై కోపం వస్తే ప్రియుడామెను తనతొడపై పడుకో బెట్టుకుంటే ఆ స్త్రీ రూపం ఎలా ఉంటుందో అలా ఉందట కైలాస పర్వతం పై అలకా పట్టణం! ఆకాశంలో జారిన గంగానది ఆ ప్రియురాలి తెల్ల పట్టు చీరలా ఉంది. నువ్విదివరకు చాలాసార్లు వెళ్ళిన వాడవు కనుక నేను క్రొత్తగా చెప్పనక్కర్లేదు, నువ్వా సంగతి తెలిసి కోలేక పోవు, అంటున్నాడు యక్షుడు.

'ఉచ్చైః, విమానాః' అనే ప్రయోగం నగర సందర్భంలో ఎత్తైన ప్రాసాదాలు అనే అర్థాన్ని, నాయికాపరంగా తీరిన అధిక కోపము కలదనే అర్థాన్నీ ఇస్తోంది! మానం 'అంటే కోపం – ఉచ్చైః – చాలా కోపం వచ్చింది. విమానా = విగతా మానాయస్యా సా 'విమానా' – అంటే పోయిన కోపాధిక్యం కలదని అర్థం. ఆవిడ నిత్యం ప్రియోపలాలిత కనుక మృదు మధుర వాక్యాలతో నాయకుడు ఆమె అలకని తీర్చేడు. కోపం పోయిన తర్వాత స్త్రీ

**అన్వయం :** (హే) జలద! హేమ + అంభోజ, ప్రసవి, మానస్య, సలిలం, ఆదదానః, ఐరావతస్య, క్షణముఖపటప్రీతి, కుర్వన్, కల్పద్రుమ కిసలయాని, అంశుకాని, స్వ, వాతైః, ధున్వన్ లలితైః, నానాచైష్టైః, తం, నగేంద్రం, కామం, నిర్విశేః.

**ప్రతిపదార్థం :** జలద = ఓమేఘమా !; హేమ + అంభోజ, ప్రసవి = బంగారు పద్మములకు జన్మస్థానమైన మానసస్య = మానస సరోవరం యొక్క; సలిలం = నీటిని, ఆదదానః, స్వీకరించి; ఐరావతస్య = (దేవేంద్రుని ఏనుగైన) ఐరావతమునకు; క్షణ = క్షణకాలము; ముఖపట ప్రీతిం = ముఖముపై వస్త్రముగా ఒప్పిన సంతోషమును; కుర్వన్ = చేయుచు; కల్పద్రుమ కిసలయాని = కల్పవృక్షపు చిగురులనెడి; అంశుకాని = వస్త్రములను; స్వవాతైః = నీ గాలులచేత; ధున్వన్ = ఎగురగొట్టుచు; లలితైః = మనోజ్ఞమైన ; నానాచేష్టైః = వివిధవిలాసములతో; తం నగేంద్రం = ఆపర్వతమును; కామం= యథేచ్ఛగా; నిర్విశేః = అనుభవింపుము.

**తాత్పర్యం :** (అక్కడ) బంగారు తామరపూలకు జన్మస్థానమైన మానస సరోవరంలోని నీటిని స్వీకరించి, దేవేంద్రగజమైన ఐరావతానికి క్షణకాలం ముఖవస్త్రంగా శోభించే వన్న సంతోషాన్ని కలుగజేస్తూ కల్ప వృక్షపు చివుళ్ళనే వస్త్రాలని నీ గాలులతో ఎగురగొడుతూ మనోజ్ఞమైన వివిధవిలాస పూరిత క్రీడలతో ఆపర్వతాన్ని యథేచ్ఛగా అనుభవింపుము.

**'శ్రీకళా' వ్యాఖ్య:** మానస సరోవరం బంగారు తామరపూలకి జన్మస్థానమని కవిసమయం. అంత చక్కని పరిసరాల్లో యథేచ్ఛా సంచారాలతో విహరించమంటున్నాడు. అలం: ఉత్ప్రేక్ష.

**తస్యోత్సఙ్గే ప్రణయిన ఇవస్రస్త గఙ్గాదుకూలాం**
**నత్వం దృష్ట్వా నపునరలకాం జ్ఞాస్యసే కామచారిన్ ।**
**యావః కాలే వహతి సలిలోద్గారముచ్చైర్విమానా**
**ముక్తాజాలగ్రథిత మలకం కామినీ వాభ్ర బృన్దమ్ ॥** 63

**పదచ్ఛేదం :** తస్య, ఉత్సంగే, ప్రణయినః, ఇవ, స్రస్త, గంగా, దుకూలాం, న, త్వం, దృష్ట్వా, న, పునః, అలకాం, జ్ఞాస్యసే, కామచారిన్, యావః కాలే, వహతి, సలిల + ఉద్గారం, ఉచ్చైః, విమానా, ముక్తాజాలగ్రథితం, అలకం, కామినీ, ఇవ, అభ్రబృందమ్.

**అన్వయం :** కామచారిన్, ప్రణయినః, ఇవ, తస్య, ఉత్సంగే, స్రస్త, గంగాదుకూలం, అలకాం, దృష్ట్వా, త్వం, పునః, నజ్ఞాస్యస ఇతిన, ఉచ్చైః, విమానా, యా, వః, కాలే,

# మేఘదూతమ్

## ఉత్తరమేఘం

**విద్యుత్వన్తం లలిత వనితాః సేన్ద్రచాపం సచిత్రాః**
**సంగీతాయ ప్రహతమురజాః స్నిగ్ధ గమ్భీర ఘోషమ్ ।**
**అన్తస్తోయం మణిమయభువస్తుఙ్గ మభ్రంలిహాగ్రాః**
**ప్రాసాదాస్త్వాం తులయితుమలం యత్ర తైస్తైర్విశేషైః ॥** 1

**పదచ్ఛేదం :** విద్యుత్వంతం, లలితవనితాః స + ఇంద్రచాపం, సచిత్రాః, సంగీతాయ, ప్రహతమురజాః, స్నిగ్ధ గంభీర ఘోషం, అంతః + తోయం, మణిమయభువః, తుంగం, అభ్రంలిహ + అగ్రాః, ప్రాసాదాః, త్వాం, తులయితుం, అలం, యత్ర, తైః, తైః, విశేషైః.

**అన్వయం :** యత్ర, లలితవనితాః, సచిత్రాః, సంగీతాయ, ప్రహత మురజాః, మణిమయభువః, అభ్రంలిహ అగ్రాః, ప్రసాదాః, విద్యుత్వంతం, స + ఇంద్రచాపం, స్నిగ్ధ, గంభీర ఘోషం, త్వాం, తైః, తైః, విశేషైః, తులయితుం, అలం.

**ప్రతిపదార్థం :** యత్ర = ఎక్కడ (అడైతే – ఏ అలకాపురి); లలితవనితాః సచిత్రాః = సుకుమారులైన స్త్రీల తోడను, చక్కని చిత్రములు కలిగియుడునో; సంగీతాయ ప్రహతమురజాః = నృత్య ప్రదర్శనలకై మ్రోగించిన మృదంగ వాద్యములు కలదియు; మణిమయ భువః = మణులతో నిండిన భూప్రదేశములు కలిగిన; అభ్రంలిహ అగ్రాః ప్రాసాదాః= ఆకసమునంటుచున్న శిఖరములు కల భవనంతో నున్నదియు; విద్యుత్వంతం, స + ఇంద్ర చాపం = మెఱపులతోడ, ఇంద్రధనుస్సుతో కూడిన; స్నిగ్ధ గంభీర ఘోషం, త్వాం = శ్రావ్యమై గంభీరమైన ధ్వని కలిగిన నిన్ను; తైః, తైః, విశేషైః = ఆయా విశేషములచేత; తులయితుం, అలం = సాటి వచ్చుటకు తగియున్నది. (ఉంటుందో)

**తాత్పర్యం:** ఏ అలకాపురి సుకుమారులైన స్త్రీలతో, చక్కని చిత్రాలతో, నృత్య ప్రదర్శనలకై మ్రోగించిన మృదంగ వాద్యాలతో, మణులు నిండిన భూప్రదేశాలతో, ఆకాశాన్నంటే శిఖరసంయుక్తాలైన భవనములతో మెఱపులతో, ఇంద్ర ధనుస్సులతో కూడి శ్రావ్యమై గంభీర ధ్వని కలిగిన నీకు ఆయా విశేషాలతో సాటివచ్చుటకు తగి ఉంటుందో (12 వ శ్లోకంతో అన్వయం)

**'శ్రీకళా' వ్యాఖ్య :** ఇంత వరకు పూర్వమేఘంలో యక్షుని పట్టణమైన అలకాపురికి మార్గాన్ని చెప్పి, ఇప్పుడు అలకాపురిని వర్ణిస్తున్నాడు కాళిదాసు. ఉత్తరమేఘంలోని ఈ

పురుషసంగమంలో మాధుర్యం ఇక్కడ సహృదయుడు భావించాలి. అక్కడ గంగానదీ ఉంది.

ఇక ఈ మబ్బులగుంపులు నీటి బొట్లను స్రవిస్తూ ఉంటే ఆనీటి బిందువులు ముత్యాలు గాను, వాటిని ధరించిన ఈ మేఘాలు స్త్రీల ముంగురుల్లా ప్రకాశిస్తాయట! ఇటువంటి మేఘ సముదాయాన్ని ఆ అలకా పట్టణం వర్షర్తువులో వహిస్తూ ఉంటుంది.

ఎంతటి సున్నిత సుమనోహరమైన భావన !

**'మేఘదూతమ్ ' పూర్వార్థం**

సమాప్తం

**అన్వయం** : యత్ర, వధూనాం, హస్తే, లీలాకమలం, అలకే, బాలకుందానువిద్ధం, ఆననే, లోధ్ర, ప్రసవరజసా, పాండుతాం, నీతా, శ్రీః, చూడాపాశే, నవకురవకం, కర్ణే చారు, శిరీషం, సీమంతే, త్వత్ ఉపగమజం, నీ పంచ.

**ప్రతిపదార్థం** : యత్ర = ఏ అలకాపట్టణమున; వధూనాం = స్త్రీల; హస్తే లీలాకమలం= చేతిలో విలాసము కొఱకైన పద్మమును; అలకే = ముంగురులపై; బాలకుంద = మొల్లల మొగ్గల; అనువిద్ధం = అలంకరణయు; ఆననే = ముఖమున; లోధ్రప్రసవ = లోధ్రపుష్పముల; రజసా = పుప్పొడిచే; పాండుతాం = తెలుపును; నీతా, శ్రీః = శోభనొంది; చూడాపాశే = కేశ పాశమున; నవ, కురవకం = క్రొత్తగా పూచిన గోరింట పూవును; కర్ణే = చెవియందు; చారు = అందమైన; శిరీషం = దిరిసెనపూవును; సీమంతే = పాపటయందు; త్వత్, ఉపగమజం = నీవలన పూచిన; నీపం చ = కదంబ పుష్పమును. (ఉండునో)

**తాత్పర్యం** : ఆ అలకాపట్టణంలో స్త్రీలు చేతిలో విలాసంగా పద్మాల్నీ, ముంగురులపై మొల్ల మొగ్గలు, ముఖానికి లోధ్ర పుష్ప పరాగాన్ని (అంగరాగంగా) తలలో గోరింట పూవుల్ని చెవిదగ్గఱ శిరీష పుష్పాల్నీ, పాపటలో కదంబ పుష్పాల్నీ ధరిస్తారు.

**'శ్రీకళా' వ్యాఖ్య** : అలకాపురిలో స్త్రీలు వివిధ కుసుమాల్ని వివిధ ప్రదేశాల్లో ఎలా ధరిస్తూ ఉంటారో ఈ శ్లోకంలో కవి వర్ణించేడు. అయితే భూలోకంలో ఈ పుష్పాలు భిన్న భిన్న ఋతువుల్లో పూస్తాయి కాని అలకానగరంలో ఏక కాలంలో అన్నీ పూస్తాయనీ, అంటే- సంవత్సరంపొడుగునా అన్ని పుష్పాలూ పూస్తాయనికాని ఊహించాలి. ''శరత్ పంకజలక్షణా'' అనే న్యాయాన్ననుసరించి శరత్కాలంలో పద్మం, 'మాఘ్యం కున్దమ్' కుందపుష్పం మాఘమాసంలోనూ పూస్తాయి. 'బాలకుందమ్' అనే విశేషణం చేత హేమంతంలో మొగ్గలొస్తాయి. శిశిరంలో లోధ్ర (లొద్దుగ) పూవు, వసంతంలో కురవకం (గోరింట), గ్రీష్మంలో శిరీషం (దిరిసెన పువ్వు) వర్షర్తువులో నీపం అంటే కదంబ (కడిమి) పుష్పం పుష్పిస్తాయి.

**యస్యాం యక్షాః సితమణి మయాన్యేత్య హర్మ్య స్థలాని**
**జ్యోతిశ్ఛాయాకుసుమ రచితాన్యుత్తమస్త్రీ సహాయాః।**
**ఆ సేవన్తే మధు రతిఫలం కల్పవృక్ష ప్రసూనం**
**త్వద్గమ్భీర ధ్వనిషు శనకైః పుష్కరే ష్వాహతేషు ॥** 3

**పదచ్ఛేదం** : యస్యాం, యక్షాః, సితమణిమయాన్, ఏత్య, హర్మ్యస్థలాని, జ్యోతిః,

ప్రథమ శ్లోకంలో అలకాపురి సర్వవిధాలా నిన్నే పోలి ఉంటుందని యక్షుడు మేఘునితో చెబుతున్నాడు. మేఘునికీ, అలకాపురికీ ఉన్న సాదృశ్యాలు ఈ శ్లోకంలో చెప్పేడు. మేఘుడు మెఱపు తీగతో కలిసి ఉంటాడు, అలకాపురి మెఱపు తీగలవంటి యువతులతో కూడి ఉంటుంది., ఇంద్రధనుస్సుతో మేఘుడుంటే అనేక వర్ణ చిత్రితాలైన చిత్రపటాలతో అలకాపురి భవనాలుంటాయి. అలకాపురిలో సంగీతానికి (నృత్యానికి) మృదంగవాద్యాది ధ్వనులుంటే, మృదంగ ధ్వని వంటి ఉఱుములు మేఘునిలో ఉంటాయి. మేఘునిలో స్వచ్ఛమైన నీరున్నట్లే అలకాపురిలో మణిమయమైన నేల (భవనాల్లో) స్ఫటికంలా మెరుస్తూ ఉంటుంది. మేఘుడు ఆకాశంలో ఎత్తుగా ఉన్నట్లే అలకాపురిలో భవనాలూ ఎత్తైనవై ఆకాశాన్నంటుతూ ఉంటాయి.

అర్వాచీనకాలంలో సంగీత నృత్యాలు వేర్వేరు కళలుగా విలసిల్లినా ప్రాచీన కాలంలో ఈ రెండూ ఒక కళగానే ప్రసిద్ధి నొందింది.

''***నృత్యం వాద్యం తథాగీతం త్రయం సంగీతముచ్యతే***'' అని సంగీత రత్నా కరకర్త శార్ఙ్గదేవుడు పేర్కొన్నాడు. మొదటి 11 శ్లోకాలూ అలకాపురి వర్ణనే. ఈ పదకొండు శ్లోకాల్లో ప్రతి శ్లోకంలోనూ ఉన్న యచ్ఛబ్ద ప్రయోగం (యత్ర, యస్యాం) 12వ శ్లోకంలో తచ్ఛబ్ద ప్రయోగంతో (''తత్రాగారం.....) కనుక 'యత్ర' శబ్దానికి ''ఎక్కడైతే – ఏ అలకాపురిలో నైతే.... ''వగైరా వగైరా ఉంటాయో'' అని 12వ శ్లకంలోని 'తత్ర' శబ్దానికి ''అక్కడ'' ''మదీయం ఆగారం అస్తి'' – ''మాఇల్లు ఉన్నది'' ని అన్వయించుకోవాలి. అలం : బింబ ప్రతి బింబం.

**హస్తేలీలా కమలమలకే బాలకున్దాను విద్ధం**
**నీతాలోధ్రప్రసవరజసా పాణ్డుతామాననే శ్రీః।**
**చూడాపాశే నవకురవకం చారుకర్ణే శిరీషం**
**సీమన్తేచ త్వదుపగమజం యత్ర నీపం వధూనామ్॥** 2

**పదచ్ఛేదం** : హస్తే, లీలాకమలం, అలకే, బాలకుంద + అనువిద్ధం, నీతా, లోధ్ర ప్రసవరజసా, పాండుతాం, ఆననే, శ్రీః, చూడాపాశే, నవకురవకం, చారు, కర్ణే, శిరీషం, సీమంతే, చ, త్వత్, ఉపగమజం, యత్ర, నీపం, వధూనామ్.

**అన్వయం** : యత్ర, వధూనాం, హస్తే, లీలాకమలం, అలకే, బాలకుంద + అనువిద్ధం, నీతా, లోధ్ర ప్రసవ రజసా, పాండుతాం, ఆననే, శ్రీః, చూడాపాశే, నవకురవకం, చారు, కర్ణే, శిరీషం, సీమంతే, చ, త్వత్, ఉపగమజం, యత్ర, నీపం, వధూనామ్.

**ఇత్థం చేన్మధుపుష్ప భజ్యపచితం పుష్ప ద్రుమూలావృతం**
**క్వాథేన స్మరదీపనం రతి ఫలాఖ్యం స్వాదు శీతం మధు ॥ "**

దీని ప్రస్తావన ఇలా ఉన్నట్లు మల్లినాథ సూరి పేర్కొన్నాడు. ఆధునికుల్లో విశ్వనాథవారు 'అశ్వమేధం' నవలలో మధువులు తయారు చేసే విధానం వివరంగా పేర్కొన్నారు. అలం : సంసృష్టి.

**మన్దాకిన్యాః సలిల శిశిరైః సేవ్యమానా మరుద్భి -**
**ర్మన్దారాణా మను తటరుహాం ఛాయయా వారితోష్ణాః ।**
**అన్వేష్టవ్యైః కనకసికతా ముష్టి నిక్షేప గూఢైః**
**సంక్రీడన్తే మణి భిరమర ప్రార్థితాయత్ర కన్యాః ॥** 4

**పదచ్ఛేదం** : మందాకిన్యాః, సలిల శిశిరైః, సేవ్యమానాః మరుద్భిః , మందారాణాం, అనుతట రుహాం, ఛాయయా, వారిత, ఉష్ణాః, అన్వేష్టవ్యైః, కనక సికతా ముష్టినిక్షేప గూఢైః, సంక్రీడంతే, మణిభిః, అమర ప్రార్థితా, యత్ర, కన్యాః.

**అన్వయం** : యత్ర, అమర ప్రార్థితాః, కన్యాః, మందాకిన్యాః, సలిలశిశిరైః, మరుద్భిః, సేవ్యమానాః, అనుతటరుహాం, మందారాణాం, ఛాయయా, వారిత + ఉష్ణాః, కనకసికతాముష్టి నిక్షేప గూఢైః, అన్వేష్టవ్యైః, మణిభిః, సంక్రీడంతే.

**ప్రతిపదార్థం** : యత్ర = (ఏ అలకానగరంలో) ఎక్కడైతే; అమర ప్రార్థితాః = దేవతలచే కోరదగిన; కన్యాః = (యక్ష) యువతులు; మందాకిన్యాః = అమరగంగయొక్క; సలిల శిశిరైః = చల్లని నీటిచేత; మరిద్భిః = గాలుల చేత; సేవ్యమానాః = సేవితులై; అనుతట రుహాం = తీరములందు మొలిచిన; మందారాణాం = మందార వృక్షముల; ఛాయయా = నీడ చేత; వారిత + ఉష్ణాః = వేడిని పోగొట్టుకొన్నవారై; కనకసికతా, ముష్టి నిక్షేప గూఢైః= బంగారపుటిసుకను గుప్పిళ్లలో రహస్యముగా ఉంచి; అన్వేష్టవ్యైః = వెదుకతగిన; మణిభిః = రత్నములతో ; సంక్రీడన్తే = ఆటను ఆడుకొనుచుందురో.

**తాత్పర్యం** : ఏ అలకాపట్టణంలో దేవతలచే కోరదగిన యువతులు ఆకాశ గంగ యొక్క చల్లని నీటిచే, వాయువుల చేత సేవనందుకొంటూ తీరప్రాంతంలో మొలిచిన మందారవృక్షాల నీడలో ఆత పాపనయునంచేసికొంటూ బంగారపు ఇసుకను గుప్పిళ్లలో కనిపించ కుండా ఉంచి రత్నాల్ని వెతికే ఆట ఆడుకొంటూ ఉంటారో....

**'శ్రీకళా' వ్యాఖ్య** : ఆకాశగంగ (స్వర్గంగ)కు 'మందాకిని' అని పేరు. భూలోకంలోని

ఛాయా, కుసుమ – రచితాని, ఉత్తమ స్త్రీ సహాయాః, ఆసేవంతే, మధు, రతిఫలం, కల్పవృక్ష ప్రసూనం, త్వత్, గంభీర ధ్వనిషు, శనకైః, పుష్కరేషు, ఆహతేషు.

**అన్వయం** :యస్యాం, యక్షాః, ఉత్తమస్త్రీ సహాయాః, సితమణిమయాని, జ్యోతిచ్ఛాయాకుసుమ – రచితాని, హర్మ్య స్థలాని, ఏత్య, త్వత్ గంభీర ధ్వనిషు, పుష్కరేషు, శనకైః, ఆహతేషు, కల్పవృక్ష ప్రసూతం, రతిఫలం, మధు, ఆసేవంతే.

**ప్రతిపదార్థం** : యస్యాం = ఏనగరంలో నైతే; యక్షాః = యక్షులు; ఉత్తమ స్రీ సహాయాః = ఉత్తమ స్త్రీలతో; సితమణి మయాని = చంద్రకాంత మణులతో నిండిన; జ్యోతిః ఛాయా = నక్షత్ర కాంతులనెడి; కుసుమ రచితాని = పుష్పాలంకరణ నొందిన; హర్మ్య స్థలాని, ఏత్య = సౌధములను పొంది; త్వత్, గంభీర ధ్వనిషు = నీ గంభీర గర్జనల (ఉఱుముల) వంటి ధ్వనిగల; పుష్కరేషు = వాద్యములు; శనకైః, ఆహతేషు = మెల్లగా వాయించు చుండగా; కల్పవృక్ష ప్రసూతం = కల్పవృక్షము నుండి వచ్చిన; రతిఫలం, మధు = 'రతిఫల' మనుపేరు గల మద్యమును; ఆసేవన్తే = సేవింతురు.

**తాత్పర్యం** : ఎక్కడైతే యక్షులు ఉత్తమ స్త్రీసమేతులై చంద్ర కాంత శిలలతో కూడిన నక్షత్రకాంతులనే పుష్పాలంకార సమేత సౌధాలలో నీ గంభీర గర్జనలవంటి ధ్వనిగల వాద్యాలు మెల్లగా మ్రోగుతుంటే కల్ప వృక్షోత్పన్నములై 'రతిఫల' మనే మద్యాన్ని సేవిస్తూ ఉంటారో....

**'శ్రీకళా' వ్యాఖ్య** : యక్షులు కాపురం ఉండే సౌధాలు అలకాపురిలో చంద్ర కాంత శిలలతోనో, స్ఫటిక శిలలతోనో నిర్మించినవై ఉంటాయి. కనుక ఆ భవనాలలోని నేల నక్షత్ర కాంతులీనుతూ ఉంటుంది. నేపథ్యంలో మేఘుని ఉఱుములనుపోలి గంభీరంగా ఉన్నా మృదువుగా మృదంగాది ధ్వనులు వినిపిస్తూ ఉంటే స్త్రీలతో కలసి వారు మధుపానం చేస్తుంటారు. ఆ స్త్రీలు ఉత్తములు. ఆ మధువు పేరు 'రతిఫలం'. అది కల్పవృక్ష జాతమైంది.

దేవతలు నిత్యయౌవనులు. యౌవనం కోసమో, ఉత్సాహం కోసమో వారు మధుపానం చేయవలసిన అవసరం లేదు. అవి ఎప్పుడూ వారికి ఉండనే ఉంటాయి కనుక. మరెందుకు చేస్తున్నారంటే – విలాసార్థం 'మదిరార్ణవ' మనే గ్రంథంలో –

*"తాలక్షీర సితామృతామల గుడోన్మత్తాస్థికాలా హ్వాయా*
*దార్వింద్ర ద్రుమమోరటేక్షు కదలీ గుల్మ ప్రసూనైర్యుతమ్ ।*

మోహోద్రేకంతో లాగుతూ ఉంటే దొండ పండు వంటి పెదవులు కలిగిన ముగ్ధలైన స్త్రీలు ఎదురుగా నున్న రత్నదీపములను ఆర్పుటకు గంధపు పొడిని గుప్పిళ్ళతో చల్లినను వారి ప్రయత్నము విఫలమౌతూ ఉంటుంది.

**'శ్రీకళా' వ్యాఖ్య** : అక్కడ మేఘుని కళ్లబడే ఒక దృశ్యాన్ని చెబుతున్నాడు యక్షుడీ శ్లోకంలో. ప్రేయసీ ప్రియులు భోగానుభవంకోసం సమావేశమైనప్పుడు ప్రియులు వణుకుతున్న చేతులతో ప్రియురాండ్ర చీరముడిని విప్పడానికి ఉద్యుక్తులౌతూ ఉంటే మోహావేశంతో ఉన్న ప్రియురాండ్ర వస్త్రాలు వదులై పోతున్నాయి. ప్రియులు చీరలాగుతుంటే తమ నగ్న శరీరం వారికి కనిపిస్తుందని ముగ్ధలై దొండపండు వంటి పెదవులు కలిగిన ఆ యువతులు తమ సమీపంలో ఉన్న సుగంధ యుక్తమైన గంధపు పొడిని పిడికిళ్లతో దీపాలపై చల్లుతున్నారు – దీపాలు ఆరిపోతే తమ నగ్నత్వం ప్రియులకు కనిపించదనే అమాయకపు ఊహతో. మరి – అవి మామూలు దీపాలు కాక రత్నదీపాలైన కారణంగా వీరి ప్రయత్నం విఫలమై పోతోంది. జాజ్వల్యమానమై ప్రకాశిస్తున్న రత్నదీప కాంతుల్లో ప్రియురాండ్ర నగ్న సౌందర్యం ప్రియులకు మైమరపు కల్పించడమే కాక వారి అమాయకత్వం వీరి మనసులకు మరింత ముచ్చట గొలుపుతోంది. పరమరమణీయమైన భావన ! అలం : సంకరం.

**నేత్రానీతాః సతత గతినా యద్విమానాగ్రభూమీ -**
**రాలేఖ్యానాం నవజలకణై ర్దోష ముత్పాద్య సద్యః ।**
**శఙ్కాస్పృష్టా ఇవ జలముచ స్త్వాదృశా జాలమార్గై -**
**ర్ధూమోద్గారానుకృతి నిపుణా జర్జరా నిష్పతన్తి ॥** **6**

**పదచ్ఛేదం** : నేత్రా, నీతాః, సతతగతినా, యత్, విమాన, అగ్రభూమిః, ఆలేఖ్యానాం, నవజలకణైః, దోషం, ఉత్పాద్య, సద్యః, శంకా స్పృష్టా ఇవ, జలముచః, త్వాదృశాః, జాలమార్గైః, ధూమ, ఉద్గార + అనుకృతి నిపుణాః, జర్జరాః, నిష్పతంతి.

**అన్వయం** : హేమేఘ !, నేత్రా, సతతగతినా, యత్, విమాన అగ్రభూమిః, నీతాః, త్వాదృశః, జలముచః, ఆలేఖ్యానాం, స్వజలకణికాదోషం, ఉత్పాద్య, సద్యః, శంకా స్పృష్టా ఇవ, ధూమ + ఉద్గార + అనుకృతి నిపుణాః, జర్జరాః, జాలమార్గైః, నిష్పతంతి.

**ప్రతిపదార్థం** : హే, మేఘ ! = ఓ మేఘుడా !; నేత్రా = ప్రేరకుడైన; సతతగతినా = శీఘ్రగమనుడగు వాయువుచే; యత్, విమాన, అగ్రభూమిః = ఏ (అలకాపురియందలి) సౌధోపరిభాగములను; నీతాః = చేర్చబడిన; త్వాదృశః, జలముచః = నీవంటి మేఘములు;

గంగను 'భాగీరథీ' అనీ, పాతాళ గంగను 'భోగవతీ' అనీ అంటారు.

**ఐతిహ్యం** : గంగ కర్దమ పుత్రియైన కళకి మరీచి వలన పుట్టింది. ఆ బాలిక పేరు 'పూర్ణిమ' ఆమె జన్మాంతరంలో హరిపద ప్రక్షాళిత జలంలో 'గంగ' గా జన్మించింది. ఇది భాగవత కథ.

వామనుడు విజృంభించి విశ్వరూపం ధరించి ఆకాశాన్ని తన పాదంతో కప్పినప్పుడు జలజోద్భవుడు బ్రహ్మ తన కమండలూదకంతో వామనావతారుడైన విష్ణు పాదం కడిగేడు. ఆ జలమే విష్ణుపాదోద్భవ గంగ. ఆపాదం ''బ్రహ్మ కడిగిన పాదము'' అని అర్వాచీనాంధ్ర కవి అన్న మార్యుని సంకీర్తన పల్లవి అయింది. అలం : ఉదాత్తం.

**నీవీబంధోచ్ఛ్వసిత శిథిలం యత్ర బిమ్బాధరాణాం**
**క్షౌమం రాగాదని భృత కరే ష్వాక్షిపత్సు ప్రియేషు ।**
**అర్చిస్తుఙ్గా నభిముఖమపి ప్రాప్య రత్నప్రదీపా -**
**న్హ్రీమూఢానాం భవతి విఫల ప్రేరణా చూర్ణముష్టిః ॥** 5

**పదచ్ఛేదం:** నీవీబంధః, ఉచ్ఛ్వసిత, శిథిలం, యత్ర, బింబాధరాణాం, క్షౌమం, రాగాత్, అనిభృత కరేషు, ఆక్షిపత్సు, ప్రియేషు, అర్చిః, తుంగాన్, అభిముఖం, అపి, ప్రాప్య, రత్న ప్రదీపాన్, హ్రీ, మూఢానాం, భవతి, విఫల ప్రేరణా, చూర్ణముష్టిః.

**అన్వయం** : యత్ర, అనిభృత, కరేషు, ప్రియేషు, నీవీబంధః, ఉచ్ఛ్వసిత, శిథిలం, క్షౌమం, రాగాత్, ఆక్షిపత్సు, హ్రీ, మూఢానాం, బింబాధరాణాం, చూర్ణముష్టిః, అర్చిస్తుంగాన్, రత్న ప్రదీపాన్, అభిముఖం, ప్రాప్య, అపి, విఫల ప్రేరణా, భవతి.

**ప్రతిపదార్థం** : యత్ర = ఎక్కడైతే (ఏఅలకాపురిలో నైతే); అనిభృత, కరేషు = వణుకుచున్న చేతులుకల; ప్రియేషు = నాయకులు (ప్రియులు); నీవీబంధ + ఉచ్ఛ్వసిత, శిథిలం = పోకముడిని విప్పుటలో పిగిలి వదులైన; క్షౌమం = విలువైన చీరను; రాగాత్ = కామోద్రేకముతో; ఆక్షిపత్సు = లాగుచుండగా; హ్రీమూఢానాం = సిగ్గుచే ముగ్ధలైన; బింబ + అధరాణాం = దొండ పండువంటి పెదవులు కలిగిన యువతులయొక్క; చూర్ణముష్టిః = (గంధపు) పొడితో నున్న పిడికిలి; అర్చిః తుంగాన్ = ఎత్తైన జ్వాలలు కల; రత్నప్రదీపాన్ = రత్నదీపములను; అభిముఖం, ప్రాప్య, అపి = ఎదురుగానున్నను; విఫల ప్రేరణా, భవతి = వ్యర్థమైన చల్లుటలుగా అగుచున్నది.

**తాత్పర్యం** : అక్కడ వణుకు చున్న చేతులతో ప్రియులు ప్రియురాంద్ర చీరముడిని

**అన్వయం** : యత్ర, నిశీథే, త్వత్, సంరోధ అపగమ విశదైః, చంద్రపాదైః, స్ఫుట జలలవస్యందినః, తంతుజాల అవలంబాః, చంద్రకాంతాః, ప్రియతమ భుజ ఉచ్ఛ్వాసిత ఆలింగితానాం, స్త్రీణాం, సురతజనితాం, అంగగ్లానిం, వ్యాలుంపంతి.

**ప్రతిపదార్థం** : యత్ర = ఏ అలంకాపట్టణంలో నైతే; నిశీథే = అర్ధరాత్రులందు; త్వత్, సంరోధ, అపగమ, విశదైః = నీ అవరోధము లేకపోవుటచే స్పష్టమైన; చంద్ర పాదైః = చంద్రకిరణములచే; స్ఫుట జలలవస్యందినః = స్పష్టమై జారుచున్న నీటి బిందువులు కల; తంతుజాల అవలంబాః = సూత్రముల వరుసకు అనుసంధానము నొందిన; చంద్రకాంతాః = చంద్రకాంత శిలలు; ప్రియతమ భుజ ఉచ్ఛ్వాసిత ఆలింగితానాం = ప్రియులు కౌగిలి నుండి విడివడిన; స్త్రీణాం = స్త్రీలయొక్క; సురతజనితాం = రతిక్రీడచేకలిగిన; అంగ గ్లానిం = శరీరబడలికలను; వ్యాలుంపంతి = అపనయించుచున్నవో (వి).

తాత్పర్యం : ఏ అలకాపట్టణంలో అర్ధరాత్రి వేళల్లో నీ అవరోధం లేక పోవటం చేత కాంతివంతమైన చంద్ర కిరణ ప్రసారం కలిగి సూత్ర సముదాయానికి అమర్చిన చంద్ర కాంత శిలల నుండి స్రవిస్తున్న నీటి బిందువులు ప్రియుల కౌగిలి నుండి విముక్తి నొందిన స్త్రీలకు రతిక్రీడ వలన కలిగిన శరీర బడలికలను బాపుచున్నవి.

**'శ్రీకళా' వ్యాఖ్య**: అర్ధరాత్రి అలకాపురిలో సన్నివేశం. ప్రస్తుతం మనం చూస్తున్నట్లుగానే సూత్రాలు, వాటికి రంగు రంగుల రాళ్లవంటివి కట్టుకున్నట్లే ద్వారాలకు అలంకారంగా ఆనాడు చంద్ర కాంతమణులను కట్టుకొనేవారు. ఈ చంద్ర కాంతమణి లక్షణం ఏమంటే చంద్ర కిరణాలు సోకినప్పుడవి ద్రవిస్తాయి. ఈ అలంకారాన్ని తమ పాన్పులకు పైన వారు ఏర్పాటు చేసికొని ఉండవచ్చు. మేఘుని అవరోధం లేకపోవటం వల్ల చంద్ర కాంతులు స్పష్టంగా ఈ చంద్ర కాంతమణులపై ప్రసరించి ఆ మణులు ద్రవించి బొట్టు బొట్టుగా నీరు పాన్పుపై శయనించిన స్త్రీలపై పడుతోంది. అంతవరకు రతిక్రీడ సలిపిన ప్రియుల కౌగిళ్లు రతిక్రీడానంతరం విడివడటంతో ఆ నీటి బిందువులు స్త్రీల శరీరాలపైపడి, రతికేళివలన పొందిన వారి శరీర బడలికలను ఈ నీటి బిందువులు ఉపశమింప చేస్తున్నాయుట! ఎంతటి ఊహా వైభవం! అలం : కావ్యలిజ్గం.

ఆలేఖ్యానాం = చిత్రములకు; స్వ, జల కణికా దోషం, ఉత్పాద్య = తననీటి బిందువుల దోషమును కలిగించి; సద్యః, శంకాస్పృష్టా ఇవ = వెంటనే భయపడి నవో అన్నట్లు; ధూమ, ఉద్గార, అనుకృతి, నిపుణాః = పొగ వెడలుటను అనుకరించు నేర్పున నిపుణములై; జర్జరాః = శిథిలీకృతమై; జాలమార్గైః = కిటికీల రంధ్రములలో నుండి; నిష్పతంతి = వెడలుచుండునో.

**తాత్పర్యం** : వాయువు ప్రేరేపించగా ఏ అలకాపురి సౌధాలను చేరిన నీవంటి మేఘములు అచ్చట నున్న వర్ణ చిత్రములను తమ నీటి తుంపురులచే (రంగు కలసిపోవుటచే) దోషయుక్తమొనర్చి, భయపడినవో అన్నట్లు పొగను అనుకరించుచు కిటికీల రంధ్రములనుండి బయటకు వెడలుచుండునో .....

**'శ్రీకళా' వ్యాఖ్య** : సౌధా గ్రాల్లో వివిధ వర్ణాలతో రూపొందించిన చిత్ర పటాలున్నాయి. మేఘాలు జల్లును కురిపించడం వల్ల వాటి రంగులు కలిసిపోయి ఆ పటాలు దోషయుక్తాలౌతున్నాయి. ఈ మేఘాలూ అనాలోచితంగా చేసిన తమ దుందుడుకు పనికి వెంటనే భయపడి పొగను అనుకరిస్తూ చిన్న చిన్న శకలాలుగా మారి కిటికీ రంధ్రాల్లో నుంచి బయటకు వెడుతూ ఉంటాయి.

ఇక్కడ ఈమేఘ కృత్యాన్ని వర్ణించడంలో – దూతీ సహాయంతో రహస్యంగా అంతఃపుర ప్రవేశమొనర్చి అచటి స్త్రీలను వ్యభిచార దోష దూషితులను చేసి, తమ గుట్టు ఎక్కడ బయట పడుతుందో ననే భయంతో మారువేషంతో అక్కడ నుంచి బయటకు వచ్చే జారుని వృత్తాంతం ఇందులో ధ్వనిస్తోందని మల్లినాథ సూరి తమ వ్యాఖ్యానంలో పేర్కొన్నారు. అలం : ఉత్ప్రేక్ష.

**యత్ర స్త్రీణాం ప్రియతమ భుజాలిఙ్గ నోచ్ఛ్వాసితానా -**
**మఙ్గ గ్లానిం సురత జనితాం తన్తు జాలవలమ్బాః।**
**త్వత్సం రోధాపగమ విశదై శ్చన్ద్ర పాదైర్ని శీథే**
**వ్యాలు మ్పన్తి స్ఫుట జలలవస్యన్దిన శ్చన్ద్ర కాన్తాః॥** 7

**పదచ్ఛేదం** : యత్ర, స్త్రీణాం, ప్రియతమభుజ, ఆలింగన, ఉచ్ఛ్వాసితానాం, అంగగ్లానిం, సురతజనితాం, తంతుజాల, అవలంబాః, త్వత్, సంరోధ, అపగమ, విశదైః, చంద్ర పాదైః, నిశీథే, వ్యాలుంపంతి, స్ఫుట, జలలవస్యందినః, చంద్ర కాంతాః.

**ఐతిహ్యం** : కుబేరుడు కళింగ దేశాధీశుడైన అరిందముడనే రాజుకి దముడు అనే పేరుతో పుట్టి రాజ్యం చేసేడు. కాశీపుర నాథుడైన విశ్వేశ్వరు నారాధించి పార్వతీ పరమేశ్వరుల ప్రసన్నం చేసికొన్నాడు. ఈశు తేజము చూడగల శక్తిని పొందిన దముడు జగన్మాత పార్వతిని చూచి మోహం పొందగా శాపగ్రస్తుడై కన్నుపగిలి, తిరిగి తపస్సు చేసి భగవత్కృపచేత దృష్టిపొందేడు. శివుడా తనికి పరమ మనోహరమైన అలకాపట్టణాన్ని, ఉత్తరదిశకాధిపత్యాన్ని ఇచ్చి ఆదరించాడు. ఇది శివపురాణ కథ. అలం : ఉదాత్తం.

**గత్యుత్కమ్పాదలకపతితైర్యత్రమన్దారపుష్పైః**<br>
**పత్రచ్ఛేదైః కనక కమలైః కర్ణ విభ్రంశిభిశ్చ ।**<br>
**ముక్తాజాలైః స్తన పరిసర చ్ఛిన్న సూత్రైశ్చ హారై -**<br>
**ర్నైశోమార్గః సవితురుదయే సూచ్యతే కామినీనామ్ ॥** 9

**పదచ్ఛేదం** : గతి + ఉత్కంపాత్, అలకపతితైః, యత్ర, మందారపుష్పైః, పత్రచ్ఛేదైః, కనకకమలైః, కర్ణ, విభ్రంశిభిః, చ, ముక్తాజాలైః, స్తనపరిసర ఛిన్న సూత్రైః, చ, నైశః, మార్గః, సవితుః, ఉదయే, సూచ్యతే, కామినీ నామ్.

**అన్వయం** : యత్ర, కామినానాం, నైశః, మార్గః, సవితుః, ఉదయే, గతి + ఉత్కమ్పాత్, అలకపతితైః, మందార పుష్పైః, పత్రచ్ఛేదైః, కర్ణ విభ్రంశిభిః, కనక కమలైః, ముక్తాజాలైః, స్తనపరిసరచ్ఛిన్న సూత్రైః, హారైః, చ, సూచ్యతే.

**ప్రతిపదార్థం** : యత్ర = ఏ అలకాపట్టణమున; కామినీనాం = స్త్రీల యొక్క(ఉపపతుల యందనురక్తులైన; అభిసారికల); నైశః, మార్గః = రాత్రులయందు(పోయిన) మార్గము; సవితుః, ఉదయే(సతి) = సూర్యోదయమందు; గతి + ఉత్కమ్పాత్ = ఉత్కంఠతో కూడిన నడకల వలన; అలకపతితైః = ముంగురులనుండి (జారి) పడిన; మందార పుష్పైః = మందార కుసుమముల చేతను; పత్రచ్ఛేదైః = మకరికా పత్రముల తుంపులచేతను; కర్ణ, విభ్రంశిభిః = చెవులనుండి జారిన; కనక కమలైః = స్వర్ణ కమలముల చేతను; ముక్తాజాలైః = ముత్యాల సరముల చేతను; స్తన పరిసర ఛిన్న సూత్రైః హారైః, చ = వక్షస్థల ప్రదేశమునుండి తెగిన దారములతో కూడిన హారముల చేతను; సూచ్యతే = సూచింపబడుచున్నదో(ది).

**తాత్పర్యం** : ఏ అలకాపట్టణంలో అభిసారికలు రాత్రులయందు సంచరించిన మార్గము సూర్యోదయా నంతరం వారి ఉత్కంఠతో కూడిన నడకలవలన ముంగురుల నుండి జారిన కల్ప వృక్షప్రసూనముల చేతను, మకరికాపత్ర ఖండముల చేతను, చెవినుండి

**అక్షయ్యాన్తర్భవన నిధయః ప్రత్యహం రక్తకణ్ఠై -**
**రుద్గాయ ద్భిర్ధన పతియశః కిం నరైర్య త్ర సార్థమ్ ।**
**వైభ్రాజాఖ్యం విబుధవనితా వారముఖ్యా సహాయా**
**బద్ధాలాపా బహిరుపవనం కామినో నిర్విశన్తి ॥** 8

**పదచ్ఛేదం :** అక్షయ్యా, అంతర్ భవన నిధయః, ప్రత్యహం, రక్తకంఠైః, ఉద్గాయద్భిః, ధనపతియశః, కిం నరైః, యత్ర, సార్థమ్ వైభ్రాజ ఆఖ్యం, విబుధ వనితాః, వారముఖ్యా సహాయాః, బద్ధాలాపాః, బహిః, ఉపవనం, కామినః, నిర్విశన్తి.

**అన్వయం :** యత్ర, అక్షయ్య అంతర్భవన నిధయః, విబుధవనితా వారముఖ్యాః, సహాయాః, బద్ధ+ ఆలాపాః, కామినః, ప్రత్యహం, రక్త కంఠైః, ధనపతియశః, ఉద్గాయద్భిః, కిన్నరైః, సార్థం, వైభ్రాజ, ఆఖ్యం, బహిః ఉపవనం, నిర్విశంతి.

**ప్రతిపదార్థం :** యత్ర = ఏ అలకానగరమున; అక్షయ్య అంతర్భవన విధయః = తరగని గృహ సంపదలు కలిగి; విబుధ వార ముఖ్యాః, సహాయాః = అప్సరోవార వనితలతోకూడి; బద్ధాలాపాః కామినః = ప్రతి దినము అనురాగ పూరిత గాత్రములతో; ధనపతియశః, ఉద్గాయద్భిః = కుబేరుని కీర్తిని గానము చేయుచున్నవారై; కిన్నరైః సార్థం = కిన్నెరులతో కలిసి; వైభ్రాజ ఆఖ్యం = ఆవైభ్రాజ్యము అను పేరుగల ; బహిః ఉపవనం = పట్టణమునకు వెలుపల నున్న ఉద్యానవనములలో నిర్విశన్తి = అనుభవించుచున్నారో. (రు)

**తాత్పర్యం :** ఏ అలకానగరం తఱిగిపోని గృహసంపదలతో తులతూగుతూ ఉంటుందో కాముకులు అప్సర వారవనితల సరస సల్లాపాలతో మునిగి తేలుతూ, అనురాగ పూరితమైన గాత్రాలతో కుబేరుని కీర్తి గానంచేస్తూ ఉంటారో, కిన్నెరులతో కలసి 'వైభ్రాజ' మనే పేరుతో ఉన్న నగర బాహ్యోద్యాన శోభనను భవిస్తూ ఉంటారో ....(12వ శ్లోకంతో అన్వయం)

**'శ్రీకళా' వ్యాఖ్య :** అలకాపురిలో సంపదల కెవరికీ లోటులేదు. అక్షయ మైన సంపద. అప్సర స్త్రీలైన వార వనితలతో సరస సల్లాపాలు వారిదైనందిన జీవితంలో ఒక భాగం. కుబేరుని ఉద్యానవనం పేరు 'చైత్రరథం'. 'వైభ్రాజ' మనేది ఈ చైత్ర రథానికే నామాంతరం. కనుక వారు ఆ ఉద్యాన వనాల్లో విహరిస్తూ కుబేరుని కీర్తిని గానం చేస్తున్నారు. వారి సుమనోహర గాత్రాలతో, గానం చేసే విధానం 'ఉద్గాయద్భిః' అనడం వలన గాంధార గ్రామ ప్రాయమైతారతరం– మిక్కిలి తారస్థాయిలో పాడుతున్నారని మల్లినాథుని వివరణ. కనుక ఆప్రదేశంలో 'ఆనందం' తప్ప వేఱొక స్థితికి తావులేదని భావం.

ప్రహితనయనైః, కామిలక్ష్యేషు, అమోఘైః, చతురవనితా విభ్రమైః, ఏవ, సిద్ధః.

**ప్రతిపదార్థం** : యత్ర మన్మథః= ఏ అలకాపురిలోనైతే మన్మథుడు; ధనపతి సఖం, దేవం= కుబేరుని మిత్రుడైన శివుని; సాక్షాత్, వసంతం, మత్వా = కంటికి కనిపించెడి రూపధారిగా తలచి; భయాత్= భయముతో; షట్పదజ్యం, చాపం= తుమ్మెదలు వింటి నారిగా కల ధనుస్సును; ప్రాయః= సాధారణముగా; న, వహతి= పట్టుకొన(డో)డు; తస్య, ఆరంభః= ఆమన్మథకృత్యము; సభ్రూభంగం, ప్రహితనయనైః= కనుబొమల ముడితో కూడిన దృక్ప్రసారముచే; కామిలక్ష్యేషు = కాముకులు లక్ష్యముగా గలవై; అమోఘైః= వ్యర్థముకాని; చతురవనితావిభ్రమైః, ఏవ= నిపుణలైన యువతుల విలాసము చేతనే; సిద్ధః =నెఱవేరునో(ను).

**'శ్రీకళా వ్యాఖ్య'** : అలకాపురిలో మన్మథుడు తనంతతానుగా వచ్చి తన పనిని చేయడు. అతని పని యువతీ యువకులకు శృంగారాభిలాష కలిగించడం. ఎందుకని చేయడు? అది ధనపతి నగరం. శివుడు కుబేరుని మిత్రుడు. కనుక ఆ శివుడిక్కడే శరీరధారియై ఉంటాడని భయం. శివుని ప్రతాపం పూర్వం ఒకసారి అతనికి అనుభవైక వేద్యమే. ఆ భయంతో తుమ్మెదపంక్తి వింటి నారిగా కల తన ధనుస్సును ధరించడు. ఇంతగా శృంగార భూమియైన ఇక్కడ మరి అతని ప్రమేయం లేక పోతే ఎలా? ఆయన పనెలా అవుతుందంటే అచ్చటి యువతుల చూపులతోనే మన్మథకృత్యం జరుగుతోందని కాళిదాసు భావన. అచటి స్త్రీలు తమ కనుబొమల్ని ముడిస్తే మన్మథబాణం ఎక్కుపెట్టినట్లుంటుందట! కనుబొమలు నలుపు, తుమ్మెదల బారు నలుపు. వారి చూపులే మన్మథ తూపులు. అవి ఒకరిపై ప్రసరిస్తే ఎప్పుడూ విఫలం కావు. అంటే అక్కడి స్త్రీల చూపులముందు మన్మథ తూపు కూడా ఏమాత్రం సరికాదని భావం. అలం: సంకరం.

**వాసశ్చిత్రం మధునయనయోర్విభ్రమాదేశదక్షం**
**పుష్పోద్భేదం సహకిసలయైర్భూషణానాం వికల్పాన్ ।**
**లాక్షారాగం చరణకమలన్యాసయోగ్యం చయస్యా -**
**మేకః సూతే సకలమబలామణ్డనం కల్పవృక్షః ॥** 11

**పదచ్ఛేదం** : వాసః, చిత్రం, మధు, నయనయోః, విభ్రమాదేశదక్షం, పుష్పోద్భేదం, సహ, కిసలయైః, భూషణానాం, వికల్పాన్, లాక్షారాగం, చరణకమలన్యాసయోగ్యం, చ, యస్యాం, ఏకః, సూతే, సకలం, అబలామండనం, కల్పవృక్షః.

జారిన స్వర్ణ కమలముల చేత, ముత్యాల సరముల చేత, వక్ష స్థల ప్రదేశము నుండి దారము తెగుటచేత పడిన హారములచేతను గుర్తించుటకు వీలగుచున్నదో(ది).

**'శ్రీకళా' వ్యాఖ్య:** భౌతిక జీవిత సర్వస్వమన దగిన శృంగారానుభవం అలకాపురిలో స్త్రీ పురుషులకు సమానంగానే ఉంది. ముందు శ్లోకాల్లో పురుషుల వృత్తాన్ని వర్ణించి ఈ శ్లోకంలో స్త్రీల ప్రవృత్తినిచెబుతున్నాడు కాళిదాసు. ఇక్కడ గ్రహించవలసిన ప్రధానమైన విషయం ఏమంటే - పురుషుల ఏకపత్నీత్వంగాని, స్త్రీల పాతి వ్రత్యంకాని ఇచ్ఛాధీనమైనవే కాని కృత్రిమమైనవి కావు. ఎందుకంటే యక్షుడు ఏక పత్నీ వ్రతుడు కాకపోతే తన భార్యకు సందేశం పంపవలసిన అవసరం లేదు. ఈ శ్లోకంలో వర్ణించినదాన్ని బట్టి అచటి స్త్రీలంతా నీతి నియమాలు లేని స్వైరిణులని కాదు. అచటి సమాజం నైతిక సూత్రాలతో కృత్రిమ నిర్బంధంలో లేదనే విషయాన్ని మాత్రమే మనం గుర్తించాలి.

అభిసారికలైన నాయికలు తమ ప్రియుల సంకేత స్థలాలకో, నివేశన గృహాలకో వెళ్ళిన త్రోవ సూర్యోదయానంతరం ప్రస్ఫుటమైన కొన్ని గుర్తుల చేత అనుమీయు మానవౌతుందట! దేవ పారిజాతాలు (మందార పుష్పాలు) అద్దుకొన్నారు. ప్రియావిరహంతో ఉత్కంఠతో నడచిన వేగానికి ఇవి జారి మార్గంలో పడ్డాయి. అలాగే చెవిన ధరించిన స్వర్ణ కమలాలు, ముత్యాల సరాలు, సందర్భాన్ని బట్టి మెడకి దగ్గరగా ధరించినవని ఊహించాలి. వక్షస్థలం వరకు జారిన హారాలు కఠిన వక్షోజ స్పర్శతో దారాలు తెగిపోగా, తెగిన దారాలతో హారాలు మార్గంలో కనిపిస్తున్నాయి. కనుక గత రాత్రి అభిసారికలీ మార్గంలో ప్రియాసంగమానికై వెళ్ళేరనేది అనుమీయమానమౌతోంది. అలం : అనుమానం.

**మత్వాదేవం ధనపతి సఖం యత్రసాక్షాద్వసన్తం**
**ప్రాయశ్చాపం నవహతి భయాన్మన్మథః షట్పదజ్యమ్ ।**
**సభ్రూభఙ్గ ప్రహితనయనైః కామిలక్ష్యేష్వమోఘై**
**స్తస్యారమ్భశ్చతుర వనితా విభ్రమైరేవ సిద్ధః ॥** **10**

**పదచ్ఛేదం:** మత్వా, దేవం, ధనపతి సఖం, యత్ర, సాక్షాత్, వసంతం, ప్రాయః, చాపం, న, వహతి, భూయాత్, మన్మథః, షట్పదజ్యం, సభ్రూభంగ ప్రహితనయనైః, కామిలక్ష్యేషు, అమోఘైః, తస్య, ఆరంభః, చతురవనితా విభ్రమైః, ఏవ, సిద్ధః.

**అన్వయం :** యత్ర, మన్మథః, ధనపతి సఖం, దేవం, సాక్షాత్ వసంతం, మత్వా, భయాత్, షట్పదజ్యం, చాపం, ప్రాయః, న, వహతి, తస్య, ఆరంభః, సభ్రూభంగ

**తత్రాగారం ధనపతి గృహానుత్తరేణాస్మదీయం**
**దూరాల్లక్ష్యం సురపతిధనుశ్చారుణాతోరణేన ।**
**యస్యోపాన్తే కృతకతనయః కాన్తయావర్ధితోమే**
**హస్తప్రాప్యస్తబక నమితో బాలమన్దార వృక్షః ॥** 12

**పదచ్ఛేదం :** తత్ర, ఆగారం, ధనపతి, గృహాన్, ఉత్తరేణ, అస్మదీయం, దూరాత్, లక్ష్యం, సురపతి, ధనుః, చారుణా, తోరణేన, యస్య, ఉపాంతే, కృతక తనయః, కాంతయా, వర్ధితః, మే, హస్త ప్రాప్య, స్తబకనమితః, బాలమందార వృక్షః.

**అన్వయం:** తత్ర, ధనపతి గృహాన్ ఉత్తరేణ, ఆగారం, సురపతిధనుశ్చారుణా, తోరణేన, దూరాత్, లక్ష్యం, యస్య, ఉపాంతే, మే, కాంతయా, వర్ధితః, కృతకతనయః, హస్త ప్రాప్య, స్తబకనమితః, బాలమందార వృక్షః.

**ప్రతిపదార్థం :** తత్ర=ఆ అలకాపురిలో; ధనపతి గృహాన్ ఉత్తరేణ=కుబేరుని ఇంటికి ఉత్తరదిశగా; అస్మదీయం, ఆగారం= మా ఇల్లు; సురపతిధనుః చారుణాతోరణేన= అందమైన హరివిల్లు తోరణముతో; దూరాత్ లక్ష్యం= దూరం నుంచే కనిపిస్తుంది. (దూరానికే కనిపిస్తూ ఉంటుంది); యస్య ఉపాన్తే= ఏ ఇంటికి సమీపంగా; మే కాంతయా= నా ప్రేయసిచే; కృతకతనయః వర్ధితః= పెంపుడుకొడుకు వలె పోషణ నొందుచున్న; హస్తప్రాప్యస్తబక నమితః= వంచితే చేతులకందే గుత్తులు కలిగిన; బాలమందార వృక్షః= కల్పవృక్షము (అస్తి= ఉన్నదో – ఇది లోపించింది).

**'శ్రీకళా' వ్యాఖ్య :** 'ఉత్తరమేఘం' ఆరంభం నుంచి 11 శ్లోకాల్లో అలకాపురి శోభనంతా కన్నులపండువుగా మనోనేత్రానికి రూపుకట్టేట్లు వీనులవిందుగా వర్ణించి ఈ శ్లోకంలో తన ఇంటి గుర్తు మేఘునికి చెబుతున్నాడు యక్షుడు. ముందటి 11 శ్లోకాల్లో 'య' చ్ఛబ్దాన్ని ఈ పన్నెండో శ్లోకాన్ని 'త' చ్ఛబ్ద ప్రయోగంతో తీర్చేడు. సంస్కృత భాషారచనలో ఇదొక సొగసు. తెలుగులో ''ఎక్కడైతే .... ఉంటుందో, అక్కడ'' అనే ప్రయోగంతో సమానం. తన ఇంటి గుర్తు చెబుతున్నాడు. కుబేరుని ఇంటికి ఉత్తరదిశగా మా ఇల్లుందన్నాడు. కుబేరుని ఇల్లు ప్రసిద్ధంగా ఉండి ఎవరినీ అడగవలసిన అవసరం లేకుండా చూడడంతోనే తెలుస్తూనే ఉంటుంది. కాదు – తెలియలేదే అనుకున్నా, కుబేరుడి ఇల్లెక్కడని ఎవరినైనా అడిగితే చెప్పలేని వారే ఉండరు. దానికి ఉత్తరంగా వెళ్ళమన్నాడు. ఇంద్రధనుస్సు తోరణంగా కనిపిస్తుందంటే ఇంద్రధనుస్సు ఆకారంగా తోరణం కట్టి అయినా ఉండవచ్చు. లేదా తోరణాకృతి ఏదైనా ఇంద్రధనుస్సులోని రంగులతో దాన్ని అలంకరించైనా ఉండవచ్చు. ఇంటి ముందు చిన్న కల్ప వృవక్షం మొక్క

**అన్వయం :** యస్యాం, చిత్రం, వాసః, నయనయోః, విభ్రమ ఆదేశదక్షం, మధు, కిసలయైః సహ, పుష్పోద్భేదం, భూషణానాం, వికల్పాన్, చరణకమలన్యాసయోగ్యం, లాక్షారాగం, సకలం, అబలామండనం, ఏకః, కల్పవృక్షః, సూతే.

**ప్రతిపదార్థం:** యస్యాం చిత్రం వాసః= ఏ అలకాపట్టణమున అనేక రంగుల వస్త్రములును; నయనయోఃవిభ్రమ ఆదేశ దక్షంమధు= కనుగవకు విలాసములనేర్పుటకు తగిన మద్యమును; కిసలయైః సహ పుష్పోద్భేదం = చిగుళ్లతో ప్రసూనోదయమును; భూషణానాం వికల్పాన్= ఆభరణములలోని భేదములును; చరణ కమలన్యాసయోగ్యం లాక్షారాగం= పాదపద్మములయందుంచతగిన ఎఱ్ఱని లత్తుక రసమును; అబలాజన మండనం సకలం= స్త్రీల అలంకారములన్నియు; ఏకః, కల్పవృక్షః, సూతే= ఒక్క కల్పవృక్షమే ఉత్పాదించుచున్నది.

**తాత్పర్యం :** ఏ అలకాపట్టణంలో అనేక రంగుల వస్త్రాలు, కనుగవకు విలాసములు నేర్పుటకు సమర్థమైన మద్యం, చిగుళ్ళతో ప్రసూనోదయం, వివిధ ఆభరణాలు, పాదపద్మాలంకరణోపయుక్తమగు ఎఱ్ఱనిలత్తుక - స్త్రీల అలంకారాలన్నిటినీ ఒక్క కల్పవృక్షమే ఉత్పాదిస్తోందో (ది).

'శ్రీకళా' వ్యాఖ్య : ***''కచధార్యం దేహధార్యం పరిధేయం విలేపనం |***
***చతుర్థా భూషణం ప్రాహుః స్త్రీణామన్యచ్చదైశికమ్ ||***

అని స్త్రీల అలంకారాలు తలపై ధరించేవి (కచధార్యం) శరీరంపై ధరించేవి (దేహధార్యం), ఆచ్ఛాదన యోగ్యమైనవి (పరిధేయం) ఒంటిపై పూసికొనేవి (విలేపనం) అని నాలుగు విధాలుగా చెబుతారు. ఈ క్రమంలో కాకపోయినా ఈ నాల్గింటినీ కాళిదాసీ శ్లోకంలో వర్ణించేడు. దీనిలో వస్త్రాలు పరిధేయ తెగకు చెందినవైతే మద్యం దేహధార్య తెగకు చెందుతుంది. ధరించేది కాకపోయినా నేత్రద్వయానికి విలాసాన్నిచ్చేది కనుక దీన్ని ఈ కోవలో పరిగణించవచ్చు. చిగుళ్ళు, పుష్పాలు కచధార్యాలు. ఆభరణాలు సరిగా దేహధార్యలౌతాయి. లత్తుక పాదవిలేపన విశేషం. వీటన్నిటినీ ఒక్క కల్పవృక్షమే ప్రసాదించడం వలన ఏతద్వస్తు సేకరణ శ్రమ అచటి స్త్రీలకు తొలగిస్తోంది. అలం: సంకరం.

హంసలు నిన్ను చూచి కూడా (వర్షాకాలం వస్తోంది, నీరు బురద అవుతుంది అని) బెంగలేక సమీపంలో వున్న మానస సరోవరాన్ని (సైతం) తలపవు.

**'శ్రీకళా' వ్యాఖ్య :** సాధారణంగా ఇళ్ళలో ఉండేవి నూతులు. బహిరంగ ప్రదేశాల్లో సర్వజనోపయోగార్థం త్రవ్వించేవి బావులు, అంటే దిగుడు బావులు. నూతికి, బావికీ తేడా ఇది, మనం సమానార్థ పదాలుగానే వాడుతున్నా. ''నుత జలపూరితంబులగు నూతులు నూరిటి కంటె, సూనృత వ్రత యొక బావిమేలు'' అని నన్నయ్యగారి ప్రయోగం. ఆ దిగుడుబావి లోపలికి మెట్ల వెంట దిగి నీరు పట్టుకొంటూ ఉంటారు. ఆమెట్లు యక్షుని ఇంటి వద్ద నున్న బావికి మరకతమణి శిలలతో నిర్మించేరట! ఆబావి స్వర్ణ కమలాలతో నిండి ఉంది. ఆస్వర్ణకమలాల తూళ్ళ (కాడలు) వైడూర్యమణి వికారాలట! అందులో హంసలు నివసిస్తున్నాయి. మేఘుని చూచికూడా '' అయ్యో! వర్షాకాలం వస్తోంది. నీరంతా బురదై పోతుంది'' అని చీకూ చింతాలేకుండా సమీపంలోనే ఉన్న మానససరోవరాన్ని కూడా స్మరించవట! అంటే వర్షాకాలంలో సైతం ఆ బావిలోని నీరు పంక కలుషితం కాదని భావం! యక్షుడు తన ఇంటి గుర్తు చెప్పడంలో సైతం మేఘుని ఆకర్షించే పద్ధతిలో చెబుతున్నాడు. ఇంత అందమైన బావిని చూడడానికైనా మేఘుడు యక్షుని ఇల్లు వెతుక్కుంటూవెడతాడు. అలం: ఉదాత్తం.

**తస్యాస్తీరే రచిత శిఖరః పేశలైరిన్ద్రనీలైః**
**క్రీడాశైలః కనకకదలీ వేష్టన ప్రేక్షణీయః ।**
**మద్గేహిన్యాః ప్రియ ఇతిసఖే చేతసాకాతరేణ**
**ప్రేక్ష్యోపాన్త స్ఫురిత తడితం త్వాం త మేవ స్మరామి ॥** **14**

**పదచ్ఛేదం:** తస్యాః, తీరే, రచితశిఖరం, పేశలైః, ఇంద్రనీలైః, క్రీడాశైలః, కనకకదలీవేష్టన ప్రేక్షణీయః, మత్, గేహిన్యాః, ప్రియ, ఇతి, సఖే, చేతసా, కాతరేణ, ప్రేక్ష్య, ఉపాంతస్ఫురిత తడితం, త్వాం, తం, ఏవ, స్మరామి.

**అన్వయం:** తస్యాః, తీరే, పేశలైః, ఇంద్రనీలైః, రచిత శిఖరః, కనకకదలీవేష్టనప్రేక్షణీయః, క్రీడాశైలః, (అస్తి) సఖే!, ఉపాంతస్ఫురిత తడితం, త్వాం, ప్రేక్ష్య, మత్గేహిన్యాః, ప్రియ ఇతి, కాతరేణ, చేతసా, తమేవ, స్మరామి.

**ప్రతిపదార్థం:** తస్యాః, తీరే=ఆదిగుడుబావి గట్టున; పేశలైః, ఇంద్రనీలైః, రచిత, శిఖరః = సుందరమైన ఇంద్రనీలమణులు పొదిగిన శిఖరములు కల; కనకకదలీవేష్టనప్రేక్షణీయః=

ఉంటుంది. దాన్ని యక్షుని ప్రేయసి పెంపుడు కొడుకులా పోషిస్తూ ఉంటుందని చెబుతున్నాడు. ఈ శ్లోకం నుంచి ఐదు శ్లోకాలూ ఉదాత్తాలంకార శోభితమైనవే.

'స్వభావోక్తి' అలంకారమేమోననే శంక కలుగవచ్చుకాని దీన్ని స్వభావోక్తిగా పరిగణించరాదు. ''**స్వభావోక్తి రసౌచారుయథావద్వస్తువర్ణనమ్**'' – ఉన్నది ఉన్నట్లుగా అందంగా వర్ణించడం స్వభావోక్తి లక్షణమే అయినా ఈ వర్ణన కాళిదాసు చూచి చేసినది కాదు. ఇది కవి ఊహాశక్తి చేత – అంటే ప్రతిభ వలన ఉత్పన్నమైనది. కనుక అలం: ఉదాత్తం.

**వాపీచాస్మిన్మరకత శిలాబద్ధ సోపానమార్గా**
**హేమైశ్ఛన్నా వికచకమలైః స్నిగ్ధవైదూర్యనాలైః।**
**యస్యాస్తోయే కృతవసతయో మానసం సన్నికృష్టం**
**నాధ్యాస్యన్తి వ్యపగత శుచస్త్వామపి ప్రేక్ష్యహంసాః॥ 13**

**పదచ్ఛేదం :** వాపీ, చ, అస్మిన్, మరకతశిలాబద్ధ సోపానమార్గా, హేమైః, ఛన్నా, వికచకమలైః, స్నిగ్ధవైదూర్య – నాలైః, యస్యాః, తోయే, కృతవసతయః, మానసం, సన్నికృష్టం, నా, ధ్యాస్యన్తి, వ్యపగతశుచః, త్వాం, అపి, ప్రేక్ష్య, హంసాః.

**అన్వయం :** అస్మిన్, మరకతశిలాబద్ధ సోపానమార్గా, స్నిగ్ధవైదూర్యనాలైః, హేమైః, వికచక్మలైః, ఛన్నా, వాపీ (అస్తి), యస్యాః, తోయే, కృతవసతయః, హంసాః, త్వాం, ప్రేక్ష్య అపి, వ్యపగతశుచః, సన్నికృష్టం, మానసం, నా, ధ్యాస్యన్తి.

**ప్రతిపదార్థం:** అస్మిన్ = ఆ (మా) ఇంట్లో; మరకతశిలాబద్ధ సోపానమార్గా= మరకతమణులచే కట్టిన మెట్ల మార్గముతో; స్నిగ్ధవైదూర్యనాలైః= మెఱుస్తున్న వైడూర్యమణుల కాడలు కలిగిన; హేమైః వికచకమలైః= వికసించిన స్వర్ణకమలములు; ఛన్నా= కప్పబడి ఉన్న; వాపీ (అస్తి)= (ఏ) దిగుడుబావి (కలదో); యస్యాః = దేనియొక్క (ఏదిగుడు బావి యొక్క); తోయే= జలములయందు; కృతవసతయః, హంసాః= ఆవాసముగా చేసికొనిన హంసలు; త్వాం, ప్రేక్ష్య, అపి= నిన్ను చూచి కూడా; వ్యపగత శుచః= దుఃఖింపనివై; సన్నికృష్టం. మానసం= సమీపములో నున్న మానస సరోవరమును; నా ధ్యాస్యన్తి- తలప(వు)వో!

**తాత్పర్యం :** ఆ మా ఇంటి వద్ద మరకతమణి సోపానాలతో వైడూర్యమణుల తూడులుగా కలిగిన స్వర్ణకమలాలతో నిండు ఒక దిగుడు బావి ఉంటుంది. అందులో నివసించే

**ప్రతిపదార్థం :** అత్ర = ఆక్రీడాశైలమున; కురవకవృతేః= గోరింటలచే ఆవరింపబడిన; మాధవీమండపస్య= మాధవీలతామండపమునకు; ప్రత్యాసన్నౌ = మిక్కిలి సమీపంగా ఉన్న; చలకిసలయః = చలించుచున్న పల్లవములు కల; రక్తాశోకః = ఎఱ్ఱని అశోక వృక్షమును; కాన్తః, కేసరః (స్తః)= అందమైన పొగడ చెట్టును (ఉన్నవి); ఏకః దోహదచ్ఛద్మనా = దోహదమిషచే ఒకటి (రక్తాశోకము); మయా తవ సఖ్యాః = నాతో నీ స్నేహితురాలి; వామపాద అభిలాషీ= ఎడమకాలి (తన్నును) కోరుచున్నది. అన్యః మయాసహఅస్యాః = రెండవదియగు పొగడ వృక్షము నాతో కూడ ఆమె; వదనమదిరాం కాంక్షతి = నోటియందలి మద్యమును కోరుచున్నది.

**తాత్పర్యం :** ఆక్రీడాపర్వతంలో గోరింటలచే ఆవరించి ఉన్న మాధవీలతా మండపానికి అతి దగ్గఱలో పల్లవాలు చలిస్తున్న ఎఱ్ఱని అశోకవృక్షం, అందమైన పొగడ చెట్టూ ఉంటాయి. వాటిలో దోహద క్రియ అనే మిషతో నాతో కూడి ఉన్న సఖిపాదతాడనాన్ని అశోక వృక్షం కోరితే ఆమె నోటి యందలి మద్యాన్ని పొగడ చెట్టు కోరుతోంది.

**'శ్రీకళా' వ్యాఖ్య :** ఆక్రీడాశైలం మీద మాధవీలతామండపం ఉంది. దాన్ని ఆవరించుకొని గోరింట పొదలున్నాయి. ఎఱ్ఱని అశోక వృక్షం చలిస్తున్న పల్లవాలతో చూడముచ్చటగా ఉంది. పొగడచెట్టు కూడా ఆసమీపంలోనే ఉంది. అకాలంలో వృక్షాలు పుష్పించడానికీ, ఏకారణంచేతనైనా పూతకు అవరోధం కలిగితే వాటిని సక్రమంగా పుష్పింపజేయడానికి 'దోహద' క్రియలనేవి ప్రసిద్ధంగా ఉన్నాయి. ఒక్కొక్క జాతి వృక్షానికి ఒక్కొక్క దోహద క్రియ ప్రసిద్ధం. పద్మినీజాతి స్త్రీ భర్తతో కలిసి సర్వాంగ సుందరంగా అలంకరించుకొని తన ఎడమ కాలితో అశోక వృక్షాన్ని తంతే అశోకవృక్షం పుష్పిస్తుందట! అలాగే మద్యం పుక్కిలించి ఉమ్మితే పొగడచెట్టు పుష్పిస్తుంది. ఎఱ్ఱ గోరింటకు కావలసిన దోహదక్రియ ఉత్తమ జాతి స్త్రీ ఆలింగనం. యౌవనవతియైన స్త్రీ దానిమ్మ చెట్టు క్రింద నుంచొని నవ్వితే దానిమ్మ పూస్తుందని మల్లినాథ సూరి గ్రంథాతర ప్రమాణాన్ని తన వ్యాఖ్యానంలో పేర్కొన్నాడు.

*" అశోక వకులయోః స్త్రీపాద తాడనం గణ్డూషమదిరాచ దోహద ఇతిప్రసిద్ధః"*

*" స్త్రీణాం స్పర్శాత్ప్రియఙ్గుర్వికసిత వకులః సీధుగణ్డూషసేకా*
*త్పాదాఘాతాదశోకస్తిలక కురవకౌవీక్షణాలిఙ్గనాభ్యామ్ ।*
*మన్దారో నర్మవాక్యాత్పటు మృదుహసనాచ్చమ్పకోవక్త్రవాతా*
*చ్చూతోగీతాన్న మేరుర్వికసతి చపురోనర్తనాత్కర్ణికారః ॥ "*

ఈ శ్లోకంలో మరో సొగసు ఏమంటే ఆవృక్షాలతోపాటు నేనూ ఆమె నుండి

బంగారు అరటి ఆవరణలచే దర్శనీయమైన; క్రీడాపర్వతః (అస్తి)= క్రీడాపర్వతము (కలదు); (హే) సఖే!= (ఓ) మిత్రమా!; ఉపాంత స్ఫురిత తడితం, త్వాం= అపాంగములందు దీప్త సౌదామినీయుక్తమైన నిన్ను; ప్రేక్ష్య= చూచి; మత్గేహిన్యాః ప్రియ ఇతి= నాగృహిణికి ఇష్టమైనదనుకారణము చేత; కాతరేణ చేతసా= భీతినొందిన మనస్సుతో; తం, ఏవ, స్మరామి= (ఆక్రీడాశైలమునే) దానినే తలచుకొనుచుంటిని.

**తాత్పర్యం :** ఆదిగుడుబావి గట్టుపై సుందర ఇంద్రనీలమణి స్థగిత శృంగయుక్తములైన స్వర్ణరంభావరణలతో క్రీడాపర్వతమున్నది. మిత్రమా! అపాంగదీప్త సౌదామినీ యుక్తుడవైన నిన్ను చూచి నాగృహిణికి ప్రియమైన కారణం వలన భీతమనస్కుడనై ఆక్రీడాపర్వతాన్నే భావిస్తున్నాను.

**'శ్రీకళా' వ్యాఖ్య :** ప్రణయభావోద్దీపన కారకమైన ఇంద్రనీలమణి విభ్రాజితమైన క్రీడాపర్వతము గూర్చి విరహుడు యక్షుడు మేఘునికి చెబుతున్నాడు. సరససల్లాప కార్యకలాపాలు గుర్తురాగా తన భామిని మీది రాగం ఆ క్రీడావనాన్ని గుర్తుచేసింది. పార్వతీ పరమేశ్వరుల రహస్య క్రీడావనం 'కుమారవనా'న్ని తలపింపచేస్తుందీ పోకడ. బంగారపు అరటితో స్త్రీల తొడలకు పోలిక. ఇంద్రనీల మణి శిఖరాలున్న క్రీడా పర్వతం చుట్టుకొని స్వర్ణకదళి విద్యుల్లతలాసిభాంచింది, మెఱుపు మేఘము కూడిన భాతి. మేఘుని ఆతని ప్రియభామిని తటిల్లతని చూచి తనమనస్సు తన ప్రియురాలియందు మగ్నమవుతున్నదని తెలియజేస్తున్నాడు. ఇంద్రనీల శిఖరాలు నీవలెను, బంగారపు టరంట్లు నీప్రియురాలి వలె ఉన్నవని ప్రస్తుతిస్తున్నాడు. అలం: ఉదాత్తం.

**రక్తాశోకశ్చలకిసలయః కేసరశ్చాత్రకాన్తః**
**ప్రత్యాసన్నౌకురవకవృతే ర్మాధవీ మణ్డపస్య।**
**ఏకః సఖ్యాస్తవ సహమయా వామపాదాభిలాషీ**
**కాఙ్క్షత్యన్యో వదనమదిరాం దోహదచ్ఛద్మనాస్యాః॥** **15**

**పదచ్ఛేదం :** రక్తాశోకః, చలత్, కిసలయః, కేసరః, చ, అత్ర, కాంతః, ప్రత్యాసన్నౌ, కురవకవృతేః, మాధవీమండపస్య, ఏకః, సఖ్యాః, తవ, సహ, మయా, వామపాదాభిలాషీ, కాంక్షతి, అన్యః, వదనమదిరాం, దోహదచ్ఛద్మనా, అస్యాః.

**అన్వయం:** అత్ర, కురవకవృతే, మాధవీమండపస్య, ప్రత్యాసన్నే, చలకిసలయః, రక్తాశోకః, కాంతః, కేసరః, (స్తః), ఏకః, దోహదచ్ఛద్మనా, మయా, తవ, సఖ్యాః, వామపాదాభిలాషీ అన్యః, మయాసహ, అస్యాః, వదనమదిరాం, కాంక్షతి.

**'శ్రీకళా' వ్యాఖ్య:** యక్షుడు తన ఇంటికి గుర్తులు చెబుతున్నాడు. అశోక వృక్షం – వకుళ వృక్షాల మధ్య పక్షులు నిల్చుటకు వీలుగా బంగారంతో కట్టి ఉంటుంది. దాన్ని అధిరోహించడానికి స్ఫటికమణిమయ పీఠం. దానిమూలంలో మణులను తాపడం చేసేరు. పెంపుడు జంతువులకే ఇంతభోగమైతే అచటి వ్యక్తుల భోగం ఊహ్యమే కాని వర్ణనాతీతమన్నమాట! అక్కడ నెమలితో సాయంకాలవేళల్లో యక్షుని ప్రేయసి నృత్యం చేయిస్తుంది. ఆ నృత్యంలోని సంగీతానికి తాళం ఆమె కంకణ ధ్వనులే. ఆ నృత్యం అయిన తర్వాత నెమలి ఆ సువర్ణయష్టిపై విశ్రమిస్తుందట! అలం: ఉదాత్తం.

**ఏభిః సాధో హృదయనిహితైర్లక్షణైర్లక్షయేథా**
**ద్వారోపాన్తే లిఖిత వపుషౌ శఙ్ఖపద్మౌ చ దృష్ట్వా ।**
**క్షామచ్ఛాయం భవన మధునా మద్వియోగేన నూనం**
**సూర్యాపాయే నఖలు కమలం పుష్యతిస్వామభిఖ్యామ్ ॥ 17**

**పదచ్ఛేదం :** ఏభిః, సాధో, హృదయనిహితైః, లక్షణైః, లక్షయేథాః, ద్వార+ఉపాంతే, లిఖితవపుషౌ, శంఖపద్మౌ, చ, దృష్ట్వా, క్షామచ్ఛాయం, భవనం, అధునా, మత్, వియోగేన, నూనం, సూర్యాపాయే, న, ఖలు, కమలం, పుష్యతి, స్వాం, అభిఖ్యామ్.

**అన్వయం :** సాధో, హృదయనిహితైః, ఏభిః, లక్షణైః, ద్వారోపాంతే, లిఖితవపుషౌ, శంఖపద్మౌచ, దృష్ట్వా, చ, నూనం, అధునా, మత్, వియోగేన, క్షామచ్ఛాయం, భవనం, లక్షయేథాః, సూర్యాపాయే, కమలం, స్వాం, అభిఖ్యాం, న, పుష్యతి, ఖలు.

**ప్రతిపదార్థం:** సాధో= ఓ సత్పురుషుడా (మేఘమా); హృదయనిహితైః, ఏభిః, లక్షణైః= మనసులో భద్రపఱచుకొన్న ఈ లక్షణములచేత; ద్వార, ఉపాంతే, లిఖిత వపుషౌ= ద్వార సమీపమున చిత్రితములైన; శంఖ పద్మౌచ దృష్ట్వా చ = శంఖపద్మములను చూచియు; నూనం, అధునా= నిశ్చయముగానిప్పుడు; మత్ వియోగేన= నా విరహముచే; క్షామచ్ఛాయం= కాంతివిహీనమైన; భవనం, లక్షయేథాః= (నా) ఇంటిని గుర్తించగలవు. సూర్యాపాయే= సూర్యాస్తమయమున; కమలం= పద్మము; స్వాం, అభిఖ్యాం= స్వీయకళను; న పుష్యతిఖలు= పెంపొదించుకొనదు కదా!

**తాత్పర్యం :** ఓ మేఘుడా ! మనసు నందు పదిలపఱచుకొనిన ఈ లక్షణముల చేతను, ద్వారమునకిరుపార్శ్వములయందు చిత్రితములైన శంఖ పద్మముల చేతను నా ఎడబాటుచే కాంతిహీనమైన (నా) ఇంటిని గుర్తిస్తావు. సూర్యుడు లేని సమయంలో పద్మం స్వీయకళను

ఆదోహదాన్ని అపేక్షిస్తున్నానని యక్షుడు సూచిస్తున్నాడు. ప్రియురాలి పాదతాడనం, ఆమె పానం చేస్తున్న మద్యాన్ని ఆమె నోటి నుండే స్వీకరించడం శృంగారానికి శేఖరీభూతమైన విషయం. 'పారిజాతాపహరణ' ప్రబంధంలో శ్రీకృష్ణుడు సత్యభామా వామపాదతాడనాన్ని సరసంగా స్వీకరించినట్లు నంది తిమ్మన్న అభివర్ణించేడు. అలం: ఉదాత్తం.

**తన్మధ్యేచ స్ఫటికఫలకా కాఞ్చనీవాసయష్టి -**
**ర్మూలే బద్ధామణిభిరనతి ప్రౌఢవంశప్రకాశైః।**
**తాలైః శిఞ్జావలయసుభగైర్నర్తితః కాన్తయామే**
**యామధ్యాస్తే దివసవిగమే నీలకణ్ఠః సుహృద్వః॥** **16**

**పదచ్ఛేదం:** తత్, మధ్యేచ, స్ఫటికఫలకాకాంచనీవాసయష్టిః, మూలే, బద్ధా, మణిభిః, అవతిప్రౌఢవంశప్రకాశైః, తాలైః, శింజావలయ సుభగైః, నర్తితః, కాంతయా, మే, యా, మధ్యాః, తే, దివసవిగమే, నీలకంఠః, సుహృత్, వః.

**అన్వయం :** తత్, మధ్యే, చ, అనతిప్రౌఢవంశప్రకాశైః, మణిభిః, మూలే, బద్ధా, స్ఫటికఫలకా కాంచనీవాసయష్టిః, (అస్తి) శింజావలయసుభగైః, తాలైః, మే, కాంతయా, నర్తితః, వః, సుహృత్, నీలకంఠః, దివసవిగమే, యాం, అధ్యాస్తే.

**ప్రతిపదార్థం :** తత్ మధ్యేచ= వాటి మధ్యలో; అనతిప్రౌఢవంశప్రకాశైః= లేత వెదురుకాంతితో; మణిభిః, మూలే, బద్ధా= మణులు మూలములందుంచి కట్టిన; స్ఫటిక ఫలకా= స్ఫటికముల పీటనమర్చిన; కాంచనీవాసయష్టిః (అస్తి)= బంగారు కట్టులు (పక్షులు నిల్చుటకు వీలైనది) (కలదు); శింజావలయసుభగైః తాలైః= వీనులకు విందగు హస్తకంకణధ్వనులను తాళధ్వనులతో; మే, కాన్తయా, నర్తితః= నా ప్రేయసి చేత నృత్యమొనర్పబడిన; వః సుహృత్, నీలకణ్ఠః= మీ (మేఘముల) నెచ్చెలియగు నెమలి; దివసవిగమే= సాయం సంధ్యలో; యాం అధ్యాస్తే= ఏ ఆవాసయష్టినధిరోహించునో.

**తాత్పర్యం :** (అవృక్ష మధ్యంలో) వాటి మధ్యలో లేత వెదురుకాంతితో మణులు మూలములందుంచి కట్టిన స్ఫటిక పీఠం అమర్చిన సువర్ణయష్టి (కట్టు) కలదు. వీనులకు విందైన కంకణధ్వనులనే తాళంతో నా ప్రేయసి మీ నెచ్చెలియైన నెమలితో నృత్యం చేయిస్తుంది. ఆనెమలి సాయం సంధ్యావేళలో ఏసువర్ణయష్టినధిరోహిస్తుందో (అదే మా ఇల్లు).

విలసితనిభాం= మిణుగురు పురుగుల కాంతితో సమానమైన; విద్యుత్ ఉన్మేషదృష్టిం= మెఱపుల ప్రకాశమనెడి చూపులతో; అన్తర్భవన పతితాం= ఇంటిలో పడునట్లుగా; కర్తుం, అర్హసి= చేయదగుదవు.

**తాత్పర్యం:** వెంటనే ప్రవేశించే కారణంగా అప్పుడే గున్న ఏనుగంతటి స్వరూపాన్ని పొంది పూర్వోక్తమైన అందమైన చరియలతో నున్న క్రీడాపర్వతంపై ఉపవిష్టుడవై స్వల్పంగా ప్రకాశించు మిణుగురు పురుగుల కాంతితో సమానమైన మెఱపుల ప్రకాశమనే చూపులు ఇంట్లో ప్రసరింపచేయుతగుదువు.

**శ్రీకళా' వ్యాఖ్య:** మేఘుడు ఎలాగైతేనే యక్షుని ఇల్లు చేరిన తర్వాత తన సంపూర్ణదేహంతో ఇంట్లో ప్రవేశించడం కుదరదు కనుక గృహప్రవేశానురూపమైన రూపాన్ని పొందాలి. ఆయన కామరూపుడు కనుక యథేచ్ఛారూపాన్ని పొందగలడు. క్రీడాపర్వతం యక్షుని ఇంట్లో బావి వద్ద ఉందని చెప్పేడు. ఆకాశం నుంచి క్రిందకి దిగడానికి అదెంతో ఉపకరిస్తుంది. ఒక్కసారి మెఱపు మెఱస్తే యక్షకాంత భయభ్రాంతురాలౌతుంది. కనుక మిణుగురు పురుగుల కాంతి వంటి మెఱపు దృష్టులు ఇంట్లోకి సారించడం తగిన పని. యక్షుని అనురాగం భావ్యమానమౌతోందీ శ్లోకంలో. అలం: సంకరం.

**తన్వీశ్యామాశిఖరిదశనా పక్వబిమ్బాధరోష్ఠీ**
**మధ్యేక్షామాచకితహరిణీ ప్రేక్షణా నిమ్న నాభిః।**
**శ్రోణీ భారాదలసగమనాస్తోక నమ్రాస్తనాభ్యాం**
**యాతత్రస్యాద్యువతివిషయే సృష్టిరాద్యేవధాతుః॥** 19

**పదచ్ఛేదం :** తన్వీ, శ్యామా, శిఖరిదశనా, పక్వబింబాధరోష్ఠీ, మధ్యేక్షామా, చకిత హరిణీ ప్రేక్షణా, నిమ్ననాభిః, శ్రోణీభారాత్, అలసగమనా, స్తోకనమ్రా, స్తనాభ్యాం, యా, తత్ర, స్యాత్, యువతి విషయే, సృష్టిః, ఆద్యేవ, ధాతుః.

**అన్వయం:** తన్వీ, శ్యామా, శిఖరిదశనా, పక్వబింబాధరోష్ఠీ, మధ్యేక్షామా, చకితహరిణీ ప్రేక్షణా, నిమ్ననాభిః, శ్రోణీభారాత్, అలసగమనా, స్తనాభ్యాం, స్తోకనమ్రా, యువతివిషయే, ధాతుః, ఆద్యాసృష్టిః, ఇవ, యా, తత్ర, స్యాత్, (తరువాతి శ్లోకముతో అన్వయం).

**ప్రతిపదార్థం :** తన్వీ= కృశాంగియు; శ్యామా= నడియౌవనమునందున్నదియు; శిఖరిదశనా= కోణము తేలిన పలు వరుసకలదియు; పక్వబింబాధరోష్ఠీ= దొండపండు

పెంపొందించుకొనదు కదా!

**'శ్రీకళా' వ్యాఖ్య:** మేఘునికి యక్షుడు తన ఇంటి గుర్తులన్నీ చెప్పి ( గత శ్లోకాల్లో) ఇవన్నీ మనసులో పదిలపఱచుకొంటే మా ఇంటిని గుర్తిస్తావని చెప్పి చివరి ముక్తాయింపుగా మరో రెండు గుర్తులు చెప్పేడు. మొదటిది సింహద్వారానికి రెండువైపులా శంఖపద్మాల్ని చిత్రించి ఉంటాయనేది. రెండవది శోభావిహీనమై ఉంటుందని. యజమానిలేని ఇల్లు శోభను కోల్పోతుంది. ఇది అందరికీ నిత్యం అనుభవంలో ఉండేదే! గృహపతిలేనప్పుడు అందునా గృహిణి ఏకాంతంగా ఉన్నప్పుడు ( సంతానం, బంధువులు లేని సమయంలో) ఇంటియందు, వంట యందు కూడా శ్రద్ధ చూపదు గృహిణి. రోజూ చేసే గృహ కృత్యాల నుండి విశ్రాంతి ఒక కారణమైతే భర్త ఎడబాటు రెండో కారణం.

రవిలేని సమయంలో - అంటే సూర్యాస్తమయంతో పద్మం ముకుళించుకొని తిరిగి సూర్యోదయంతో పద్మం వికసిస్తుంది. స్వీయశోభను పద్మం వికసింపచేసికోనట్లే యక్షుని భార్య సైతం స్వీయపోషణలోను, గృహాలంకరణ విషయంలోనూ ఉదాసీనయై ఉంటుంది. అలం: దృష్టాంతం.

**గత్వాసద్యః కలభతనుతాం శీఘ్రసంపాతహేతోః**
**క్రీడాశైలే ప్రథమకథితే రమ్యసానౌ నిషణ్ణః।**
**అర్హస్యన్తర్భవనపతితాం కర్తుమల్పాల్పభాసం**
**ఖద్యోతాలీ విలసితనిభాం విద్యుదున్మేష దృష్టిమ్॥** 18

**పదచ్ఛేదం :** గత్వా, సద్యః, కలభతనుతాం, శీఘ్రసంపాతహేతోః, రమ్యసానౌ, నిషణ్ణః, అర్హసి, అంతర్భవన పతితాం, కర్తుం, అల్పాల్పభాసం, ఖద్యోత ఆలి, విలసితనిభాం, విద్యుత్, ఉన్మేషదృష్టిమ్.

**అన్వయం:** శీఘ్రసంపాతహేతోః, సద్యః, కలభతనుతాం, గత్వా, ప్రథమకథితే, రమ్యసానౌ, క్రీడాశైలే, నిషణ్ణః, అల్పాల్పభాసం, ఖద్యోత ఆలీ విలసితనిభాం, విద్యుత్ ఉన్మేషదృష్టిం, అంతర్భవన పతితాం, కర్తుం, అర్హసి.

**ప్రతిపదార్థం :** శీఘ్రసంపాతహేతోః = వెంటనే ప్రవేశించుకారణంగా; సద్యః= అప్పుడే; కలభతనుతాం గత్వా= గున్న ఏనుగు గంతటి స్వరూపమును పొంది; ప్రథమకథితే= ముందుగా చెప్పిన; రమ్యసానౌ= అందమైన చరియలు కల; క్రీడాశైలే= క్రీడాపర్వతమున; నిషణ్ణః= ఉపవిష్టుడవై; అల్పాల్పభాసం= స్వల్పముగా ప్రకాశించు; ఖద్యోత ఆలీ

ర్థం విశదపరుస్తోంది. కృత్రిమనీతి సూత్రాల చేత ప్రభావితమైన ఆధునికులు ఇది స్త్రీకి ఉత్తమ లక్షణం కాదని దుర్వ్యాఖ్యానం చేయువచ్చు కాని అది న్యాయం కాదు. మదనరసాతిరేకం కలస్త్రీ తాను సుఖపడటమే కాకుండా భర్తను కూడ తృతీయ పురుషార్థంలో చరితార్థుణ్ణి చేయగలదు. 'శ్రోణీభారం' వల్ల మందగామిత్వం ఆమె సుకుమారత్వానికి వ్యంజకం, వక్షోజద్వయభారం వల్ల శరీరం చిన్నగా వంగినట్లుండడం ఆమె నాజూకుతనాన్ని సూచిస్తాయి. ఆ ప్రత్యేకాంగాలు ఆమె అతివేలతను సూచించేవికావు. బ్రహ్మమొదటి శిల్పమనడంలో బ్రహ్మ ప్రయత్నాతిశయం, నిర్మాణసౌష్ఠవం తెలుపడం. అలం: ఉత్ప్రేక్ష.

**తాంజానీథాః పరిమితకథాం జీవితం మే ద్వితీయం**
**దూరీభూతే మయి సహచరే చక్రవాకీ మివైకామ్ ।**
**గాఢోత్కణ్ఠాం గురుషు దివసేష్వేషుగచ్ఛత్సు బాలాం**
**జాతంమన్యే శిశిర మథితాం పద్మినీం వాన్యరూపామ్ ॥ 20**

**పదచ్ఛేదం :** తాం, జానీథాః, పరిమితకథాం, జీవితం, మే, ద్వితీయం, దూరీభూతే, మయి, సహచరే, చక్రవాకీం, ఇవ, ఏకాం, గాఢ+ఉత్కంఠాం, గురుషు, దివసేషు, ఏషు, గచ్ఛత్సు, బాలాం, జాతం, మన్యే, శిశిరమథితాం, పద్మినీం, వా, అన్యరూపామ్

**అన్వయం :** సహచరే, మయి, దూరీభూతే, చక్రవాకీం, ఇవ, ఏకాం, పరిమితకథాం, తాం, మే, ద్వితీయం, జీవితం, జానీథాః, గాఢ+ఉత్కంఠాం, బాలాం, గురుషు, ఏషు, దివసేషు, గచ్ఛత్సు, శిశిరమథితాం, పద్మినీం వా, అన్యరూపాం, జాతం, మన్యే.

**ప్రతిపదార్థం :** సహచరే మయి దూరీభూతే (సతి) = కలిసి తిరుగుచున్న నేను దూరంగా ఉండగా; చక్రవాకీం ఇవ ఏకాం = (మగ) చక్రవాకమును విడచిన చక్రవాకి వలె ఒంటరియై; పరిమితకథాం, తాం= మితభాషియైన ఆమెను; మే ద్వితీయం జీవితం జానీథాః= నా రెండవ ప్రాణముగా నెఱుగుము; గాఢోత్కంఠాం, బాలాం= విరహిణియగు అమాయకురాలిని; గురుషు, ఏషు, దివసేషు = భారమైన ఈ రోజులు; గచ్ఛత్సు (సత్సు) = గడచుచుండగా; శిశిరమథితాం పద్మినీం వా = శిశిర ఋతువులో మ్లానిన పద్మమువలె; అన్యరూపాం, జాతం, మన్యే= రూపాంతరమునొందిన దానినిగా తలతును.

**తాత్పర్యం :** సహచరుణ్ణైన నేను దూరంగా ఉండడం వల్ల చక్రవాకాన్ని విడచిన చక్రవాకి వలె ఒంటరియై మితభాషియైన ఆమెను నా రెండో ప్రాణంగా తెలిసికో. విరహిణియై

వంటి క్రింది పెదవి కలదియు; మధ్యేక్షామా= కృశోదరియు; చకితహరిణీప్రేక్షణా= భీతహరిణేక్షణయు; నిమ్ననాభిః= గంభీరమైన(లోతైన) బొడ్డు కలదియు; శ్రోణీభారాత్ అలసగమనా= పిఱుదుల భారముచే మందగమనయు; స్తనాభ్యాం, స్తోకనమ్రా= వక్షోజ ద్వయముచే కొంచెము వంగినదియు; యువతి విషయే, ధాతుః, ఆద్యా, సృష్టిః, ఇవ= స్త్రీ విషయకమై బ్రహ్మమొదటి శిల్పమువలె; యా తత్ర స్యాత్= ఏస్త్రీ అక్కడ కలదో (తరువాతి శ్లోకములో 'తాం' శబ్దంతో అన్వయం).

**తాత్పర్యం :** కృశాంగి, నడియౌవనవతి, కోణములు తేలిన పలు వరుసతో దొండపండు వంటి క్రింది పెదవితో కృశోదరియై భీతహరిణేక్షణ, లోతైన బొడ్డుతో పిఱుదుల భారంతో మందగమనయై వక్షోజ ద్వయావనతయై స్త్రీ విషయకమైన బ్రహ్మ తొలి శిల్పమువలె ఏ స్త్రీ అక్కడ ఉన్నదో ('తాం' అనే తరువాతి శ్లోక ప్రథమ శబ్దంతో అన్వయం).

**శ్రీకళా' వ్యాఖ్య :** 'మేఘదూతం'లో అతిమనోహరశ్లోకాల్లో ఒకటి. యక్షుని భార్య ఆకార విశేషాలిందులో వర్ణితమైనాయి. ఇందులో తొమ్మిది విశేషాలు ఆమెకి వాడేడు. సూక్ష్మపరిశీలనకు ఉత్తమ జాతి స్త్రీ లక్షణాలు సాముద్రిక లక్షణాలే చెప్పేడు. స్థూలదృష్టికి సుందరీ వర్ణనం అనిపించినా 'తన్వీ' అనే విశేషణం ఆమె స్థూల శరీర కాదనే విషయాన్ని తెలుపుతుంది. ఒక వ్యక్తి గుర్తు చేప్పేటప్పుడు ముందుగా చెప్పే విషయం ఇదే. లావు, సన్నం, పొడుగు, పొట్టి అని ముందు చెప్పి ఆతర్వాత మిగిలిన గుర్తులు చెబుతాం. ఆతర్వాత చెప్పేది వారి దశ. పెద్దావిడ, ముసలావిడ, మధ్యవయస్క, చిన్న పిల్ల – ఇత్యాదిగా చెబుతాం. అదే రెండవ విశేషణం. 'శ్యామా' అనేది ***''శ్యామా యౌవన మధ్యస్థా''*** అని లక్షణం. 'కను ముక్కు తీరు – పలువరుస' తర్వాతి అంశం. ***''దన్తాః శిఖరిణో యస్యాశ్చిరంజీవతి తత్పతిః''*** అనే సాముద్రిక లక్షణాన్ననుసరించి కోణం తీరినట్లుగా దంతపంక్తి గల స్త్రీకి దీర్ఘ సుమంగళీయోగం ఉంటుంది. అధరోష్ఠం దొండపండుని పోలి ఉండటం ఆమె సౌందర్యాతిరేకతను సూచిస్తుంది. మధ్యేక్షామా అంటే సింహమధ్య – సన్నని నడుము కూడా సౌందర్య ద్యోతకమే. శృంగారనైషధంలో శ్రీనాథుడు దమయంతి నడుమును ***''అస్తి నాస్తివి చికిత్సా హేతు శాతోదరి''*** అని ప్రశంసించేడు. భయపడిన లేడి చూపుల వంటి చూపులు కలది అని ఆమె చూపుల్ని వర్ణించేడు. 'చకిత హరిణీప్రేక్షణ' అనే విశేషంతో. పెద్దన మనుచరిత్రలో వరూథినిని ''ఎవ్వతెవీవుభీతహరిణేక్షణ'' అంటాడు. ఇటువంటి దృష్టులు ఆస్త్రీ 'పద్మినీజాతి'కి వ్యంజకాలు. ''**చకితమృగదృగాభేప్రాన్తరక్తే చనేత్రే**''అని 'రతి రహస్యం' చెబుతోంది. నిమ్ననాభి – బొడ్డులోతుగా ఉండడం ఆమె మదనరసాతిరేక సూచకమని 'కామసూత్రా'

సంస్కారవిహీనమై వ్రేలాడుచున్న శిరోజనములతో నిండుతనము కోల్పోయిన; తస్యాః, ప్రియయాః, ముఖం= ఆ నాప్రేయసి మోము; త్వత్ ఉపసరణక్లిష్టకాంతేః= నీవు అనుసరించుటచే అస్పష్టకాంతిగల; ఇందోఃదైన్యం బిభర్తి= చంద్రుని దైన్యమును భరించుచున్నది; నూనం= నిశ్చయము.

**తాత్పర్యం**: దుఃఖతీవ్రతచే కళ్ళు ఉబ్బి, వేడినిట్టూరులచే పెదవి కాంతివిహీనమై వ్రేలాడుచు సంస్కారహీనమైన శిరోజాలతో అరచేతియందుంచుకొన్న దీనతను వెలార్చే నా ప్రియురాలి మోము నీ (మేఘుని) అనుసరణమువలన చంద్రుని దైన్యమును భరిస్తోంది. నిజము.

**'శ్రీకళా' వ్యాఖ్య** : ఈ శ్లోకంలో యక్షుని భార్య రూపం వర్ణితమైంది. కళ్ళు ఉబ్బి ఉంటాయి. పెదవులు కాంతిని కోల్పోయి ఉంటాయి. కేశపాశం సంస్కారవిహీనమై వ్రేలాడుతూ ఉంటుంది. దైన్యతతో చేతిలో ఉంచుకొన్న ఆమె ముఖం మేఘచ్ఛన్న చంద్రబింబం వలె కాంతి విహీనంగా ఉంటుంది. ప్రోషిత పతికానాయికను అనుభవానికి దగ్గఱగా వర్ణించేడు. అలం: నిదర్శన.

**ఆలోకే తే నిపతతిపురాసాబలివ్యాకులావా**
**మత్సాదృశ్యం విరహతనువా భావగమ్యం లిఖన్తీ ।**
**పృచ్ఛన్తీవా మధురవచనా సారికాం పంజరస్థాం**
**కచ్చిద్భర్తుః స్మరసి రసికే త్వంహితస్య ప్రియేతి ॥** 22

**పదచ్ఛేదం** : ఆలోకే, తే, నిపతతి, పురా, సా, బలివ్యాకులావా, మత్, సాదృశ్యం, విరహతనువా, భావగమ్యం, లిఖన్తీ, పృచ్ఛన్తీవా, మధురవచనా, సారికాం, పంజరస్థాం, కచ్చిత్, భర్తుః, స్మరసి, రసికే, త్వం, హి, తస్య, ప్రియా, ఇతి.

**అన్వయం** : సా, బలివ్యాకులావా, విరహ తను, భావగమ్యం, మత్సాదృశ్యం, లిఖన్తీవా, మధురవచనా, పంజరస్థాం, శారికాం, రసికే, భర్తుః, స్మరసికచ్చిత్, త్వం, తస్య, ప్రియాహి, ఇతి, పృచ్ఛంతీ వా, తే, ఆలోకే, పురా, నిపతతి.

**ప్రతిపదార్థం**: సాబలివ్యాకులావా = ఆనాప్రియురాలు దేవతారాధనా తత్పరురాలై కాని; విరహతను, భావగమ్యం, మత్ సాదృశ్యం, లిఖన్తీ వా= విరహముచే చిక్కిన నా రూపమునూహించి చిత్రించుకొనుచుకాని; మధురవచనా పంజరస్థాంశారికాం= తీయని పలుకులొలుకు పంజరములోనున్న చిలుకను; (హే) రసికే భర్తుః, స్మరసికచ్చిత్=

భారంగా రోజులు గడుపుతున్న ఆమె శిశిర ఋతువుల్లో మ్లానత వల్ల రూపాంతరం పొందిన పద్మం వలె ఉంటుందని భావిస్తాను.

**'శ్రీకళా' వ్యాఖ్య:** యక్షునికి జీవిత సర్వస్వం అతని కాంత. ''ద్వితీయం జీవితం'' - రెండవ జీవితం అనేది వాచ్యార్థమైతే ఆ రెండవ జీవితమే 'సర్వస్వం' అనేది వ్యంగ్యం. మనస్వికి రెండు జీవితాలుంటాయి. ఒకటి బాహ్యం. రెండవది అంతరంగం. అంతరంగ ఇచ్ఛాసిద్ధికే బాహ్య జీవితమైనా ఈ రెంటికీ సంఘర్షణ వాటిల్లిన నాడు తీవ్ర మనస్సంక్షోభం జీవికి ప్రాప్తిస్తుంది. యక్షుని జీవితంలో ఇప్పుడు సంభవించింది అదే. ఇష్టార్థసిద్ధి జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు కలుగుతుందనే ఆశ మానవుని జీవింపచేస్తుంది. ''తన్వీశ్యామా......'' ఇత్యాది శ్లోకంలో వర్ణితమైనది ఆమె సంపూర్ణ సౌందర్యాతిశయం. వియోగ భారం వల్ల ఆమె అంతటి సౌందర్యాతిశయంతో లేక వాడిన పద్మంలా కనిపించవచ్చు. అంతమాత్రాన ఆమెను వేరొక వనితగా భ్రమపడవద్దని చెబుతున్నాడు. వియోగభారం తననెంత కృశింపజేస్తోందో ఆమెనూ అంతే కృశింపజేస్తోంది కనుక తన ప్రణయం అస్థాన పతితం కాదనే విషయం కూడా ఇందులో ధ్వనితమౌతోంది. అలం: సంసృష్టి.

**నూనం తస్యాః ప్రబలరుదితో చ్ఛూన నేత్రం ప్రియాయా**
**నిశ్వాసానామశిశిరతయా భిన్న వర్ణాధరోష్ఠమ్ ।**
**హస్తన్యస్తం ముఖ మసకల వ్యక్తి లమ్బాలకత్వా -**
**దిన్దోర్దైన్యం త్వదనుసరణ క్లిష్టకాన్తేర్బిభర్తి ॥** **21**

**పదచ్ఛేదం :** నూనం, తస్యాః, ప్రబల, రుదిత +ఉచ్ఛూన, నేత్రం, ప్రియాయాః, నిశ్వాసానాం, అశిశిరతయా, భిన్నవర్ణం, అధరోష్ఠం, హస్తన్యస్తం, ముఖం, అసకలవ్యక్తి, లంబాలకత్వాత్, ఇందోః, దైన్యం, త్వత్ అనుసరణక్లిష్టకాంతేః, బిభర్తి.

**అన్వయం:** ప్రబల రుదితోచ్ఛూననేత్రం, నిశ్వాసానాం, అశిశిరతయా, భిన్నవర్ణాధరోష్ఠం, హస్తన్యస్తం, లంబాలకత్వాత్, అసకలవ్యక్తి, తస్యాః, ప్రియాయాః, ముఖం, త్వత్, ఉపసరణక్లిష్టకాంతేః, ఇందోః, దైన్యం, బిభర్తి.

**ప్రతిపదార్థం :** ప్రబల, రుదిత, ఉచ్ఛూన, నేత్రం = దుఃఖ తీవ్రతచే నేత్రములుబ్బి, నిశ్వాసానాం అశిశిరతయా = వేడినిట్టూర్పులచే; భిన్నవర్ణ అధరోష్ఠం= కాంతిహీనమైన పెదవితో; హస్తన్యస్తం= చేతిలో ఉంచుకొనిన; లంబాలకత్వాత్ అసకలవ్యక్తి=

సారయిత్వా, స్వయంకృతాం అపి, భూయోభూయః, మూర్ఛనాం, విస్మరన్తీవా.

**ప్రతిపదార్థం:** సౌమ్య! = ఓ సాధుశీలీ!; మలినవసనే, ఉత్సంగే, వీణాం, నిక్షిప్య= మాసిన చీరతో అంకమునందు వీణనుంచి; మత్, గోత్రాంకం, విరచితపదం, గేయం, ఉద్గాతుకామా= నా పేరు కల ముద్రతో వ్రాసిన గేయమును గానం చేయగోరి; నయనసలిలం, ఆర్ద్రాం, తంత్రీం, కథంచిత్, సారయిత్వా= కన్నీటిచే తడిసిన (వీణ) తీగెలను ఎట్లో అట్లు శ్రుతి చేసి; స్వయంకృతాం అపి= తాను కూర్చినదైనను; భూయోభూయః= మాటిమాటికీ; మూర్ఛనాం, విస్మరన్తీవా= మూర్ఛనను మరచినదైకాని (తే ఆలోకే నిపతతి= నీదృష్టి పథమందు పడునని గత శ్లోక క్రియాన్వయం).

**తాత్పర్యం:** ఓ సాధుశీలీ! మాసిన చీర కట్టి తొడపై వీణ నుంచి నా పేరు ముద్రచేసి వ్రాసిన గేయాన్ని ఆలాపించడానికి కన్నీటితో తడిసిన వీణ తీగలను అతిప్రయత్నంతో శ్రుతిచేసి తాను కూర్చిందే అయినా మాటిమాటికీ మూర్ఛనను మఱచిపోయిన స్థితిలో కాని (చూడగలవు).

**'శ్రీకళా' వ్యాఖ్య:** యక్షుని భార్య ప్రోషిత భర్తృక కనుక వస్త్రాద్యలంకరణలకు ప్రాధ్యానం ఇవ్వక మాసిన చీర కట్టుకొంది. తన ప్రియునిపై విరహగీతికను వ్రాసి వీణ వాయిస్తూ ఆ గీతాన్ని ఆలపించి తద్వారా తన విరహవ్యథను అపనయింపగోరుతోంది. సాధారణంగా గేయాలు వ్రాసే వారు ఏదో ఒక ముద్ర (నామాన్ని) ఆ గీతికలో ఉంచుతారు. ఆ ముద్ర రచయితను తెలుపుతుంది. అన్నమాచార్యుల కృతులకు వేంకటేశ్వరుని ముద్ర, త్యాగరాయ కృతులకు త్యాగరాయముద్ర, ముత్తుస్వామి దీక్షితార్ కృతులకు 'గురుగుహ' ముద్ర ప్రసిద్ధమైనవి. అలాగే ఈమె తన భర్త నామధేయాన్నే 'ముద్ర'గా నిక్షేపించి వ్రాసింది. గోత్రానికి మనం అనుకుంటున్న 'వంశ'మనే అర్థమేకాక పేరు అనే అర్థం కూడా ఉన్నట్లు ''***గోత్రం నామ్ని కులేఽపిచ***'' అని అమరకోశం తెలుపుతోంది. అయితే ఆ గేయం గానం చేస్తూ వీణవాయిస్తూ ఉంటే భావావేశంతో కన్నీరు తీగల మీద ఒలికి శ్రుతి తప్పిపోతోంది. తిరిగి శ్రుతి చేసికొంటోందనే అర్థంలో కాళిదాసు 'సారయిత్వా' అనే పదాన్ని వాడేడు. దీన్ని వ్యాఖ్యానిస్తూ మల్లినాథ సూరి ''ఆర్ద్రత్వా పహరణాయ కరేణ ప్రస్పృజ్య'' అని కేవలం ''చేతితో తడిని తుడిచి'' అని మాత్రమే వ్రాసేరు. కేవలం తడి తుడవటమే కాళిదాసు భావమైతే 'కథంచిత్' అనే శబ్దాన్ని వాడనవసరం లేదు. 'కథంచిత్' అనే పదానికి ''కృచ్ఛ్రేణ'' అనే అర్థాన్ని మల్లినాథ సూరే వ్రాసేరు. అంటే ''కథంచిత్''కి తెలుగులో అర్థం చెప్పాలంటే ''ఏట్లో అట్లు'' ''ఎలాగో ఒకలా'' అంటే 'కష్టం మీద' 'అతికష్టంతో' అని అర్థం. తడిని తుడవటానికి 'అతికష్టంతో' పనిలేదు

''(ఓ) రసజ్ఞురాలా! భర్తను తలచుకొనుచున్నావా?; త్వం, తస్య, ప్రియా, హి, ఇతి = నీవతని కిష్టురాలవుకదా!'' అని; పృచ్ఛన్తీవా= అడుగుచు కాని; తే, ఆలోకే, పురా, పతతి= నీదృష్టి పథమున ముందుగా పడగలదు.

**తాత్పర్యం :** నా ప్రియురాలు దేవతారాధనా తత్పరురాలైకాని; విరహంతో చిక్కిన నా స్వరూపాన్ని ఊహించి చిత్రిస్తూకాని; తీయని పలుకులొలికే పంజరంలో ఉన్న చిలుకతో ''రసికురాలా! భర్తను తలచుకొంటున్నావా? నువ్వతనికిష్టురావుకదా!'' అని అడుగుతూ కాని నీ దృష్టి పథంలో మొదటగా పడుతుంది.

**'శ్రీకళా' వ్యాఖ్య :** ప్రోషిత భర్తృక సాధారణంగాలోనయ్యే అవస్థలను ఊహించి మూడు శ్లోకాల్లో ముచ్చటగా తన భార్య స్థితిని ''నువ్వు చూచేటప్పటికి ఆమె బహుశః ఈ విధంగా కాని, ఈవిధంగా కాని ఉండవచ్చు'' నని యక్షుడు మేఘునితో చెబుతున్నాడు. భర్త దూరాన ఉన్నాడు కనుక అతని క్షేమపునరాగమనం కోసం సాధారణంగా పతివ్రతలు పూజలుచేస్తూ ఉంటారు. యక్షుడు అక్కడికి వెళ్ళే వేళావిశేషాన్ననుసరించి ఆమె పూజ చేస్తూ కనిపించవచ్చు, లేదా (రోజంతా పూజలోనే ఉండదు కనుక) తన మనోవ్యధనపనయించుకోవడం కోసం తన పట్ల విరహంతో కృశించిన తన భర్త ఇలా ఉండవచ్చునని ఊహించి ప్రస్తుత యక్షప్రతిరూపాన్ని చిత్రిస్తూ కనిపించవచ్చు. అదీకాకపోతే పంజరంలో తీయని పలుకులొలికే చిలుకతో ''ఏమే! నువ్వూ ఆయన్ని గూర్చే తలచుకొంటున్నావా? అని అడుగుతూ కానిమొదటిసారిగా నీకళ్ళబడవచ్చునని చెప్పేడు. 'మత్సాదృశ్యం' అనడం వలనమన్మథావస్థల్లో 'మనస్సంగం' అనే అవస్థ సూచితమైంది.

**ఉత్సఙ్గేవామలినవసనేసౌమ్య నిక్షిప్య వీణాం**
**మద్గోత్రాఙ్కం విరచితపదం గేయముద్గాతుకామా ।**
**తన్త్రీమార్ద్రాం నయనసలిలైః సారయిత్వాకథంచి -**
**ద్భూయోభూయః స్వయమపి కృతాంమూర్ఛనాం విస్మరన్తీ ॥ 23**

**పదచ్ఛేదం :** ఉత్సంగే, వా, మలినవసనే, సౌమ్య, నిక్షిప్య, వీణాం, మత్, గోత్రాఙ్కం, విరచితపదం, గేయం, ఉద్గాతుకామా, తంత్రీం, ఆర్ద్రాం, నయనసలిలైః, సారయిత్వా, కథంచిత్, భూయోభూయః, స్వయం, అపి, కృతాం, మూర్ఛనాం, విస్మరంతీ.

**అన్వయం :** సౌమ్య, మలినవసనే, ఉత్సంగే, వీణాం, నిక్షిప్య, మత్ గోత్రఅంకం, విరచితపదం, గేయం, ఉద్గాతుకామా, నయనసలిలైః, ఆర్ద్రాం, తంత్రీం, కథంచిత్,

**అన్వయం:** విరహదివస స్థాపితస్య, అవధేః, శేషాన్మాసాన్, దేహలీదత్తపుష్పైః, గణనయా, భువి, విన్యస్యన్తీవా, హృదయనిహితారంభం, మత్సంగం(సంభోగం), ఆస్వాదయంతీవా, ప్రాయేణ, అంగనానాం, రమణవిరహేషు, ఏతే, వినోదాః.

**ప్రతిపదార్థం:** విరహ దివస స్థాపితస్య, అవధేః= వియోగారంభం నుంచి వియోగాంతము వరకు, శేషాన్ మాసాన్, దేహలీదత్తపుష్పైః, గణనయా = మిగిలిన నెలలను ద్వారము నందుంచిన పూలచే లెక్కించుచు; భువి, విన్యస్యంతీ వా= భూమి మీద ఉంచుచు ; కాని హృదయ నిహిత ఆరంభం మత్సంగం= మనసుతో ఊహిస్తున్న నా చుంబనాదిక్రియలను, రతిక్రీడాది సన్నివేశములను, ఆస్వాదయన్తీ వా= అనుభూతినొందుచు కాని (ఆలోకే తే నిపతతి = నీ కంట బడగలదు అని 22వ శ్లోకారంభంతో అన్వయం); ప్రాయేణ = సాధారణంగా; రమణవిరహేషు= ప్రియుల వియోగంలో; అంగనానాం, ఏతే, వినోదాః= స్త్రీలకు ఇవియే వినోదములు.

**తాత్పర్యం :** వియోగారంభం నుండి వియోగాంతం వరకు మిగిలిన నెలలను ద్వారము నందుంచిన పూలచే లెక్కించి వానిని భూమి మీద ఉంచుతూ కాని, లేదా మనసులో ఊహిస్తున్న నా ఆలింగనచుంబనాదులతో కూడిన రతి క్రీడానుభూతి చెందుతూ కాని నీ కంటబడవచ్చు. సాధారణంగా ప్రియుల వియోగంలో స్త్రీలు ఇటువంటి వినోదాలతోనే ప్రొద్దుపుచ్చుతూ ఉంటారు.

**'శ్రీకళా' వ్యాఖ్య:** యక్షుని భార్యను మేఘుడు చూచేటప్పటికి ఆమె స్థితి ఎలా ఉండవచ్చో ఊహించి చెబుతున్నాడు. వియోగం 12 మాసాలుండేది. వియోగభారంతో గుమ్మం మీద రోజూ పూలను ఉంచుతూ ఒక్కొక్క నెల పూర్తికాగానే ఒక్కొక్క పువ్వును ఆవలపారవేస్తూ మిగిలిన పూలను లెక్కపెడుతూనైనా మేఘుని దృష్టి పథంలో ఆమె పడవచ్చు, లేదా మనసులో శాపావధి అయిన తర్వాత భర్తృ సమాగమం కలిగినప్పుడు. ఆమెకు కలుగబోయే యక్షుని ఆలింగన చుంబనరతిక్రీడలను ఊహిస్తూ అయినా కనబడవచ్చును - ఎందుకంటే ప్రియుల వియోగంలో ఇటువంటి ఊహాలే స్త్రీలకు సాధారణంగా కాలక్షేపాన్ని కలుగజేస్తాయని యక్షుడు చెబుతున్నాడు. అలం: అర్థాంతరన్యాసం; వికల్పం; సంకరం.

కదా! శ్రుతి వీడిన వీణను తిరిగి శ్రుతి చేయడానికి ప్రయత్నం అవసరం. కనుక 'సారయిత్వా' అనే పదానికి 'శ్రుతిచేసి' అనే అర్థాన్ని చెప్పడమే ఔచిత్యవంతమౌతుంది.

వ్యాఖ్యాతృ శిరోమణియైన మల్లినాథసూరి 'ఉద్గాతుం' అనే పదాన్ని వ్యాఖ్యానిస్తూ 'గాంధారగ్రామం'లో పాడగోరిందనే విశేషార్థాన్ని చెప్పి మానవులు షడ్జ 'మధ్యమ గ్రామా'ల్లో గానం చేస్తారనీ, ''గాంధార గ్రామం'లో గానం చేయడం వారికి దుర్లభమనీ -

**''షడ్జమధ్యమ-నామానౌ గ్రామౌ గాయన్తి మానవాః।**
**నతుగాన్ధారనామానం సలభ్యోదేవయోనిభిః''॥**

అనే ఆర్యోక్తిని ఉటంకించి గాంధార గ్రామంలో గానం చేయడం దేవతాజాతులకే సాధ్యమనీ తెలిపేరు.

పాడుతుంటే భర్త స్మృతులు జ్ఞప్తికి రావడంతో ఆమెకి దుఃఖం పొర్లి వస్తుంది. దాంతో అవధానం తగ్గి తాను కూర్చిన రాగమే అయినా 'మూర్ఛన' ని మాటి మాటికీ మఱచిపోతోంది. సంగీతంలో స్వరారోహణ అవరోహణ క్రమాన్ని మూర్ఛన అంటారు. ఈ మూర్ఛనలు 'ఇరవై ఒకటిగా సంగీతరత్నాకరం వల్ల తెలుస్తోంది.

**''సప్తస్వరాస్త్రయోగ్రామామూర్ఛనాశ్చేకవింశతిః।**
**తానాఏకోనపఞ్చాశదిత్యేతచ్ఛ్రుతిమణ్డలమ్ ॥''**

''చక్షుః ప్రీతిః మనస్సంగం....'' అనే నాయిక దశావస్థల్లో ఇందులో సూచితమైన అవస్థ మనస్సంగం. అలం: వికల్పం.

**శేషాన్మాసాన్విరహదివస స్థాపితస్యావధేర్వా**
**విన్యస్యన్తీ భువిగణనయాదేహలీదత్తపుష్పైః।**
**మత్సఙ్గం వా హృదయనిహితారమ్భమాస్వాదయన్తీ**
**ప్రాయేణైతే రమణవిరహేష్వఙ్గనానాం వినోదాః॥** 24

**పదచ్ఛేదం :** శేషాన్, మాసాన్, విరహదివస స్థాపితస్య, అవధేః, వా, విన్యస్యన్తీ, భువి, గణనయా, దేహలీదత్తపుష్పైః, మత్ సంగం (సంభోగం) వా, హృదయనిహితారంభం, ఆస్వాదయన్తీ, ప్రాయేణ, ఏతే, రమణవిరహేషు, అంగనానాం, వినోదాః.

అని భరత రస ప్రకరణం ప్రోషిత భర్తృక లక్షణాన్నీ ఆమె వ్యాపారాల్నీ విశద పరుస్తోంది. అంటే భర్త దేశాంతరం వెళ్ళినప్పుడు వియోగంతో చింతించే స్త్రీని 'ప్రోషిత భర్తృక' అంటారు. జాగరః అంటే నిద్రలేకపోవడం, కృశించడం, శకునాల్ని నిరీక్షించడం, దేహాన్ని చక్కగా అలంకరించుకోకుండా మాలిన్యాన్ని కలిగి ఉండడం, స్వస్థతలేని చిత్తవృత్తి మొదలైన వన్నీ ఆమె చేసేపనులు. వీటిలో మొదటి అవస్థ 'జాగరం' ఈ శ్లోకంలో సూచితమైంది.

**ఆధిక్షామాం విరహశయనే సంనిషణ్ణైక పార్శ్వాం**
**ప్రాచీమూలే తనుమివ కలామాత్ర శేషాం హిమాంశోః ।**
**నీతారాత్రిః క్షణ ఇవమయా సార్థమిచ్ఛారతైర్యా**
**తామేవోష్ణైర్విరహ మహతీ మశ్రుభి ర్యాపయన్తీమ్ ॥ 26**

**పదచ్ఛేదం** : ఆధిక్షామాం, విరహశయనే, సంనిషణ్ణ, ఏక పార్శ్వాం, ప్రాచీమూలే, తనుం, ఇవ, కలామాత్ర శేషాం, హిమాంశోః, నీతా, రాత్రిః క్షణ ఇవ, మయాసార్థం, ఇచ్ఛారతైః, యా, తాం, ఏవ, ఉష్ణైః, విరహ మహతీం, అశ్రుభిః, యాపయంతీమ్.

**అన్వయం** : ఆధిక్షామాం, విరహశయనే, సంనిషణ్ణైక పార్శ్వాం, ప్రాచీమూలే, కలామాత్రశేషాం, హిమాంశోః, తనుం, ఇవ, యా, రాత్రిః, మయాసార్థం, ఇచ్ఛారతైః, క్షణ ఇవ, నీతా, తాం, విరహమహతీం, ఉష్ణైః, అశ్రుభిః, యాపయంతీ, (తాంపశ్య)

**ప్రతిపదార్థం**: ఆధిక్షామాం = మనోవ్యథతో కృశించినదియు; విరహశయనే, సంనిషణ్ణాం, ఏకపార్శ్వాం = పల్లవాది రచితమైన పాన్పునందు ఒత్తిగిలి పరుండినదియు; ప్రాచీమూలే కలామాత్ర శేషాం, హిమాంశోః = తూర్పుదిక్కున ఒకే కళతో నున్న (కృష్ణపాడ్యమి) చంద్రుని; తనుం, ఇవ = శరీరమువలె (శుష్కించి) యున్నదియు; యా, రాత్రిః, మయా, సార్థం = ఏ రాత్రి నాతోకూడి; ఇచ్ఛారతైః, క్షణ ఇవ నీతా = ఇష్టమైన రతిక్రీడలచే క్షణ కాలంగా గడిపెనో; తాం, విరహమహతీం ఉష్ణైః, అశ్రుభిః యాపయన్తీం = (అట్టి రాత్రులనే) దానినే గొప్పదియగు వియోగమైన జనిత వేడి కన్నీటిచే గడుపుచున్నదియు (నగు); (తాం, పశ్య) = (ఆమెను చూడుము).

**తాత్పర్యం** : మనోవ్యథతో కృశించి పల్లవాది రచితమైన పాన్పుపై ఒత్తిగిలి పరుండి కృష్ణ పాడ్యమి నాటి చంద్రునివలె చిక్కి శల్యమై ఏ రాత్రులను ఇష్టరతులతోక్షణ కాలంగా గడిపిందో అట్టి రాత్రులనే వియోగ జనితమైనవేడి కన్నీటితో గడుపుచున్న ఆ పతివ్రతను చూడుము.

**సవ్యాపారామహని నతథాపీడయేన్మద్వి యోగః**
**శఙ్కేరాత్రే గురుతరశుచం నిర్వినోదాం సఖీం తే।**
**మత్సందేశై ః సుఖయితుమలంపశ్యసాధ్వీం నిశీథే**
**తామున్నిద్రామవని శయనాం సౌధవాతాయనస్థః॥ 25**

**పదచ్ఛేదం:** సవ్యాపారాం, అహని, న, తథా, పీడయేత్, మత్, వియోగః, శంకే, రాత్రౌ, గురుతరశుచం, నిర్వినోదాం, సఖీం, తే, మత్, సందేశైః, సుఖయితుం, అలం, పశ్య, సాధ్వీం, నిశేథే, తాం, ఉన్నిద్రాం, అవనిశయనాం, సౌధవాతాయనస్థః.

**అన్వయం :** అహని, సవ్యాపారాం, తే, సఖీం, మత్, వియోగః, తథా, న, పీడయేత్, రాత్రౌ, నిర్వినోదాం, గురుతరశుచం, శంకే, నిశీథే, ఉన్నిద్రాం, అవనిశయనాం, తాం, సాధ్వీం, మత్సందేశైః, సుఖయితుం, అలం, సౌధవాతాయనస్థః, పశ్య.

**ప్రతిపదార్థం :** అహని = పగటియందు; సవ్యాపారాం, తే, సఖీం, మత్, వియోగః= పనులలో నిమగ్నమైన నీ స్నేహితురాలిని నా ఎడబాటు; (యథారాత్రౌ) తథా నపీడయేత్ = (రాత్రివేళల ఎట్లో) అట్లు బాధింపదు; రాత్రౌ , నిర్వినోదాం, గురుతరశుచం = రాత్రులయందు కాలక్షేపములేకపోవుటచే అధిక దుఃఖభాగినిగ; (తే సఖీం) శంకే= (నీ స్నేహితురాలిని) ఊహించుచున్నాను; నిశీథే, ఉన్నిద్రాం, అవనిశయనాం= అర్థరాత్రులయందు నిద్రపట్టక నేలపై పరుండిన; తాం, సాధ్వీం= ఆపతివ్రతను తగు విధముగా; మత్ సందేశైః అలం, సుఖయితుం= నాసందేశముచే ఆనందపఱుచుటకు; సౌధవాతాయనస్థః(సన్) పశ్య = భవన గవాక్షము నుందు(న్నవాడవై)ండి చూడుము.

**తాత్పర్యం:** పగటి వేళల పనులయందు నిమగ్నమైన నీ స్నేహితురాలిని నా వియోగవ్యథ కాలక్షేపము లేక అధిక దుఃఖాన్ని అనుభవించే రాత్రులంత బాధింపక పోవచ్చు. కనుక అర్థరాత్రివేళల్లో నిద్ర పట్టక నేలపై పరున్న ఆ పతివ్రతకు నా సందేశము తెల్పి తగు విధంగా సంతోషపెట్టుటకు భవన గవాక్షము నుండి పరికింపుము.

**'శ్రీకళా' వ్యాఖ్య:** ఈ శ్లోకంలో 'జాగర' మనే ప్రోషిత భర్తృకావ్యాపారం సూచితమైంది.

*''దేశాన్తర గతే కాన్తే ఖిన్నా ప్రోషితభర్తృకా*
*అస్యాస్తు జాగరః కార్శ్య నిమిత్తా న వలోకనమ్।*
*మాలిన్యమనవ స్థానం ప్రాయశ్చయ్యానిషేవణమ్*
*జాడ్య చిన్తా ప్రభృతయో విక్రియా కథితా బుధైః॥*

ప్రబుద్ధాం, న సుప్తాం స్థలకమలినీం ఇవ = వికసింపక, ముకుళించుకొని పోని మెట్టతామెర వలె (స్థితాం= ఉన్న ; తాం పశ్య (25వ శ్లోకం నుంచి అనువృత్తి) = ఆమెను చూడుము.

**తాత్పర్యం** : గవాక్ష రంధ్రాల్లోంచి ప్రవేశించే అమృతంవలె చల్లనైన చంద్రకిరణములకు ఇది వరకటివలె (యక్షుని ఉపస్థితిలో) సంతోషాన్ని కలుగజేస్తాయని ఎదురు రావడం అంతలోనే వెనుదిరిగి పోవటం జరుగుతూ ఉంటుంది . దుఃఖవశమువలన కన్నీటి బరువుచే కంటిని ఱెప్పలు క్రమ్ముకొంటుంటే మేఘము క్రమ్మిన పగటి వేళ వికసించని, ముకుళించని మెట్టతామర వలెఉన్న ఆమెను చూడుము.

**'శ్రీకళా' వ్యాఖ్య** : కిటికీలోంచి చంద్ర కిరణాలు లోపలికి ప్రవేశిస్తున్నాయి. పూర్వం యక్షుడు తనతో కలసి ఉన్నప్పుడు ఈ చంద్ర కిరణాలు సంతోషాన్ని ప్రసాదించేయి. కనుక వాటికెదురేగడం, ఇప్పుడవే యక్షుని అనుపస్థితిలో దుఃఖ కారకాలవుతున్నాయి కనుక అంతలోనే వెనుదిరిగి రావడం జరుగుతోంది. దుఃఖము మిక్కుటం కావడంవల్ల ఆమె దృష్టిని కన్నీటితో బరువెక్కిన ఱెప్పలు కప్పివేస్తూ ఉంటే మబ్బు కమ్మిన పగటివేళల్లో సూర్యరశ్మి లేనందువల్ల పూర్తిగా ముకుళించక, మబ్బు తొలుగుతుందనే ఆశతో అంతగా వికసించని మెట్టతామరవలె ఉందట యక్షుని భార్య! నాయిక మన్మథావస్థల్లో ఆరవదైన విషయద్వేషదశ సూచితమైంది.

ఈ శ్లోకంలో శబ్దార్థ రమణీయమైన ''నప్రబుద్ధాం నసుప్తాం'' అనే ప్రయోగం శ్లోకానికి సౌందర్యా ధాయకమైంది. అలం: సంసృష్టి.

**నిఃశ్వాసేనాధర కిసలయ క్లేశినా విక్షిపన్తీం**
**శుద్ధస్నానాత్పరుషమలకం నూనమాగణ్డలమ్బమ్ ।**
**మత్సంభోగః కథము పనయేత్స్వప్నజో ఽపీతి నిద్రా -**
**మా కాఙ్క్షన్తీం నయన సలిలో త్పీడ రుద్ధావకాశామ్ ॥ 28**

**పదచ్ఛేదం** : నిశ్వాసేన, అధర కిసలయ క్లేశినా, విక్షిపన్తీం, శుద్ధస్నానాత్, పరుషం, అలకం, నూనం, ఆగండలంబం; మత్, సంభోగః, కథం, ఉపనయేత్, స్వప్నజః, అపి, ఇతి, నిద్రాం, ఆకాంక్షంతీం, నయన సలిల ఉత్పీడ రుద్ధ అవకాశమ్.

**అన్వయం** : శుద్ధ స్నానాత్, పరుషం, ఆగండలంబం, అలకం, అధరకి సలయక్లేశినా, నిశ్వాసేన, విక్షిపంతీం, స్వప్నజః, అపి, మత్ సంభోగః, కథం, ఉపనయేత్, ఇతి, నయన సలిల, ఉత్పీడ, రుద్ధ, అవకాశం, నిద్రాం, ఆకాంక్షన్తీం (తాంపశ్య)

'శ్రీకళా' వ్యాఖ్య : 'వ్యాధి' శరీరజన్యమైనదైతే 'ఆధి' మనోవ్యథ. మనోవ్యథవల్ల మనిషి శుష్కించడం మన అనుభవంలో ఉన్నవిషయమే. యక్షుని భార్య ఆ మనోవ్యథతో చిక్కిపోయి ఉంటుంది. విరహావస్థను సహించడం కోసం చిగురుటాకుల పాన్పులపై శయనించడంపూర్వ కవిసమయం. ''నలదమయంతులిద్దఱు.... తలిరులశయ్యలన్...'' అని నన్నయ్య గారు కూడ నలదమయంతులు వియోగ బాధతో చిగురుటాకుల పాన్పులపై గడిపినట్లు వర్ణించేరు. ఆ చిగురు టాకుల పాన్పుపైన ఒత్తిగిలి పడుకోవటం వలన ఆమె ఒదిగిన శరీరం (మాత్రమే కనిపించి (సంపూర్ణంగా కనిపించక) కృష్ణ పక్షపాడ్యమి నాడు ఒకే కళతో కనిపించే చంద్రునిలా భాసిస్తుంది. యక్షునితో కలిసి ఉన్న (శాపాత్పూర్వం) ఏ రాత్రులనైతే క్షణకాలంగా ఇచ్ఛారతులతో గడిపిందో ఆ రాత్రులనే ఇప్పుడు దుస్సహవియోగ జనితోష్ణబాష్పధారలతో గడుపుతోంది. ఇందులో నాయిక ద్వితీయావస్థ 'కార్శ్యం' సూచితమైంది. అలం : ఉపమ.

**పాదా నిన్దోరమృతశిశిరా ఞ్జాల మార్గప్రవిష్టా -**
**న్పూర్వప్రీత్యా గతమభిముఖం సంనివృత్తం తథైవ ।**
**చక్షుః ఖేదాత్సలిలగురుభిః పక్ష్మభిశ్ఛాదయన్తీం**
**సాభ్రే ఉహ్నీవ స్థలకమలినీం నప్రబుద్ధాం నసుప్తామ్ ॥ 27**

**పదచ్ఛేదం** : పాదాన్, ఇందోః, అమృత శిశిరాన్, జాలమార్గ ప్రవిష్టాన్, పూర్వ ప్రీత్యా, గతం, అభిముఖం, సంనివృత్తం, తథైవ, చక్షుః, ఖేదాత్, సలిల గురుభిః, పక్ష్మభిః, ఛాదయంతీం, సాభ్రైః, అహ్ని, ఇవ, స్థలకమునీం, నప్రబుద్ధాం, న సుప్తామ్.

**అన్వయం** : జాలమార్గ ప్రవిష్టాన్, అమృత శిశిరాన్, ఇందోః పాదాన్, పూర్వ ప్రీత్యా, అభిముఖం, గతం, తథైవ, సన్నివృత్తం, ఖేదాత్, చక్షుః, సలిల గురుభిః, పక్ష్మభిః, ఛాదయన్తీ, సాభ్రైః అహ్ని - నప్రబుద్ధాం, న సుప్తాం, స్థలకమలినీం ఇవ, (స్థితాం) (తాం, పశ్య - 25వ శ్లోకం).

**ప్రతిపదార్థం** : జాలమార్గ ప్రవిష్టాన్, అమృత శిశిరాన్, ఇందోః పాదాన్ = గవాక్షరంధ్రములనుండి ప్రవేశించిన అమృతమువలె చల్లనైన చంద్ర కిరణములకు; పూర్వప్రీత్యా, అభిముఖం, గతం = ఇది వరకటి వలె సంతోషము నిచ్చునని ఎదురుగా వెళ్ళుటయు; తథైవ, సన్నివృత్తం= అట్లే (అంతలోనే) తిరిగి వచ్చుటయు (జరిగెను); ఖేదాత్, చక్షుః, సలిలగురుభిః = దుఃఖమువలన, కన్నీటి తో బరువెక్కిన కంటిని; పక్ష్మభిః, ఛాదయన్తీ= ఱెప్పలచే క్రమ్మినదై; సాభ్రైః అహ్ని = మేఘము క్రమ్మినపగటియందు;

**అన్వయం** : ఆద్యే, విరహదివసే, శిఖాదామ, హిత్వా, యా, బద్ధా, శాపస్య, అంతే, విగలిత శుచా, మయా, ఉద్వేష్టనీయాం, స్పర్శక్లిష్టాం, కఠిన విషమాం, ఏకవేణీం, తాం, అయమిత నఖేన, కరేణ, అసకృత్, సారయంతీం (తాం పశ్య).

**ప్రతిపదార్థం**: ఆద్యే విరహదివసే = వియోగారంభ దినమున; శిఖాదామ హిత్వా యాబద్ధా = ఏకేశపాశము పూలమాలను విడిచి ముడివేయబడినదో; శాపస్య అంతే, విగలిత శుచా, మయా = శాపాంతమున దుఃఖమును వీడిన నాచేత; ఉద్వేష్టనీయాం, స్పర్శక్లిష్టాం, కఠిన విషమాం = చక్కనొత్తదగి బాధా యుక్తమైన స్పర్శతో, చిందరవందరగా నున్న; ఏకవేణీం, తాం = ఒంటిపాయతో నున్న ఆ కేశపాశమును; అయమిత నఖేన, కరేణ, అసకృత్, సారయాన్తీం = అవ్యవస్థితమైన గోళ్లుకల చేతితో తఱచుగా రేపు కొనుచున్న; (తాం పశ్య) = (ఆమెను చూడుము)

**తాత్పర్యం**: వియోగారంభ దినం పుష్పదామాన్ని విసర్జించి ఏకేశపాశం ముడినొందిందో, శాపాంతంలో విగత శోకుడనైన నాచేత ఏ ధమ్మిల్లము చక్కనొత్తదగిందో, బాధామయ స్పర్శతో చిడిముడిపడి ఒంటిపాయతో నున్న ఆకేశపాశాన్ని అవ్యవస్థితమైన గోళ్ల కల చేతితో తఱచు రేపుకొంటున్న (ఆమెను చూడుము.)

**'శ్రీకళా' వ్యాఖ్య** : యక్షుని భార్య కూడా విరహాన్ని అనుభవిస్తోంది కనుక పతివ్రత. తన అలంకరణకు లక్ష్యం తనభర్త సంతోషమే కనుక అతని ఎడబాటులో ఆమె నిరలంకృత. శిరోజాలం కారమైన సుమమాల నామె వియోగారంభ దినానే తీసివేసి 'ఏకవేణి' అయింది. అంటే జడను మూడు పాయలుగా తీసి అల్లుకోక వ్రేలు ముడిపెట్టుకొంది. శాపాంతంలో విగత శోకుడైన యక్షుడు వచ్చి ఆ శిరోజాలకు సంస్కారంచేసి ప్రేమతో జడనల్లుతాడు. ప్రియునిచే అనురాగంతో జడ అల్లించుకోవడం ప్రేయసికి అదో భాగ్యం, అదోభోగం. అతను వచ్చి ధమ్మిల్లాన్ని చక్కనొత్తే వరకు అది సంస్కార విహీనమై ఉంటుంది. అభ్యంగన స్నానాలు లేక, పరిమళ భరిత ధూపాలు లేక, పరిమళయుక్త తైలాలు లేక వెంట్రుకలు మొరటై ముట్టుకుంటే వ్రేళ్లకే బాధకలిగిస్తాయి. ప్రియుని వియోగంలో ఆమె తన గోళ్లను సైతం చక్కగా కత్తిరించుకోక అవ్యవస్థితంగా ఉంటే ఉపేక్ష వహించింది. విరహం ఉద్ధోలమై మనసు స్వాధీనంలో లేక జుట్టు రేపుకొంటోంది. ఇది 'చిత్త విభ్రమ' మనే మన్మథావస్థ.

మన్మథావస్థలోని చిత్త విభ్రమానికీ, లోకంలో ఉండే 'పిచ్చి' కీ తేడా ఉంది. 'పిచ్చి' లో జుట్టు పీక్కుంటారు. మన్మథావస్థల్లో ఒకటైన 'చిత్తవిభ్రమం' లో జుట్టు రేపుకుంటారు. అలం : స్వభావోక్తి.

**ప్రతిపదార్థం** : శుద్ధస్నానాత్, పరుషం, ఆగండలంబం, అలకం = కేవలనీటి స్నానముచే బిరుసుతేలి చెంపలపై వ్రేలాడు ముంగురులను; అధరకిసలయక్లేశినా, నిశ్వాసేన, విక్షిపంతీం = చిగురు మోవిని బాధించు నిట్టూర్పులచే తొలగించుచు; స్వప్నజః, అపి, మత్, సంభోగః, కథం, ఉపనయేత్ ఇతి = కలలో నైనను నాకలయిక ఎట్లు కలుగును అని; నయన సలిల, ఉత్పీడ, రుద్ధ, అవకాశాం = కన్నీటి బాధచే అడ్డగింప బడిన అవకాశము కలిగిన నిద్రాం, ఆకాంక్షంతీం, (తాం, పశ్య) = నిద్రను కోరుచున్న (ఆమెను చూడము)

**తాత్పర్యం** : సాధారణ స్నానంతో బిరుసెక్కి చెంపలపై వ్రేలడే ముంగురుల్ని చిగురు మోవిని బాధించే నిట్టూర్పులతో తొలగిస్తూ (కనీసం) కలలో నయినా నాకలయిక ఎలా సిద్ధిస్తుందా అని కన్నీళ్ల అడ్డగిస్తున్న నిద్రను కొరుకుంటున్న (ఆమెను చూడుము)

**'శ్రీకళా' వ్యాఖ్య** : యక్షుడు తన వద్ద ఉన్నప్పుడతని భార్య నిత్యం పరిమళ ద్రవ్య మిశ్రితమైన జలాలతో అభ్యంగన స్నానంచేసేది, వివిధ పరిమళ భరిత తైలాలను వాడేది. కనుక ఆమె శిరోజాలు సువాసనలనీనుతూ సున్నితంగా ఉండేవి. అతని ఎడబాటు వల్ల: సాధారణ స్నానాలతో సంస్కార హీనమైన శిరోజాలు బిరుసెక్కి చెంపలదాకా వ్రేలాడు తున్నాయి. వేడి నిట్టూర్పు ఆమె అధరోష్ఠాన్ని బాధిస్తూ అలకలను తొలగిస్తోంది. యక్షునితో సమాగమం కనీసం స్వప్నంలో నైనా కలిగితే బాగుండునని భావిస్తుంటే వియోగ వ్యథాజనిత దుఃఖోద్భూత నయన సలిలం ఆనిద్రను కూడా దూరంచేస్తోందట! అహో ! కాళిదాసు భావనా పటిమ ! అశ్రువిసర్జనను ప్రస్తావించడంవల్ల 'లజ్జాత్యాగ' మనే మన్మథావస్థ ధ్వనితమైంది. అలం : లుప్తోపమ.

**ఆద్యేబద్ధావిరహదివసే యా శిఖాదామ హిత్వా**
**శాపస్యాన్తే విగలిత శుచా తాం మయోద్వేష్టనీయామ్ ।**
**స్పర్శ క్లిష్టామయమితనఖే నాసకృత్సార యన్తీం**
**గణ్డాభోగాత్కఠిన విషమామేక వేణీం కరేణ ॥ 29**

**పదచ్ఛేదం** : ఆద్యే, బద్ధా, విరహదివసే, యా, శిఖాదామ, హిత్వా, శాపస్య, అంతే, విగలిత శుచా, తాం, మయా, ఉద్వేష్ట నీయాం, స్పర్శక్లిష్టాం, అయమిత నఖేన, అసకృత్, సారయంతీం, గండా భోగాత్, కఠిన విషమాం, ఏకవేణీం, కరేణ.

భ్రంశరిక్త ప్రకోష్ఠః'' అని రెండవ శ్లోకంలోనే (పూర్వమేఘం) చెప్పేడు. కనుక వీరిద్దరి ప్రణయం ఆదర్శప్రాయమైంది.

మృదువైన తన శరీరాన్ని ఆమె పక్కపై మాటి మాటికీ చేర్చుతూ అమిత దుఃఖంతో (శరీరాన్ని విడవక) వహిస్తోందని చెప్పడం వల్ల వివిధమన్మథావస్థల్లో 'మూర్ఛ' సూచితమైంది. లోకంలో మూర్ఛ దాహంతో క్రిందపడి కాళ్ళూ చేతులూ కొట్టుకోవడం. మన్మథావస్థయైన మూర్ఛావస్థ సమాహిత చిత్తాన్ని పోగొట్టుకొని అసహనంగా తిరగడం, శయ్యపై దొర్లడం. అలం : అర్థాంతరన్యాసం.

**జానే సఖ్యా స్తవ మయిమనః సంభృత స్నేహ మస్మా -**
**దిత్థం భూతాం ప్రథమ విరహే తామహం తర్కయామి ।**
**వాచాలం మాం నఖలు సుభగం మన్య భావః కరోతి**
**ప్రత్యక్షంతే నిఖిల మచిరాద్భ్రాతరుక్తం మయాయత్ ॥** 31

**పదచ్ఛేదం** : జానే, సఖ్యాః, తవ, మయి, మనః, సంభృత స్నేహం, అస్మాత్, ఇత్థం, భూతాం, ప్రథమవిరహే, తాం, అహం, తర్కయామి, వాచాలం, మాం, న, ఖలు, సుభగం, మన్యభావః, కరోతి, ప్రత్యక్షం, తే, నిఖిలం, అచిరాత్, భ్రాతః, ఉక్తం, మాయా, యత్.

**అన్వయం** : తవ, సఖ్యాః, మనః, మయి, సంభృత, స్నేహం, జానే, అస్మాత్, అహం, ప్రథమ విరహే, తాం, ఇత్థం భూతాం, తర్కయామి. సుభగం, మన్యభావః, మాం, వాచాలం, న కరోతి; భ్రాతః, మయా, ఉక్తం, తత్ నిఖిలం, తే, అచిరాత్, ప్రత్యక్షం (భవిష్యతి).

**ప్రతిపదార్థం** : (హే ! మేఘ) – ( ఓ మేఘుడా !); తవ, సఖ్యాః, మనః, మయి, సంభృత స్నేహః, జానే = నీ నెచ్చెలి మనస్సు నాయందు బద్ధాను రాగమైనదనితెలియును; **అస్మాత్**, అహం, ప్రథమ విరహే, తాం, ఇత్థం , భూతాం, తర్కయామి = అందువల్ల నేను మొదటి వియోగమున ఈ విధంగా ఉంటుందని ఊహిస్తున్నాను. సుభగం, మన్యభావః, మాం, వాచాలం, నకరోతి = అందగాడననే భావం నన్ను వదరు బోతుగా చేయుటలేదు (సుమా!) భ్రాతః = సోదరా !; మయా, ఉక్తం, తత్ నిఖిలం, తే, అచిరాత్, ప్రత్యక్షం, (భవిష్యతి) నే చెప్పిన దంతా నీకు త్వరలోనే సాక్షాత్కరించునది (కాగలదు).

**సాసంన్యస్తాభరణ మబలా పేశలం ధారయన్తీ**
**శయ్యోత్సఙ్గే నిహితమసకృద్దుఃఖదుఃఖేన గాత్రమ్ ।**
**త్వామప్యస్రం నవజలమయం మోచయిష్యత్యవశ్యం**
**ప్రాయః సర్వోభవతి కరుణా వృత్తి రార్ద్రాన్త రాత్మా ॥ 30**

**పదచ్ఛేదం** : సా, సంన్యస్తాభరణం, అబలా, పేశలం, ధారయన్తీ, శయోత్సంగే, నిహితం, అసకృత్, దుఃఖదుఃఖేన, గాత్రం, త్వాం, అపి, అస్రం, నవజలమయం, మోచంయిష్యతి, అవశ్యం, ప్రాయః, సర్వః, భవతి, కరుణావృత్తిః, ఆర్ద్ర + అంతరాత్మా.

**అన్వయం** : అబలా, సంన్యస్తాభరణం, అసకృత్, శయ్యోత్సంగే, నిహితం, పేశలం, గాత్రం, దుఃఖదుఃఖేన, ధారయంతీ, సా, త్వాం, అపి, నవజలమయం, అస్రం, అవశ్యం, మోచయిష్యతి. ప్రాయః,ఆర్ద్రాంతరాత్మా, సకలః, కరుణావృత్తిః, భవతి.

**ప్రతిపదార్థం** : అబలా, సంన్యస్త, ఆభరణం = దుర్బలయ్యై ఆభరణములను విడచి; అసకృత్, శయ్యోత్సంగే, నిహితం = మాటిమాటికీ శయ్యపై నుంచిన; పేశలం, గాత్రం, దుఃఖదుఃఖేన, ధారయన్తీ, సా = మృదువైన శరీరమును మిక్కిలి దుఃఖంతో వహిస్తున్న ఆమె; త్వాం అపి, నవజలమయం అస్రం = నిన్ను (నీచేత) కూడ క్రొత్తనీటితో నిండిన కన్నీటిని; అవశ్యంమోచయిష్యతి = తప్పక విడిపింపజేయును; ప్రాయః, ఆర్ద్రాంతరాత్మా, సకలః = సాధారణముగా మృదుహృదయులందరును; కరుణా వృత్తిః, భవతి = దయగల వారగుచున్నారు.

**తాత్పర్యం** : దుర్బలయ్యై, విగతాభరణయ్యై, మాటిమాటికీ శయ్యపైనుంచిన తన మృదుదేహాన్ని అత్యంత దుఃఖంతో వహిస్తూన్న ఆమె నీ చేత కూడా కన్నీరు కార్పిస్తుంది. మృదు హృదయులంతా దయగలవారు కదా !

**'శ్రీకళా' వ్యాఖ్య**: యక్షుని భార్య 'అబల'. 'అబలా' శబ్దానికి 'స్త్రీ' అనేది సామాన్యార్థం. సామాన్యార్థంలోనూ, విశేషార్థంలోనూ, (ఇక్కడ) 'మనోబలం' తక్కువైందని అర్థంకాని శరీరబలంకాదు. ఈ మనోబలం లోనూ 'విరహావస్థ' ను పురుషుడు భరించినట్లుగా స్త్రీ భరించలేదని తాత్పర్యం. భరించలేకపోవడం వేరు. నిగ్రహాన్ని కోల్పోవడం వేరు. స్త్రీ కంటె పురుషుడే త్వరగా నిగ్రహాన్ని కోల్పోతాడు. నిగ్రహశక్తి స్త్రీకి ఎక్కువ. ఈమెదౌర్బ ల్యాన్నిశరీరమనఃస్థితుల రెంటికీ ఇక్కడ అన్వయించవచ్చు. విరహవేదన వల్ల మనస్సు బలహీనమైంది. సంతోషం లేక పోవడంవల్ల ఆహారం విషయంలో శ్రద్ధ వహించకపోవడం వలన శరీరమూ బలహీనమైంది. ఈస్థితే యక్షునికీ ఉంది. అతని గూర్చి ''కనక వలయ

పద్మకాంతితో సామ్యమును; ఏష్యతి, ఇతి, శంకే = పొందగలదని ఊహించుచుంటిని.

**తాత్పర్యం** : ముంగురులు అడ్డిన క్రీగంటి చూపుతో, కాటుకను, మద్యమును విసర్జించుటవలన కనుబొమల ఒయారములేక నీ సామీప్యంతో (ఎడమ) కన్నదరగా హరిణాక్షి అక్షి చేపకదలికచే కదలిన పద్మకాంతితో సామ్యాన్ని పొందుతుందని ఊహిస్తున్నాను.

**'శ్రీకళా' వ్యాఖ్య** : యక్షుని సన్నిధిలో అతడు, ఆమె మద్యపానం చేసేవారు. అతను దగ్గరలేకపోవటం వల్ల ఆమె మద్యాన్ని విడిచింది. ప్రత్యాదేశమంటే నిరాకరించడం. "***ప్రత్యాదేశో నిరాకృతిః***" అని అమరం. మేఘుడు సమీపిస్తుంటే యక్షుని వార్త తెలియ బోతోందనే శుభసూచకంగా ఆమెకు వామాక్షి స్పందనం కలుగుతుంది. అదీ అక్షిపై భాగంలోనని చెప్పడంలో కాళిదాసు చిన్న విషయంలో సైతం, ఎంత శ్రద్ధ తీసికొన్నదీ విదితమౌతుంది. ఏమంటే – ఇక్కడ రెండు విషయాలు చెప్పేడు. 'ఉపరిస్పంది' అంటే పై భాగంలో అదిరిందనీ, – అలా అదిరిన అవయవం ఏమిటంటే మృగాక్ష్యాః – 'నయనం' స్త్రీ కన్ను. అంటే కంటిపై భాగంలో ఈ స్పందనం సంభవించింది.

***"స్పన్ద స్స్యాల్లి చ్ఛత్రలాభం లలాటే పట్ట మంశుకమ్ ।***
***ఇష్ట ప్రాప్తిం దృశోరూర్ధ్వ మపాఙ్గే హాని మాదిశేత్ ॥***

అని 'నిమిత్తనిదానం' చెబుతోంది.

కంటిపై భాగం అదిరితే మనోవాంఛా ఫలసిద్ధి జరిగితే, అదే కంటికొసన అదిరితే హాని కలుగుతుందని దీనివల్ల తెలుస్తోంది. వామనేత్రమని ప్రత్యేకించి చెప్పక పోయినా మేఘుడు తీసికొని వెళ్ళే సందేశం ఆమెకు సంతోషం కలుగజేసే శుభఫలితాన్ని ఇవ్వబోతోంది కనుక వామాక్షి స్ఫురణమేనని సహృదయుడు ఊహించుకోగలడు. అలా సందర్భానుసారంగా ఊహించగలగడమే సహృదయుత. అందుకే మల్లినాథ సూరి తన వ్యాఖ్యానంలో "వామ మితిశేషః" అని వ్రాసేరు. అంతేకాక –

***"వామభాగస్తు నారీణాం పుంసాం శ్రేష్ఠ స్తుదక్షిణః ।***
***దానే దే వాదిపూజాయాం స్పన్దేఽలంకరణేఽపిచ ॥"***

అన్న ఆభాణకాన్ని కూడా ఉటంకించేరు. సరస్సులోని పద్మం నిశ్చలస్థితిలో నున్నప్పుడు నీటిలో పద్మం క్రింద భాగంలో చేపకదలికకు పద్మంకూడా కదలి సూర్య కిరణ

**తాత్పర్యం** : ఓ మేఘుడా ! నీ నెచ్చెలి నాయందు బద్ధాను రాగయుని నాకు తెలియును. అందువల్ల ఈ ప్రథమ వియోగంలో ఆమె ఇలా ఉండి ఉంటుందని నా భావన.( అంతేకాని) నేనేదో అందగాణ్ణనే అహం నన్ను వదరు బోతుగా చేయడంలేదు సుమా! సోదరా! నేచెప్పేదంతా నీకు త్వరలోనే సాక్షాత్కరిస్తుంది.

**'శ్రీకళా' వ్యాఖ్య** : స్త్రీ పురుషుల కలయిక తర్వాత మొట్టమొదటి ఎడబాటు బాధించినంతగా తదనంతర వియోగాలు బాధించవు. ఎవరికి వారు కొంచెం వెనక్కి వెళ్ళి ఆ రోజుల్లో ఎలా ఉందా? అని జ్ఞాపకం తెచ్చుకొంటే ఈ విషయం విశదమౌతుంది. వియోగ సందర్భంలో పురుషుడు స్త్రీని గూర్చి, స్త్రీ పురుషుని గూర్చి అవతలి వారెలా ఉంటారని ఊహించడం కూడా అత్యంత సహజమైందే. యక్షుడు మేఘునితో ఈ విషయాన్నే చెప్పి తానేదో మహా సుందరుణ్ణనే అహంకారం తన్నింతగా వాగించలేదనీ, తాను చెప్పిన మాటల్లో సత్యం మేఘునికి త్వరలోనే ( ఆమెను చూడడంతోటే) ప్రత్యక్షం కాగలదనీ చెబుతున్నాడు. అలం : కావ్యలింగం.

**రుద్ధాపాఙ్గ ప్రసరమలకై రఞ్జన స్నేహ శూన్యం**
**ప్రత్యాదేశాదపిచ మధునో విస్మృత భ్రూ విలాసమ్ ।**
**త్వయ్యాసన్నే నయనము పరిస్పన్ది శఙ్కే మృగాక్ష్యాః**
**మీనక్షోభాచ్చల కువలయ శ్రీతులామేష్యతీతి ॥** 32

**పదచ్ఛేదం** : రుద్ధాపాంగ ప్రసరం, అలకైః, అంజన స్నేహ శూన్యం, ప్రత్యాదేశాత్, అపి, చ, మధునః, విస్మృత భ్రూవిలాసం, త్వయి, ఆసన్నే, నయనం, ఉపరిస్పంది, శంకే, మృగాక్ష్యాః, మీనక్షోభాత్, చల, కువలయశ్రీ, తులాం, ఏష్యతి, ఇతి.

**అన్వయం**: అలకైః, రుద్ధాపాంగ ప్రసరం, అంజనస్నేహ శూన్యం, మధునః, ప్రత్యాదేశాత్, విస్మృత భ్రూవిలాసం, త్వయి, ప్రత్యాసన్నే, ఉపరిస్పన్ది, మృగాక్ష్యాః, నయనం, మీనక్షోభాత్, చల కువలయ శ్రీతులాం, ఏష్యతి, ఇతి, శంకే.

**ప్రతి పదార్థం** : అలకైః, రుద్ధ, అపాంగ ప్రసరం = ముంగురులు అడ్డుకొనిన క్రీగంటి చూపులు కలదియు; అంజన స్నేహశూన్యం = కాటుక సంపర్కము లేక; మధునః ప్రత్యాదేశాత్ = మద్యమును నిరాకరించుట ( విడచుట) చే; విస్మృత భ్రూ విలాసం = కనుబొమల ఒయారమును మఱచినదియునై; త్వయి, ప్రత్యాసన్నే, ఉపరిస్పంది = నీ సామీప్యము చేత పైన అదురుచున్న; మృగాక్ష్యాః నయనం = లేడికన్నుల వంటి కన్నులు కల ( ఆమె) కన్ను; మీనక్షోభాత్, చల, కువలయ, శ్రీ, తులాం = చేపకదలిక చే కదలిన

**'శ్రీకళ' వ్యాఖ్య** : యక్షుని భార్య వామోరు స్పందనం (ఎడమ తొడ అదరడం) ఇందులో ప్రస్తావించిన అంశం. ఆభ్యంతర అంగమైన ఊరువును ప్రస్తావించడం, అదీ తన భార్యకు సంబంధించి, అందునా పరుని ఎదుట – ఔచిత్య భంగం అని మనవంటి ఆధునిక భావావిష్టులకు అనిపించవచ్చు. అతను (యక్షుడు) కామి అనీ కామార్తులు చేతనా చేతన వస్తువిషయ విజ్ఞానహీనులనీ, పూర్వమేఘంలో ఐదవ శ్లోకంలోనే చెప్పేడు. అంతే కాకుండా ఒకరి విషయం మరొకరితో చెబుతున్నప్పుడు ఆ విశేషాలన్నీ దృశ్యమానంకావాలని ఎక్కడాలేదు. లౌకికంగా ''వాడిలా అనుకుంటాడు, అనుకుంటున్నట్లు పైకి చెప్పడు'' అంటూ ఉంటాం. ఒక వ్యక్తి మన దృష్టి పథంలోకి వచ్చినప్పుడు వారి నైజాన్ని, ఒక కబురు అందించినప్పుడు వారిలో కలిగే భావాల్నీ ఒక ధోరణిలో చెప్పుకు పోవడం లోక సహజం. యక్షునికి భార్య స్మృతి పథంలోకి రావడంతోనే ఆమెతో తాను పంచుకొన్న మధురానుభూతులు మదిలో మెదలి తన క్షేమవార్త ఆమె కందినప్పుడు ఆమెలో కలుగ బోయే స్పందనలని ఊహిస్తూ చెప్పుకుపోతున్నాడు – గట్టిగా మాట్లాడితే తనలో తాను భావిస్తున్నాడు కనుక ఇక్కడ అనౌచిత్య ప్రస్తావనేలేదు.

ఆమె ఎడమ తొడ స్పందిస్తుంది. ఈ ఊరు స్ఫురణం భావి సమాగమ శుభ సంకేతం. ఆవామోరు స్థలానికి కవివేసిన విశేషణాలు నాలుగు. ఆ తోడ చాలాకాలంగా (అంటే ఎనిమిది నెలలుగా) యక్షుని నఖక్షతాలకి దూరమైంది. నఖక్షతయోగ్యమైన ప్రదేశాల్ని 'రతిరహస్యం' – ***''కంఠకుక్షి, కుచ పార్శ్వ భుజోరః శోణి సక్థిషు నఖాస్పద మాహుః''*** అని పేర్కొంటోంది. ఇక రెండవ విశేషణం ముత్యాల హారం దుర్విధివశం చేత వీడినదని. ఈ హారం మెడలో వేసికొనేది కాదు. కటి భూషణం. ఊరువులపై నఖక్షతి వలన కలిగిన పీడకు శీతలత్వాన్నాపాదించడానికి ముత్యాల హారాన్ని మేఖలగా ధరించేవారానాటి స్త్రీలు. ఈ బాధ ఇప్పుడు లేదు కనుక ఆ హారం అవసరం లేక తీసివేసింది. ఇక మూడవది ఆ ఊరు ప్రదేశంలో రతిక్రీడాంతంలో యక్షుడు 'సంవాహన' చేసేవాడు. అంటే మర్దన. ''***సంవాహనం మర్దనం స్యాత్***'' అని అమరం. రతి క్రీడవలన ఆమె తొడలకు కలిగిన బాధ ప్రియుని సంవాహనంతో శమిస్తుంది. ఇక నాల్గవది ఆమె ఊరు సౌభాగ్యాన్ని ద్యోతకం చేసే విశేషణం. పండిన అరటి బోదె వలె తెల్లగా నున్నగా ఉంటుందనేది. ఈ ఊరు (వామోరు) స్ఫురణ ఫలాన్ని 'నిమిత్తనిదానం' ఈ విధంగా చెబుతోంది :

***''ఊరోః స్పన్దా ద్రతిం విద్యాదూర్వోః ప్రాప్తిం సువాససః''***

ప్రసారంతో తళుక్కుమంటుంది. వామభాగస్ఫురణంతో తనకు శుభంచేకూరబోతోందనే ఆశ ఆమె కంటిలో వెలుగును కలిగిస్తుంది. నిత్యజీవితంలో సుందర స్పృహలు వ్యక్తుల ముఖంలో ప్రతిఫలిస్తాయి. అంత గాఢంగా ఆలోచిస్తేనే కవితా సౌందర్యం అవగత మయ్యేది. అందుకే -

'' ***సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం।*** -''
''***ఏ కమాపాత మధురం అన్యదాలోచనామృతమ్.*** ॥'' అన్నారు
సాహిత్యం ఆలోచించిన కొద్దీ అమృతాన్ని వర్షిస్తుంది. అలం: ఉపమ.

**వామశ్చాస్యాః కరరుహపదైర్ముచ్యమానోమదీయై -**
**ర్ముక్తాజాలం చిరపరిచితం త్యాజితో దైవగత్యా ।**
**సంభోగాన్తే మమ సముచితో హస్త సంవాహనానాం**
**యాస్యత్యూరుః సరస కదలీ స్తమ్భగౌరశ్చలత్వమ్ ॥** 33

**పదచ్ఛేదం :** వామః, చ, అస్యాః, కరరుహపదైః, ముచ్యమానః, మదీయైః, ముక్తాజాలం, చిరపరిచితం, త్యాజితః, దైవగత్యా, సంభోగాంతే, మమ, సముచితః, హస్త సంవాహనానాం, యాస్యతి, ఊరుః, సరసకదలీస్తంభగౌరః, చలత్వమ్.

**అన్వయం :** మదీయైః, కరరుహపదైః, ముచ్యమానః, చిరపరిచితం, ముక్తాజాలం, దైవగత్యా, త్యాజితః, సంభోగాంతే, మమ, హస్తసంవాహనానం, సముచితః, సరసకదలీస్తంభ గౌరః, అస్యాః, వామ ఊరుః, చలత్వం, యాస్యతి.

**ప్రతిపదార్థం :** మదీయైః, కరరుహపదైః, ముచ్యమానః = నా నఖక్షతములు లేనిదియు; చిరపరిచతం, ముక్తాజాలం, దైవగత్యా, త్యాజితః = పరిచితమైన ముత్యాల హారమును విధివశమున వీడినట్టియు; సంభోగాంతే, మమ, హస్తసంవాహనానాం, సముచితః = రతికేళి అవసానంలో నా చేతి మర్దనకు అర్హమైనదియు; సరసకదలీస్తంభగౌరః, అస్యాః, వామ ఊరుః, చలత్వం యాస్యతి = పండిన అరటి బోదెవలె తెల్లనైన ఆమె ఎడమ తొడ స్పందించగలదు.

**తాత్పర్యం :** నానఖక్షతములులేనిదియు, పరిచితమైన ముత్యాల హారమును దుర్విధివశమున వీడినదియు, రతికేళి అవసానంలో నా చేతి మర్దనకు అర్హమై పండిన అరటి బోదెవలె తెల్లనైన ఆమె ఎడమ తొడ స్పందనము నొందును.

'శ్రీకళా' వ్యాఖ్య : మేఘుడు యక్షపత్నిని దర్శించేటప్పటికి ఒకవేళామె నిద్రిస్తూ ఉండి ఉంటే ఒక 'యామం' (జాముసేపు) నిరీక్షించమని అర్థిస్తున్నాడు యక్షుడు. 'జాము' శబ్దానికి ఏడున్నర గడియల కాలమని అర్థం. భారతీయ కాల ప్రమాణంలో ఘడియలు, విఘడియలు ప్రసిద్ధమైనవి. 24 నిమిషాలు ఒక ఘడియ, 24 సెకండ్లు ఒక విఘడియ (ప్రస్తుత కాలమానంలోకి పరివర్తన చేసికొంటే) $7^1/_2$ గడియలంటే 180 నిమిషాలు. అంటే 3 గంటలు. పగలు 4 జాములు, రాత్రి నాలుగు జాములు. 3 గంటల కాలం నిరీక్షణ ఎందుకంటే – ఆమెకు పట్టక పట్టక పట్టిన నిద్రలో రాక రాక వచ్చిన స్వప్నంలో ఎప్పుడూ యక్షుని గూర్చే చింతిస్తూ ఉంటుంది కనుక లేక లేక కలిగిన భర్తృ సమాగమ మావధి 'యామ' కాలం, జాముసేపన్న మాట. మేఘుడు ఈలోగా గర్జించి ఆమెకు నిద్రాభంగం కలుగ జేస్తే ఆకాస్త స్వప్న సుఖానికి కూడా ఆమెదూరమౌతుంది. 'రతిరహస్యం' అనే గ్రంథంలో.

> **''ఏక వారా వధిర్యామో రతస్య పరమోమతః।**
> **చణ్డ శక్తి మతోర్యూనోరుద్భట క్రమవర్తినోః॥''**

అని మిక్కిలి దేహదార్ఢ్యం కలిగిన యువతీ యువకుల ఒకసారి సురతం జాముసేపని చెప్పడం జరిగింది. కాని వాస్తవంలో ఉన్నకాలావధి స్వప్నంలో ఉండదు. అయితే యక్షుడు అసలే విరహ పీడితుడు కనుక ఈ విచక్షణ చేయక జాముసేపు నిరీక్షించ మన్నాడు. అతనికీ స్థితి ఎలాగూ లేదని, పుర్వమేఘంలో ''ధూమజ్యోతి స్సలిలమరుతాం ....'' అనే శ్లోకంలో కాళిదాసు చెప్పనే చెప్పేడు. అలం : సంకరం.

> **తాముత్థాప్య స్వజలకణికా శీతలేనానిలేన**
> **ప్రత్యాశ్వస్తాం సమమభినవైర్జాలకైర్మాలతీ నామ్।**
> **విద్యుద్గర్భః స్తిమితనయనాం త్వత్సనాథే గవాక్షే**
> **వక్తుం ధీరః స్తనితవచనైర్మానినీం ప్రక్రమేథాః॥** 35

**పదచ్ఛేదం :** తాం, ఉత్థాప్య, స్వ, జలకణికాశీతలేన, అనిలేన, ప్రత్యాశ్వస్తాం, సమం, అభినవైః, జాలకైః, మాలతీనాం, విద్యుద్గర్భః, స్తిమిత నయనాం, త్వత్, సనాథే, గవాక్షే, వక్తుం, ధీరః, స్తనితవచనైః, మానినీం, ప్రక్రమేథాః.

**అన్వయం :** తాం, స్వజలకణికా శీతలేన, అనిలేన, ఉత్థాప్య, అభినవైః, మాలతీనాం, జాలకైః, సమం, ప్రత్యాశ్వస్తాం, త్వత్ సనాథే, గవాక్షే, స్తిమితనయనాం, మానినీం,

'కదలీస్తమ్భగౌర'కు బదులుగా 'కదలీగర్భ' అనే మరో పాఠాంతరం ఉంది. అరటిపై బోదె కంటె, లోపలి భాగం మరింత తెల్లగా, మరింత నున్నగా ఉంటుంది. ఇది ''కదలీగర్భగౌరః అనే పాఠాన్ని స్వీకరించినవారి అభిప్రాయమైతే'' కనక కదలీ వేష్టన ప్రేక్షణీయః'' అని 14వ శ్లోకంలో చెప్పేడు కనుక ఆ ఊరుద్వయ సౌభాగ్యం బంగారు అరటి బోదెల ధగద్ధగలతో కూడి ఉంటుందని 'కదలీస్తంభ గౌర' పాఠాన్ని స్వీకరించిన వారి అంతర్యం. అలం: ఉపమ.

**తస్మిన్కాలే జలదయదిసా లబ్ధనిద్రాసుఖాస్యా -**
**దన్వాస్యైనాం స్తనితవిముఖో యామమాత్రం సహస్వ।**
**మాభూదస్యాః ప్రణయిని మయి స్వప్నలబ్ధే కథంచి -**
**త్సద్యః కణ్ఠచ్యుత భుజలతాగ్రన్థి గాఢోప గూఢమ్.॥** 34

**పదచ్ఛేదం**: తస్మిన్, కాలే, జలద, యది, సా, లబ్ధ నిద్రా సుఖాస్యాత్, అన్వాస్య, ఏనాం, స్తనిత విముఖః, యామమాత్రం, సహస్వ, మాభూత్, అస్యాః, ప్రణయిని, మయి, స్వప్నలబ్ధే, కథంచిత్, సద్యః, కంఠచ్యుత భుజలతా గ్రంథి, గాఢ + ఉప గూఢమ్.

**అన్వయం** : (హే)జలద ! తస్మిన్ కాలే, సా, యది లబ్ధనిద్రా సుఖాస్యాత్, ఏనాం, అన్వాస్య, స్తనితవిముఖః, యామమాత్రం, సహస్వ; అస్యాః, ప్రణయిని, మయి, కథంచిత్, స్వప్నలబ్ధే, గాఢోపగూఢం, సద్యః, కంఠచ్యుత భుజ లతాగ్రంధి, మాభూత్.

**ప్రతిపదార్థం :** (హే) జలద ! తస్మిన్కాలే, సా, యది, లబ్ధ, నిద్రా సుఖా స్యాత్ = ఓ మేఘుడా ! ఆ (నువ్వు చూసేటప్పటికి) సమయమున ఆమె నిద్రా సుఖం అనుభవిస్తూ ఉంటే; ఏనాం, అన్వాస్య, స్తనిత విముఖం యామమాత్రం సహస్వ = ఆమె చెంతజేరి ఉఱుమక జాముసేపు నిరీక్షించుము; అస్యాః ప్రణయిని మయి కథంచిత్ స్వప్నలబ్ధే = (ఏలనన) ఈ నా ప్రేయసికి ఎలాగునో స్వప్నమున లభించిన, గాఢోపగూఢం, సద్యః, కంఠచ్యుత భుజలతాగ్రంధి= గాఢ పరిష్వంగం హఠాత్తుగా కంఠమునుండి జారిన భుజ బంధము; మాభూత్ = కారాదు.

**తాత్పర్యం**: ఓమేఘుడా! నువ్వామెను చూచేటప్పటికి ఒకవేళ ఆమె నిద్రాసుఖ పరవశయై ఉంటే ఆమె చెంత జేరి సద్దు చేయక ఒక జాముసేపు నిరీక్షింము. (ఎందుకంటే) పట్టకపట్టిన నిద్రలో స్వప్నంలో లభించిన నా కౌగిలింత హటాత్తుగా చెదిరిపోరాదు. (దానివల్ల ఆమె దుఃఖం మరింత ఎక్కువౌతుంది కనుక.)

**అన్వయం :** అవిధవే, మాం, భర్తుః, ప్రియం, మిత్రం, హృదయనిహితైః, తత్, సందేశైః, త్వత్, సమీపం, ఆగతం, అంబువాహం, విద్ధి; యః, అబలావేణి మోక్షోత్సుకాని, పథి, శ్రామ్యతాం, ప్రోషితానాం, బృందాని, మంద్ర స్నిగ్ధైః, ధ్వనిభిః, త్వరయతి.

**ప్రతిపదార్థం :** (హే) అవిధవే = ఓ సౌభాగ్యవతీ!; మాం, భర్తుః ప్రియం, మిత్రం = నన్ను (నీ) భర్తయొక్క ప్రియమిత్రుడును; హృదయ నిహితైః, తత్, సందేశైః = మనసులో నుంచిన ఆతని సందేశములతో; త్వత్, సమీపం, ఆగతం, అంబువాహం, విద్ధి = నీవద్దకు వచ్చిన మేఘుని గను తెలిసికొనుము; యః, అబలావేణి, మోక్షోత్సుకాని = ఏ నేను స్త్రీల కేశపాశ మోక్షణయందు ఆతురత కలిగిన; పథి, శ్రామ్యతాం, ప్రోషితానాం, బృందాని = మార్గమున దిగులు చెందిన దేశాంతర గతులైన (భర్తల) సమూహమును; మంద్ర స్నిగ్ధైః, ధ్వనిభిః, త్వరయతి = మృదుగంభీర ధ్వనులతో త్వర పెట్టుచున్నానో.

**తాత్పర్యం :** ఓ సౌభాగ్యవతీ! నన్ను నీభర్తయొక్క ప్రియమిత్రుడును, ఆతని సందేశమును హృదయములో పదిలపఱచుకొని వచ్చినవానినిగను, ఎవడు స్త్రీల కేశపాశ మోక్షణమునకై ఆతురపడుచు మార్గమున దిగులు పడుచున్న బాటసారులను మృదుగంభీర ధ్వనులతో త్వరపెట్టు చున్నానో అట్టి మేఘునిగను తెలిసికొనుము.

**'శ్రీకళా' వ్యాఖ్య :** 'ధవుడు' అంటే భర్త. 'విధవ' అంటే ''విగతాధవాయస్యాసా విధవా'' భర్తలేనిది, భర్తమరణించినది. 'అవిధవ' అంటే సభర్తృక – సౌభాగ్యవతి అని అర్థం ఈనాడు సమాజంలో 'విధవ' శబ్దానికున్న శబ్దపారుష్యం కాళిదాసు కాలానికి లేకపోయి, ఉండాలి. అందుకే 'అవిధవా' అని ఆయన సంబోధింపచేసేడు. వాల్మీకి రామాయణంలో కూడా ఇటువంటి సంబోధన ఉంది. భాషలో కొన్ని శబ్దాలు ఒక కాలంలో దోషంగా పరిగణించనివి కాలాంతరంలో కాఠిన్యాన్నీ, అసహ్యయుతను ఆపాదించుకొంటూ ఉండడం సహజం. 'సౌభాగ్యవతి' అనే సంబోధన స్త్రీలకు ప్రీతిని కలిగించి సందేశహరుల పట్ల సుహృద్భావాన్ని కల్గిస్తుంది. అలం : పరికరం.

**ఇత్యాఖ్యాతే పవనతనయం మైథిలీవోన్ముఖీసా**
**త్వాముత్కణ్ఠోచ్ఛ్వసిత హృదయా వీక్ష్య సంభావ్యచైవ ।**
**శ్రోష్య త్యస్మాత్పర మవహితా సౌమ్య సీమన్తినీనాం**
**కాన్తోదన్త సుహృదుపనతః సంగమాత్కించి దూనః ॥** 37

**పదచ్ఛేదం :** ఇతి, ఆఖ్యాతే, పవనతనయం, మైథిలీ ఇవ, ఉన్ముఖీ, సా, త్వాం, ఉత్కంఠః, ఉచ్ఛ్వసిత హృదయా, వీక్ష్య, సంభావ్య, చ, ఏవ, శ్రోష్యతి, అస్మాత్ పరం, అవహితా,

విద్యుద్గర్భః, ధీరః స్తనితవచనైః, వక్తుం, ప్రక్రమేథాః.

**ప్రతిపదార్థం** : తాం, స్వజలకణికాశీతలేన, అనిలేన, ఉత్థాప్య = ఆమెను నీలోని నీటితో చల్లనైన గాలితో (నిద్ర) లేపి; అభినవైః, మాలతీనాం, జాలకైః, సమం ప్రత్యాశ్వస్తాం = అప్పుడే పూచిన జాజిపూల (సువాసనచే) ఊరడించిన; త్వత్ సనాథే గవాక్షేస్తిమితనయనాం, మానినీం = నీవున్న కిటికీ వైపు నిశ్చలముగా చూచుచున్న మనస్వినిని; విద్యుద్గర్భః, ధీరః, స్తనిత వచనైః, వక్తుం, ప్రక్రమేథాః = సౌదామనీయుక్తుడ వై ధీరతతో ఉఱుములను వచనముల పలుకుట కుపక్రమింపుము.

**తాత్పర్యం** : ఆమెను నీలోని జలముతో కూడిన చల్లగాలితో నిద్ర లేపి అప్పుడే పూచిన జాజిపూల (పరిమళములతో) సేదదేరి, నీవున్న కిటికీ వైపు నిశ్చలముగా చూచుచున్న మనస్వినిని సౌదామనీ యుక్తుడవై ధీరతతో ఉఱుములనే వచనాలతో పలుకుట కుపక్రమింపుము.

**'శ్రీకళా' వ్యాఖ్య** : గత శ్లోకంలో ఆమెకి నిద్రా భంగం ఎందుకు కలిగించ కూడదో చెప్పేడు. అదంతా యథాతథంగా జరిగినట్లే భావిస్తూ స్వప్న సంగమంలో కూడ యథార్థ సురతంలోవలె ఆమె బడలినట్లు భావించి జాజి పుష్పపరిమళయుక్తమైన చిరుచినుకులతో ఆమెను నిద్ర లేపమని చెబుతున్నాడు. గవాక్షంలో నుంచి మేఘుని చూచి పరపురుషడని ఆమె సందేశవిముఖ అవుతుందేమోనని తర్కించి విద్యుల్లతాయుక్తుడవుకమ్మంటున్నాడు. పరపురుషుడు స్త్రీ యుక్తుడై వచ్చినప్పుడు సందేహానికి ఆస్కారం ఉండదు. మెఱుపు మెఱిసినప్పుడు వస్తువు దృగ్గోచరం కాదుకనుక పరపురుష దర్శనం ఆమెకు ఏ విధంగానూ కలుగదు. కనుక గర్జనలనే శబ్దాలతో సందేశాన్ని వినిపించవచ్చునని చమత్కారం. అలం : సంసృష్టి.

**భర్తుర్మిత్రం ప్రియమవిధవే విద్ధిమామమ్బువాహం**
**తత్సందేశైర్హృదయ నిహితై రాగతం త్వత్సమీపమ్ ।**
**యో బృన్దాని త్వరయతి పథిశ్రామ్యతాం ప్రోషితానాం**
**మన్ద్ర స్నిగ్ధై ర్ధ్వ నిభి రబలా వేణి మోక్షోత్సు కాని ॥** **36**

**పదచ్ఛేదం** : భర్తుః, మిత్రం, ప్రియం, అవిధవే, విద్ధి, మామ్, అంబువాహం, తత్, సందేశైః, హృదయ నిహితైః, ఆగతం, త్వత్, సమీపం, యః, బృందాని, త్వరయతి, పథి, శ్రామ్యతాం, ప్రోషితానాం, మంద్రస్నిగ్ధైః, ధ్వనిభిః, అబలావేణి మోక్ష+ ఉత్సుకాని.

**తామాయుష్మన్మమచ వచనా దాత్మ నశ్చోప కర్తుం**
**బ్రూయాదేవం తవ సహచరో రామగిర్యాశ్రమస్థః।**
**అవ్యాపన్నః కుశలమబలే పృచ్ఛతి త్వాం వియుక్తః**
**పూర్వా భాష్యం సులభ విపదాం ప్రాణినామేత దేవ ॥ 38**

**పదచ్ఛేదం** : తాం, ఆయుష్మన్, మమ, వచనాత్, ఆత్మనః, చ, ఉపకర్తుం, బ్రూయాత్, ఏవం, తవ, సహచరః, రామగిరి + ఆశ్రమ స్థః, అవ్యాపన్నః, కుశలం, అబలే, పృచ్ఛతి, త్వాం, వియుక్తః, పూర్వాభాష్యం, సులభవిపదాం, ప్రాణినాం, ఏతత్, ఏవ.

**అన్వయం** : ఆయుష్మన్!, మమ, వచనాత్, ఆత్మనః, ఉపకర్తుం, చ, తాం, ఏవం, బ్రూయాత్, అబలే ! తవ, సహచరః, రామగిరి + ఆశ్రమస్థః, వియుక్తః, త్వాం, కుశలం, పృచ్ఛతి, సులభవిపదాం, ప్రాణినాం, ఏతత్ + ఏవ, పూర్వాభాష్యం.

**ప్రతిపదార్థం** : (హే) ఆయుష్మన్ = ఓ చిరంజీవీ; మమ, వచనాత్, ఆత్మనః ఉపకర్తుం, చ = నామాట వలన, నీకునీవు ఉపకరించుట కొఱకు; తాం, ఏవం, బ్రూయాత్ = ఆమెకిట్లు చెప్పదగినది; (హే) అబలే ! = ఓ స్త్రీ !; రామగిర్యాశ్రమస్థః, వియుక్తః, తవసహచరః = రామగిరి ఆశ్రమ మందున్న వియోగియైన నీ ప్రియుడు; త్వాం, కుశలం, పృచ్ఛతి = నీ క్షేమమునడుగుచున్నాడు; సులభవిపదాం, పూర్వాభాష్యం, ఏతత్, ఏవ = దైవాయత్తమైన ఆపదలనొందిన వారికి తొలుత చెప్పవలసినదిదే.

**తాత్పర్యం** : 'ఓ చిరంజీవీ !' (మేఘుని సంబోధన) నామాట వలన, నీకునీవు ఉపకరించుట కోసం ఆమెతో ఇలా ప్రారంభించు. రామగిర్యాశ్రమమునున్న వియోగదుఃఖితుడైన, నీ ప్రియుడు నీ క్షేమమునరయుచున్నాడు. దైవాయత్తమైన ఆపదలనొందిన వారికి తొలుత చెప్పవలసినదిదియే.

**'శ్రీకళా' వ్యాఖ్య** : 'చిరంజీవీ !' అని మేఘుని సంబోధించడంలో అతనితో చనువు వెలిపినట్లు. నీకు నువ్వు ఉపకరించుకోవడంకోసం ఆమెకు నావార్తనందజేయమన్నాడు యక్షుడు. అంటే – ఈ దౌత్యంవల్ల మేఘునికి పరోపకారలబ్ధి నాపాదిస్తున్నాడు. మనం ఎవరినైనా ఏదైనా సాయంకోరినప్పుడు ''కాస్త ఈ పని చేసి పెడుదూ నీకు పుణ్యముంటుంది.'' అంటామే, ఆలోక వ్యవహారం. పరోపకారంవల్ల వ్యక్తి కృతార్థుడౌతాడు. అలం: అర్థాంతరన్యాసం.

సౌమ్య, సీమంతినీనాం, కాన్తోదంతః, సుహృత్, ఉపనతః, సంగమాత్, కించిత్, ఊనః.

**అన్వయం** : ఇతి, ఆఖ్యాతే, పవన తనయం, మైథిలీ, ఇవ, సా, ఉన్ముఖీ, ఉత్కంఠ ఉచ్ఛ్వసిత హృదయా, త్వాం, వీక్ష్య, సంభావ్యచ, అస్మాత్ పరం, అవహితా, శ్రోష్యతి ఏవ. (హే) సౌమ్య! సీమంతి నీనాం, సుహృదుపనతః, కాంత + ఉదంతః, సంగమాత్, కించిత్ ఊనః.

**ప్రతిపదార్థం** : ఇతి, ఆఖ్యాతే, పవనతనయం, మైథిలీ, ఇవసా = (నీవు) ఇలా చెబితే హనుమంతుని సీతవలె ఆమె (నా ప్రేయసి); ఉన్ముఖీ, ఉత్కంఠ ఉచ్ఛ్వసిత హృదయా = మోమెత్తి ఉత్కంఠతో సమాహిత చిత్తయై; త్వాం, వీక్ష్య, సంభావ్య, చ, అస్మాత్, పరం = నిన్ను చూచి, ఆదరంతో సన్మానించిన పిదప; అవహితా, శ్రోష్యతి, ఏవ = సావధానురాలై తప్పక వినును (వినినే వింటుంది); (హే) సౌమ్య = ఓ సాధుశీలీ!; సీమంతి నీనాం, సుహృత్, ఉపనతః కాన్త + ఉదన్తః = సౌభాగ్యవతులకు మిత్రులు తీసికొని వచ్చిన ప్రియుల వార్తలు; సంగమాత్, కించిత్, ఊనః = సమాగమమునకు కొంచెం తక్కువైనవి (దాదాపుగా సమాగమమంత సుఖమైనవి).

**తాత్పర్యం** : నువ్విలా మాట్లాడడంతోనే (శ్రీరామ సందేశమును తెచ్చిన) హనుమంతుని సీతవలె నా ప్రేయసి కూడమోమెత్తి ఉత్కంఠతో సమాహిత చిత్తయై నిన్నుచూచి, ఆదరంతో సన్మానించిన పిదప సావధానురాలై తప్పక వింటుంది. ఓ సాధుశీలీ! సౌభాగ్య వతులకు మిత్రులు తీసికొనివచ్చిన ప్రియులవార్తలు సమాగమ సుఖానికి ఒక రవ్వ తక్కువైనవి. (అంటే ఇంచుమించు సమాగమం అంతసుఖాన్నిచ్చేవని భావం.)

**'శ్రీకళా' వ్యాఖ్య**: యక్షుడు సందేశహరుడైన మేఘునితో తన భార్యను సమీపించవలసిన విధానం, ఆమెను సంబోధించవలసిన తీరు చెప్పి, నువ్విలా చేసినప్పుడు శ్రీరామ చంద్రుని సందేశాన్ని గొనివచ్చిన హనుమంతుని వలె నిన్ను సంభావిస్తుందని చెప్పడంలో తన భార్య సీతాదేవి వంటిదని చెప్పినట్లైంది. మేఘునికి భగవంతుడైన హనుమంతునికిచ్చి నంత ప్రాధాన్యం ఇవ్వడం తన కార్యసిద్ధికి చక్కని సోపానం. శ్రీరామ చంద్రుడూ తన భార్యకే సందేశాన్ని పంపేడు. తాను తన భార్యకే కనుక సందేశ పవిత్రత ద్యోతక మౌతోంది.

అసలు కాళిదాసు 'మేఘదూతం' వ్రాయడానికి రామాయణంలోని హనుమత్సందేశమే స్ఫూర్తినిచ్చిందని విజ్ఞుల అభిప్రాయం. అలం : సంసృష్టి.

అనుభూతి భౌతిక వియోగాన్ని పరిగణించదు. అలం : సమం.

**శబ్దాఖ్యేయం యదపి కిలతే యః సఖీనాం పురస్తా -**
**త్కర్ణే లోలః కథ యితుమభూదానన స్పర్శలోభాత్ ।**
**సోఽతిక్రాన్తః శ్రవణ విషయంలోచనాభ్యామ దృష్ట -**
**స్త్వాముత్కణ్ఠా విరచిత పదం మన్ముఖే నేదమాహ ॥** 40

**పదచ్ఛేదం :** శబ్ద + ఆఖ్యేయం, యత్, అపి, కిల, తే, యః, సఖీనాం, పురస్తాత్, కర్ణే, లోలః, కథయితుం, అభూత్, ఆనన స్పర్శలోభాత్, సః, అతిక్రాన్తః, శ్రవణ విషయం, లోచనాభ్యాం, అదృష్టః, త్వాం, ఉత్కంఠా, విరచితపదం, మత్+ ముఖేన, ఇదం, ఆహ.

**అన్వయం :** యః, సఖీనాం, పురస్తాత్, ఆనన స్పర్శలో భాత్, శబ్ద + ఆఖ్యేయం, యత్ + అపి, కర్ణే, కథయితుం, లోలః, అభూత్, కిల; శ్రవణవిషయం, అతిక్రాంతః, లోచనాభ్యాం, అదృష్టః, సః, త్వాం, ఉత్కంఠావిరచిత పదం, ఇదం, మత్ + ముఖేన, ఆహ.

**ప్రతిపదార్థం :** యః, సఖీనాం, పురాస్తాత్, ఆననస్పర్శలోభాత్ = ఏనీ ప్రియుడు చెలికత్తెల ఎదుట (నీ) ముఖస్పర్శ సుఖేచ్ఛతో; శబ్దాఖ్యేయం, యదపి, కర్ణే కథయితుంలోలః అభూత్, కిల = పైకి చెప్పతగిన ఏమాటనైనను చెవిలో చెప్పగోరెనో (చెప్పేవాడట కదా!) శ్రవణ విషయం, అతిక్రాంతఃలోచనాభ్యాం, అదృష్టః, సః = వినబడనంత దూరంలో ఉన్న ఆ నీ ప్రియుడు; త్వాం, ఉత్కంఠా విరచితపదం, ఇదం, మన్ముఖేన, ఆహ = నీతో ఉత్కంఠతో ఈ మాటలను నాముఖముగా పలికెను.

**తాత్పర్యం :** ఏనీ ప్రియుడు (పూర్వం) చెలికత్తెల ఎదుట చెప్పదగిన విషయమే అయినా నీ ముఖ స్పర్శలోభంతో రహస్యం అనే నెపంతో చెవిలో చెప్పేవాడో ఆ నీ ప్రియుడు (ఇప్పుడు) చెప్పినా వినబడనంత, కంటికి కనిపించనంత దూరంలో ఉండి ఉత్కంఠతో నీతో పలుకవలసిన మాటలను నాముఖంగా పలికేడు (విను.)

**'శ్రీకళా' వ్యాఖ్య:** యక్షుడు తన ప్రియురాలితో కలసి ఉన్నప్పుడు చేసిన రహస్య చేష్టలను ప్రస్తావిస్తున్నాడు. అతని ప్రేయసికి మేఘుడు నిజంగా యక్షుని వద్దనుంచే సందేశం తీసికొని వచ్చేడన్న విశ్వాసం కలిగించడం కోసం – పూర్వం ఇలా చేసేవాడట కదా (అభూత్, కిల) ఇలా అయిందట కదా! ఇత్యాది వాక్యాలు చెప్పడంవల్ల ఆ జరిగిపోయిన సన్నివేశం నిజంగా జరిగిందే కనుక ఆమెకు మేఘునిపై విశ్వాసం కలుగుతుంది. చెలికత్తెల

**అజ్గేనాఙ్గం ప్రతను తనునా గాఢతప్తేన తప్తం**
**సాస్రేణా శ్రుద్రుత మవిరతోత్కణ్ఠ ముత్కణ్ఠితేన ।**
**ఉష్ణోచ్ఛ్వాసం సమధిక తరోచ్ఛ్వాసినా దూరవర్తీ**
**సంకల్పైస్తైర్విశతి విధినా వైరిణా రుద్ధమార్గః ॥** 39

**పదచ్ఛేదం** : అంగేన, అంగం, ప్రతను, తనునా, గాఢతప్తేన, తప్తం, స + అస్రేణ, అశ్రుద్రుతం, అవిరత + ఉత్కంఠం, ఉత్కంఠితేన, ఉష్ణ + ఉచ్ఛ్వాసం, సమధికతరః, ఉచ్ఛ్వాసినా, దూరవర్తీ ,సంకల్పైః, తైః, విశతి, విధినా, వైరిణా, రుద్ధమార్గః.

**అన్వయం** : దూరవర్తీ, వైరిణా, విధినా, రుద్ధమార్గః, తనునా, గాఢతప్తేన, సాస్రేణ, ఉత్కంఠితేన, సమధిక తరః, ఉచ్ఛ్వాసినా, అంగేన, ప్రతను, తప్తం, అశ్రుద్రుతం, అవిరత+ ఉత్కంఠం, ఉష్ణ + ఉచ్ఛ్వాసం, అంగం, తైః, సంకల్పైః, విశతి.

**ప్రతిపదార్థం** : దూరవర్తీ, వైరిణా, విధినా, రుద్ధమార్గః = దూరమువనుండి దైవప్రాతికూల్యముచే మార్గావరోధము కల్గిన; తవ సహచరః = నీ ప్రియుడు ( క్రిందటి శ్లోకంనుంచి అనువృత్తి); తనునా, గాఢతప్తేన = లోతైన అనుతాపముచే చిక్కినట్టియు; స+ అస్రేణ, ఉత్కంఠితేన = కన్నీటితో కూడిన ప్రతీక్షతో; సమధికతర ఉచ్ఛ్వాసినా అంగేన = లెక్కకు మిక్కిలిగ నిట్టూర్పులతో నున్న దేహమును; ప్రతను, తప్తం, అశ్రుద్రుతం = మిక్కిలి శుష్కించి వియోగ భారంతో కన్నీటి తోవాడి; అవిరత ఉత్కంఠం, ఉష్ణఉచ్ఛ్వాసం(తే) అంగం = విశ్రాంతి నెఱుఁగని ప్రతీక్షతో వేడినిట్టూర్పులతో న్ను (నీ) శరీరమును; తైః, సంకల్పైః = స్వీయమనోరథమాత్రముననే; విశతి = చేర్చుచున్నాడు.

**తాత్పర్యం**: దైవ ప్రాతికూల్యంతో దూరాన ఉంటూ మార్గావరోధం కలిగిన నీ ప్రియుడు తాపంతో చిక్కి కన్నీరు నిండిన ప్రతీక్షతో ప్రబలమైన నిట్టూర్పులతో కూడిన తన దేహం వియోగ భారంతో శుష్కించగా, కన్నీటితో వాడి, విశ్రాంతి నెఱుగని ప్రతీక్షతో వేడి నిట్టూర్పులతో నున్న నీ దేహంతో స్వీయ సంకల్పంతో మాత్రమే చేర్చుచున్నాడు.

**'శ్రీకళా' వ్యాఖ్య** : వియోగంలో సంయోగాన్ని కవి అత్యంతరమణీయంగా ఇందులో పొందుపఱచేడు. ఈ వియోగం కాంక్షించింది కాదు. దుర్విధి సమానీతమైంది. దైవం బలీయమైనపుడు పౌరుషం వృధా. కనుక రాబోయే 47వ శ్లోకంలో చెప్పినట్లు కళ్ళుమూసికొని కాలం గడపడం తప్ప కర్తవ్యం కనిపించదు. వాంఛ బలీయమైనప్పుడు ఒకే విధమైన వియోగ భారం ప్రేమికుల్లో సమతౌల్యం వహించినప్పుడు భౌతికంగా వారు దూరంగా ఉన్నప్పటికీ అనుక్షణం కలిసే ఉన్న అనుభూతి నొందుతారు. ఆ

**'శ్రీకళా' వ్యాఖ్య:** ఇక్కడ నుంచి యక్షుడు తనభార్యకు పంపిన సందేశం, ప్రారంభమైనట్లు. ఆమె అందాన్ని తాను నిత్యం ఎలా భావిస్తున్నాడో ప్రతి క్షణం ఏయే వస్తువులో తన ప్రేయసి ఏక దేశమైన సౌందర్యం దర్శన మిస్తోందో చెప్పేడు. ఆమె శరీరం ప్రియంగులత వలె నున్న దనికాక ప్రియంగులతని చూస్తే ఆమె శరీర సౌకుమార్యం స్ఫురణకు వస్తోందనడంవల్ల ఆ ఒక్క సౌకుమార్య గుణంలోనే ఉపమానం. అలాగే మిగతావాటిలో కూడ. అయితే ''అవి ఉన్నాయి కదా ! ఇక మీకు నేనెందుకు?'' అని తన మీద కోపగిస్తుందేమోనని ''నీ సమగ్రమైనపోలిక దేనియందూలేదు'' అని అనునయిస్తున్నాడు. 'చండి' అనే ప్రయోగం 'చండ ప్రచండమైన కోపం కలది' అనే అర్థంలో పరిచితమైనదే. అయితే ఇది వాచ్యార్థంలో కాకుండా శృంగార ప్రవృత్తితో ముద్దుగా సంబోధించడం. అలం : స్మరణం.

**త్వా మాలిఖ్య ప్రణయకుపితాం ధాతురాగైశ్శిలయా**
**మాత్మానంతే చరణపతితం యావదిచ్ఛామి కర్తుమ్ ।**
**అస్రైస్తావన్ముహురుప చితైర్దృష్టి రాలుప్యతేమే**
**క్రూరస్తస్మిన్నపి న సహతే సఙ్గమం నౌకృతాన్తః ॥** 42

**పదచ్ఛేదం** : త్వాం, ఆలిఖ్య, ప్రణయ కుపితాం, ధాతురాగైః, శిలాయాం, ఆత్మానం, తే, చరణపతితం, యావత్, ఇచ్ఛామి, కర్తుం, అస్రైః, తావత్, ముహుః, ఉపచితైః, దృష్టిః, ఆలుప్య, తే, మే, క్రూరః, తస్మిన్, అపి, న, సహతే, సంగమం, నౌ, కృతాంతః.

**అన్వయం**: ప్రణయకుపితాం, త్వాం, ధాతురాగైః, శిలాయాం, ఆలిఖ్య, ఆత్మానం, తే, చరణపతితం, కర్తుం, యావత్, ఇచ్ఛామి, తావత్, ముహుః, ఉపచితైః, అస్రైః, మే, దృష్టిః, ఆలుప్యతే, క్రూరః, కృతాంతః, తస్మిన్, అపి, నౌ, సంగమం, న, సహతే.

**ప్రతిపదార్థం** : ప్రణయకుపితాం, త్వాం, ధాతురాగైః, శిలయాం, ఆలిఖ్య = ప్రణయ కోపమునొందిన నిన్నుధాతుజ వర్ణములతో ఱాతిపై లిఖించి; ఆత్మానం, తే, చరణపతితం, కర్తుం, యావత్, ఇచ్ఛామి = నన్ను నీ పాదములపై వ్రాలిన వానినిగా చేయునంతలో; తావత్, ముహుః, ఉపచితైః, మే, దృష్టిః, ఆలుప్యతే = మాటిమాటికి ఉబికి వచ్చిన కన్నీటితో నాదృష్టి కప్పబడినది; క్రూరః, కృతాంతః, తస్మిన్నపి, నౌ, సంగమం న, సహతే = కఠినమైన దైవము దాని (చిత్రము) యందైనను మన కలయిక నోర్వలేకున్నాడు.

**తాత్పర్యము** : ప్రణయ కోపమునొందిన నిన్నుధాతుజ వర్ణములతో ఱాతిపై లిఖించి నన్ను నీ పాదములపై వ్రాలిన వానినిగా చిత్రించునంతలో కన్నీరుబికి నా దృష్టిని

సమక్షంలో హఠాత్తుగా తన ప్రియురాలి ముఖం, స్పృశించాలనికాని, ఆమె అధరపానం చేయాలని కాని కోరిక కలిగిన సందార్భాల్లో పైకి చెప్ప తగ్గిన మాటే అయినా రహస్యమనే మిషతో చెవిలో చెప్పడానికి ప్రయత్నించేవాడు. అలా దగ్గరకు వస్తే చెలికత్తెలు చూడకుండా చూసి గబుక్కున అధర పానం చేయడమో, ముద్దిడు కోవడమో, అధమపక్షం కేవల స్పర్శ సుఖం అనుభవించడమో జరిగేది. ఆ సన్నివేశాన్ని గుర్తు చేస్తూ ఆ ప్రియుడే ఇప్పుడు తానుగా చెప్పినా వినబడనంత దూరంలో ఉన్నాడు కనుక ఉత్కంఠా ప్రపూర్ణమైన వాక్యాలు నా ముఖంగా పలుకుతున్నాడు (వినుమంటున్నాడు).

**శ్యామాస్వఙ్గం చకిత హరిణీ ప్రేక్షణె దృష్టిపాతం**
**వక్త్ర చ్ఛాయాంశశిని శిఖినాం బర్హ భారేషు కేశాన్ ।**
**ఉత్పశ్యామి ప్రతనుషునదీ వీచిషు భ్రూవిలాసా -**
**న్హన్తైకస్మిన్క్వచిదపినతే చణ్డి సాదృశ్యమస్తి ॥** **41**

**పదచ్ఛేదం** : శ్యామాసు, అంగం, చకిత హరిణీ, ప్రేక్షణే, దృష్టిపాతం, వక్త్ర చ్ఛాయాం, శశినాం, బర్హభారేషు, కేశాన్, ఉత్పశ్యామి, ప్రతనుషు, నదీ వీచిషు, భ్రూవిలాసాన్, హన్త, ఏకస్మిన్, క్వచిదపి, న, తే, చండి, సాదృశ్యం, అస్తి.

**అన్వయం** : శ్యామాసు, అంగం, చకిత హరిణీ, ప్రేక్షణే, దృష్టిపాతం, వక్త్ర చ్ఛాయాం, శశినాం, బర్హభారేషు, కేశాన్, ప్రతనుషునదీవీచిషు, భ్రూవిలాసాన్, ఉత్పశ్యామి, హంత! చండి!, క్వచిదపి, తే, సాదృశ్యం, న, అస్తి.

**ప్రతిపదార్థం**: శ్యామాసు అంగం = 'ప్రియంగు' లతలయందు (నీ) శరీరమును; చకిత హరిణీ ప్రేక్షణే దృష్టిపాతం = భయపడిన లేడి చూపులలో (నీ) దృష్టిని; శశిని వక్త్రచ్ఛాయాం = చంద్రునిలో శరీరచ్ఛాయను (రంగును); శిఖినాం బర్హ భారేషు కేశాన్ = నెమలి పింఛ సముదాయమున కేశములను; ప్రతనుషు, నదీ వీచిషు, భ్రూవిలాసాన్ = చిన్నినదీ తరంగములలో నీ కనుబొమల ఒయ్యారమును; ఉత్పశ్యామి = చూచుచున్నాను; హంత ! చండి ! క్వచిదపి, తే, సాదృశ్యం, న, అస్తి = అయ్యో ! ఓ చండీ ! ఎక్కడా నీ పోలికే లేదు.

**తాత్పర్యం** : ప్రియంగులతల్లో నీ శరీరాన్ని, భయపడిన లేడి చూపుల్లో నీ దృష్టిని, చంద్రునిలో నీ శరీర ఛాయను, నెమలి పింఛ సముదాయంలో నీకేశపాశాన్ని చిన్ని చిన్ని నదీ తరంగాల్లో నీ కనుబొమల ఒయ్యారాన్ని చూస్తున్నాను. అయ్యో ! చండీ ! ఎక్కడా నీ పోలికే కనిపించడం లేదు.

స్థలీదేవతానాం, ముక్తా స్థూలాః, అశ్రులేశాః = వనదేవతల యొక్క ముత్యములకంటె పెద్దవైన కన్నీటి బొట్లు; తరుకి సలయేషు, న, పతంతి, న = చిగురుటాకులయందు పడకపోవుటలేదు.

**తాత్పర్యం :** కలలో ఏదో విధంగా లభించిన నీ బిగి కౌగిలింత కారణంగా శూన్యంలోకి చేతులను చాపిన నన్ను చూచుచున్న వనదేవతల యొక్క ముత్యములకంటె పెద్దవైన కన్నీటి బొట్లు చిగురుటాకులపై పడక పోవుట లేదు (పడుచున్న వని భావం).

**'శ్రీకళా' వ్యాఖ్య:** యక్షుని దీనావస్థకు ప్రకృతి కూడా కరిగిపోతోందని చెప్పడం ఈ శ్లోక తాత్పర్యం. ఎలాగోలా – అతికష్టం మీద స్వప్న సాక్షాత్కారం లభించింది. ఆ స్వప్నంలో అతని ప్రేయసి నిర్దయగా కౌగిలించిందట ! అంటే బిగి కౌగిలింత. యక్షునికి ఊపిరిసలపనీయనంత గాఢాలింగనమది. యక్షుడు ఆకాశంలోకి చేతులు చాపేడు. వనదేవతలు అతని దీనావస్థను చూచి కన్నీటి బొట్లు విడిచేయి. ఆ కన్నీటి బొట్లు పరిమాణంలో ముత్యాలకంటే పెద్దవి. అవి భూమి మీద కాక చిగురుటాకుల మీద పడ్డాయనడంలో విశేషం ఉంది. మహనీయుల కన్నీరు భూమిపై పడితే అనర్థం. మల్లినాథసూరి తన వ్యాఖ్యానంలో దీనికి ఉపోద్బలకంగా–

***''మహాత్మ గురు దేవానా మశ్రు పాతః క్షితౌయది ।***
***దేశభఙ్గోమహాదుఃఖం మరణంచ భవే ద్ధ్రువమ్ ॥''***

అన్న ప్రమాణాన్ని ఉటంకించి దీని వల్ల యక్షుని మరణాభావాన్ని సూచించడం కోసం ''తరు కిసలయేషు'' అన్నాడని చెప్పేరు.

**భిత్వా సద్యః కిసలయపుటాన్దేవదారు ద్రుమాణాం**
**యేతత్క్షీరస్రుతి సురభయో దక్షిణేన ప్రవృత్తాః ।**
**ఆలిఙ్గ్యన్తే గుణవతి మయా తే తుషారాద్రి వాతాః**
**పూర్వం స్పృష్టం యదికిల భవే దఙ్గ మేభిస్తవేతి ॥** 44

**పదచ్ఛేదం :** భిత్వా, సద్యః, కిసలయ పుటాన్, దేవదారు ద్రుమాణాం, యే, తత్, క్షీర స్రుతి సురభయః, దక్షిణేన, ప్రవృత్తాః, ఆలింగ్యన్తే, గుణవతి, మయా, తే, తుషారాద్రి వాతాః, పూర్వం, స్పృష్టం, యది, కిల, భవేత్, అంగం, ఏభిః, తవ, ఇతి.

**అన్వయం :** దేవదారు ద్రుమాణాం, కిసలయపుటాన్, సద్యః, భిత్వా, తత్, క్షీర స్రుతి, సురభయః, యే, దక్షిణేన, ప్రవృత్తాః, (హే) గుణవతి, తే, తుషారాద్రి వాతాః,

కప్పివేసింది. కఠినమైన దైవము మన కలయికను చిత్రము నందు కూడ ఓర్వలేకున్నాడు.

**'శ్రీకళా' వ్యాఖ్య:** యక్షునికి అతని భార్యపై కల ప్రేమను, అతడనుభవించిన విరహవ్యథకు దర్పణం లాంటి రమణీయ భావయుక్తమైన శ్లోకమిది.

ఎడబాటులో ప్రేయసీ ప్రియులు ఒకరి రూపం ఒకరు చిత్రించుకొంటూ కాని, చిత్రపటాన్ని చూస్తూ కాని కాలక్షేపంచేయడం పరిపాటి. యక్షుడు తన ప్రేయసి చిత్రాన్ని అరణ్యంలో లభ్యమయ్యే గైరికాది ధాతువుల్తో వర్ణాల్ని తయారు చేసికొని ఒక శిలాఫలకంపై చిత్రించ పూను కొన్నాడు. ఏం చిత్రించాలను కొన్నాడు ? తన ప్రేయసి ప్రణయకోపాన్ని పొందినప్పటి రూపం అతని కత్యంత ఇష్టమైనది. ఆమెను ప్రణయకుపితగా చిత్రించేడు. తనను ఆమె పాదముల మీదవ్రాలిన వానినిగా చిత్రించ సంకల్పించి తద్భావనా భావితాంతః కరణుడయ్యేటంతలో గతస్మృతులు జ్ఞప్తికి వచ్చి భావావేశానికి వశుడై అవిరళంగా కన్నీరు ముంచుకు వచ్చేసి అతని దృష్టినడ్డి అతని చేత ఆ చిత్ర రచనను పూర్తి చేయించింది కాదు. ఈ విధంగా విఫలమనోరథుడై కఠినమైన దైవం మన సామీప్యాన్ని చిత్రంలో కూడా సహించలేకపోతోందని దైవాన్ని నిందిస్తున్నాడు. అహో! కాళిదాసు భావశబలత!
అలం : అర్థాపత్తి.

**మామాకాశప్రణిహిత భుజం నిర్దయాశ్లేష హేతో -**
**ర్లబ్ధాయాస్తే కథమపి మయా స్వప్నసందర్శనేషు ।**
**పశ్యన్తీనాం నఖలు బహుశో న స్థలీ దేవతానాం**
**ముక్తా స్థూలాస్తరు కిసలయే ష్వశ్రు లేశాః పతన్తి ॥** 43

**పదచ్ఛేదం :** మాం, ఆకాశ ప్రణిహిత భుజం, నిర్దయ + ఆశ్లేష హేతోః, లబ్ధాయాః, తే, కథమపి, మయా, స్వప్న సందర్శనేషు, పశ్యంతీ నాం, న, ఖలు, బహుశః, న, స్థలీదేవతానాం, ముక్తా స్థూలాః, తరుకిసలయేషు, అశ్రులేశాః, పతన్తి.

**అన్వయం :** స్వప్నసందర్శనేషు, కథమపి, లబ్ధాయాః, తే, నిర్దయ + ఆశ్లేషహేతోః, ఆకాశ ప్రణిహిత భుజం, మాం, పశ్యంతీనాం, స్థలీ దేవతానాం, ముక్తా స్థూలాః, అశ్రులేశాః, తరుకిసలయేషు, న పతంతి న.

**ప్రతిపదార్థం :** స్వప్న సందర్శనేషు, కథమపి, లబ్ధాయాః = స్వప్నమునందెట్లో యట్లు లభించిన; తే, నిర్దయ ఆశ్లేషహేతోః = నీబిగి కౌగిలింత కారణముగా; ఆకాశ ప్రణిహిత భుజాం, మాం, పశ్యంతీనాం = శూన్యమున చేతులు చాపిన నన్ను చూచుచున్న;

**పదచ్ఛేదం** : సంక్షిప్యేత, క్షణ, ఇవ, కథం, దీర్ఘయామా, త్రియామా, సర్వ+అవస్థాసు, అహః, అపి, కథం, మంధ్యమందాతపం, స్యాత్, ఇత్థం, చేతః, చటులనయనే, దుర్లభప్రార్థనం, మే, గాడ+ ఊష్మాభిః, కృతం, అశరణం, తత్, వియోగవ్యథాభిః.

**అన్వయం** : దీర్ఘయామా, త్రియామా, (మయా,) క్షణ, ఇవ, కథం, సంక్షిప్యేత, సర్వ+అవస్థాసు, అహః, అపి,మంద, మందాతపం, కథం, స్యాత్; చటులనయనే, ఇత్థం, దుర్లభప్రార్థనం, మే, చేతః, గాఢ+ఊష్మాభిః, త్వత్, వియోగవ్యథాభిః, అశరణం, కృతమ్.

**ప్రతిపదార్థం** : దీర్ఘయామా, త్రియామా, (మయా,) క్షణ ఇవ, కథం, సంక్షిప్యేత = పొడవైన జాములు కల రాత్రి నాచే క్షణమువలె ఎట్లు కుదింపబడగలదు?; సర్వ, అవస్థాసు, అహః, అపి, మంద, మందాతపం, కథంస్యాత్? = (భిన్న భిన్న) సమస్త స్థితులలో పగలును తక్కువ తాపము కలదిగా ఎట్లగును?; చటులనయనే= ఓ చంచలాక్షీ!; ఇత్థం, దుర్లభప్రార్థనం, మే, చేతః= ఈవిధంగా నెరవేరని కోర్కెలు కల నా మనస్సు; గాఢోష్మాభిః, త్వత్, వియోగవ్యథాభిః= మిక్కిలి తీవ్రమైన నీ విరహవేదనల చేత; అశరణం, కృతమ్= అనాథయైనది.

**తాత్పర్యం** : పొడవైన జాములు కల రాత్రిని క్షణకాలమునకు కుదించుటెట్లు? సర్వావస్థల్లో పగలు తాపము నపనయించుటెట్లు? ఓ చంచలాక్షీ! ఈవిధమైన తీరని కోర్కెలు కల నామనస్సు తీవ్రమైన నీ విరహవేదనచే అనాథ అయింది.

**'శ్రీకళా' వ్యాఖ్య**: కంటికి కునుకులేక రాత్రి ఒక్కొక్క జామే ఎంతో నిడివైందిగా తోస్తుంటే దాన్ని క్షణకల్పంగా ఎలా చేయగలం? పగలు భిన్న భిన్న అవస్థల్లో ఉన్నా ప్రతిక్షణం - ఏపని చేస్తున్నా నీతలపే మనస్సు నంతా ఆవరించి దుఃఖాన్ని కలుగజేస్తుంటే దీన్నుంచి బయటపడి ఈ తాపాన్నే విధంగా 'సహ్యం'గా చేసికోగలననే తపన - ఇవి తీరని కోర్కెలు. ఈ కోర్కెలతో విరహవేదన మరింత తీవ్రమై ఆశ్వాసించే దిక్కులేక అనాథైపోయింది.

**నన్వాత్మానం బహువిగణయన్నాత్మ నైవావలమ్బే**
**తత్కల్యాణి త్వమపి నితరాం మాగమః కాతరత్వమ్ ।**
**కస్యాత్యన్తం సుఖముపనతం దుఃఖమే కాన్తతో వా**
**నీచైర్గచ్ఛత్యుపరిచదశా చక్రనేమిక్రమేణ ॥** 46

పూర్వం, ఏభిః, తవ, అంగం, స్పృష్టం, భవేద్, యది, కిల, ఇతి, మయా, ఆలింగ్యంతే.

**ప్రతిపదార్థం** : దేవదారు ద్రుమాణాం, కిసలయ పుటాన్, సద్యః, భిత్వా = దేవదారు వృక్షముల చివురు మూలములనప్పుడే త్రుంపి తత్, క్షీర, స్రుతి సురభియః, యే దక్షిణేన, ప్రవృత్తాః = వానినుండి స్రవించుచున్నపాల పరిమళముతో ఏ దక్షిణా నిలమున్నదో; (హే) గుణవతి !, తే, తుషారాద్రి వాతాః = ఓ సుశీలా ! ఆ హిమాద్రి వాయువులు; పూర్వం, ఏభిః, తవ, అంగం, స్పృష్టం, భవేత్, యది, కిల, ఇతి = పూర్వము ఇవినిన్ను స్పృశించినవైయుండవచ్చును కదా అని; మయా ఆలింగ్యన్తే = నా కౌగిలింత నొందుచున్నవి.

**తాత్పర్యం** : దేవదారు వృక్షముల చివురు మూలములనప్పుడే త్రుంపివానినుండి స్రవించుచున్న పాలపరిమళము నేదక్షిణానిలము వహించుచున్నదో ఆహిమాద్రి వాయువులు ముందు (ఇక్కడవీచుటకు) నిన్ను స్పృశించినవై ఉండవచ్చును కదాయని నా పరిష్వంగము నొందుచున్నవి.

**'శ్రీకళా' వ్యాఖ్య:** దక్షిణానిలం వీచింది. గాలికి దేవదారు వృక్షాల చివురు మూలాలు చిట్లి వాటిలోంచి పాలుకారేయి. ఆ పాలకో సువాసన ఉంది. ఆ సువాసనతో యుక్తమైన గాలి హిమాద్రి పైనుండి వీస్తోంది. ఈగాలి నీవద్దనుండి ఇక్కడకు వచ్చి ఉంటుంది. కనుక మొదట నిన్ను స్పృశించి ఉండి ఉంటుంది కనుక నాకు పరమప్రీతి కరమై నాపరిష్వంగాన్ని పొందుతోందని యక్షుడు తన భార్యకు కబురు పంపేడు.

ప్రేయసి స్పర్శనొందిన ఏ వస్తువైనా ప్రియునికి అపురూపమైంది. అది చైతన్య వంతమైనా, జడమైనా కూడా. తద్భావనా భావితాంతఃకరణయోగ్యత ఎవరికుంటుందో వారే నిజమైన ప్రణయ ప్రవృత్తి కలవారు. తదితరులు మహా అయితే కాముకులౌతారు కాని ప్రేమికులు కారు. ప్రణయశబ్ద బాహిరులువారు. అంతటి గాఢ భావనాశక్తి కోవిలక్షణమైన సంస్కారం అవసరం. అది ఏ కొద్దిమందికో కాని ఉండదు. లోకంలో ఇంతటి మనస్వితను కలిగినవారే నిసర్గ 'సంస్కారులు', తక్కినవారు 'నిత్య సంసారులు'.

**సంక్షిప్యేత క్షణ ఇవకథం దీర్ఘయామా త్రియామా**
**సర్వావస్థాస్వహరపి కథం మన్దమన్దాతపం స్యాత్ ।**
**ఇత్థం చేతశ్చటులనయనే దుర్లభప్రార్థనం మే**
**గాఢోష్మాభిః కృతమశరణం త్వద్వియోగవ్యథాభిః ॥** 45

''నన్విత్యామన్త్రణే'' అనే సూత్రం వల్ల సంబోధనార్థం గమ్యమానమౌతుంది. కాగా – అనే కార్థాల్లో ఈ 'నను' శబ్ద ప్రయోగం ఉంటుందో అమరం విశదీకరిస్తోంది–

''ప్రశ్నావధారణానుజ్ఞానునయామన్త్రణే నను'' అని.

'కళ్యాణి' అనే సంబోధన వల్ల నీసౌభాగ్యం వల్లనే నేనింకా జీవించి ఉన్నానని తెలుపుతున్నాడు. అలం: అర్థాంతర న్యాసం.

**శాపాన్తోమే భుజగశయనాదుత్థితే శార్ఙ్గపాణౌ**
**శేషాన్మాసాన్గమయచతురో లోచనే మీలయిత్వా ।**
**పశ్చాదావాం విరహ గణితం తంత మాత్మాభిలాషం**
**నిర్వేక్ష్యావః పరిణత శరచ్చన్ద్రికాసు క్షపాసు ॥** 47

**పదచ్ఛేదం:** శాపాంతః, మే, భుజగశయనాత్, ఉత్థితే, శార్ఙ్గపాణౌ, శేషాన్, మాసాన్, గమయ, చతురః, లోచనేమీలయిత్వా, పశ్చాత్, ఆవాం, విరహగణితం, తం, తం, ఆత్మాభిలాషం, నిర్వేక్ష్యావః, పరిణత, శరత్+చంద్రికాసు, క్షపాసు.

అన్వయం : శార్ఙ్గపాణౌ, భుజగశయనాత్, ఉత్థితే, మే, శాపాంతః, శేషాన్, చతురః, మాసాన్, లోచనే, మీలయిత్వా, గమయ, పశ్చాత్, ఆవాం, విరహగణితం, తంతం, ఆత్మ, అభిలాషం, పరిణత, శరత్ చంద్రికాసు, క్షపాసు, నిర్వేక్ష్యావః.

**ప్రతిపదార్థం:** శార్ఙ్గపాణౌ, భుజగశయనాత్, ఉత్థితే, (సతి)మే, శాంపాంతః (భవిష్యతి)= శ్రీమహావిష్ణువు ఆదిశేషుని పాన్పు నుండి లేచిననాడు నాకు శాపాంత మగును. శేషాన్, చతురః, మాసాన్, లోచనే మీలయిత్వా, గమయ= మిగిలిన నాల్గు మాసములు కళ్ళు మూసికొని గడుపుము. పశ్చాత్, ఆవాం, విరహగణితం , తం, తం ఆత్మ అభిలాషం= పిమ్మట మను ఉభయులు వియోగవేళ భావించిన స్వీయ కోర్కెలను; పరిణత శరత్ చంద్రి కాసు, క్షపాసు, నిర్వేక్ష్యావః= పండిన శారద చంద్రికా రాత్రులలో అనుభవింతము (తీర్చుకొందము).

**తాత్పర్యం :** శ్రీమహావిష్ణువు శేషశయ్య నుండి లేచిననాడు నాకు శాపాంతమగును. మిగిలిన నాల్గు మాసములు కళ్లు మూసికొని గడుపుము. పిమ్మట ఉభయులము వియోగవేళ భావించిన స్వీయమనోరథములను పండిన శారద చంద్రికారాత్రులయందను భవింతము.

**పదచ్ఛేదం** : నను, ఆత్మానం, బహువిగణయన్, ఆత్మని, ఏవ, అవలంబే, తత్, కల్యాణి, త్వం, అపి, నితరాం, మా, గమః, కాతరత్వం, కస్య, అత్యంతం, సుఖం, ఉపనతం, దుఃఖం, ఏకాంతతః, వా, నీచైః, గచ్ఛతి, ఉపరి, చ, దశా, చక్రనేమి క్రమేణ.

**అన్వయం** : నను, బహువిగణయన్, ఆత్మానం, అవలంబే, తత్, కల్యాణి, త్వం, అపి, నితరాం, కాతరత్వం, మాగమః, కస్య, అత్యంతం, సుఖం, దుఃఖం వా, ఏకాంతతః, ఉపనతం, దశా, చక్రనేమిక్రమేణ, నీచైః, ఉపరి, చ, గచ్ఛతి.

**ప్రతిపదార్థం** : నను, బహువిగణయన్, ఆత్మానం, ఆత్మనైవ, అవలంబే= ప్రియా! బాగా ఆలోచించి నన్ను నేనే సమాధానపఱచుకొంటున్నాను; తత్, కల్యాణి, త్వం, అపి, నితరాం, కాతరత్వం, మాగమః= అందువల్ల ఓ కళ్యాణీ! నీవు కూడ ఎక్కువగా భయపడుకుము; కస్య, అత్యంతం సుఖం, దుఃఖం, వా ఏకాంతతః ఉపనతం? = ఎవనికి అమితసుఖం కాని దుఃఖం కాని అచ్చంగా సంప్రాప్తిస్తుంది?; దశాచక్రనేమిక్రమేణ, నీచైః, ఉపరి, చ, గచ్ఛతి= అవస్థ చక్రపు అంచువలె క్రిందకు, మీదకూ వెడుతూ ఉంటుంది.

**తాత్పర్యం** : ప్రియా! బాగా ఆలోచించి నన్ను నేనే సమాధానపఱచుకొంటున్నాను. అందువల్ల ఓ కళ్యాణీ! నువ్వుకూడా ఎక్కువగా భయపడకు. కేవలం సుఖం కాని, కేవల దుఃఖం కాని ఎవరికి సంప్రాప్తిస్తుంది? ఈ సుఖదుఃఖావస్థ చక్రధారవలె క్రిందికీ, మీదకూ వెడుతూ ఉంటుంది.

**'శ్రీకళా' వ్యాఖ్య:** శాపం వచ్చేసింది. అనుభవించడం తప్ప ఏవిధంగానూ తప్పించుకోలేము. ఎంత ఆలోచించినా మార్గాంతరం లేదు కనుక గుండెదిటవు చేసికొని అనుభవించడమే. నువ్వా ఊరికే ఎక్కువగా భయపడకు. సుఖదుఃఖాలు పరిపాటిగా – అంటే ఒకదాని తర్వాత ఒకటిగా వస్తూనే ఉంటాయి. కాని కష్టాలు కలకాలం ఉండిపోవు కదా! అని యక్షుడు భార్యనూరడిస్తున్నాడు ఈ శ్లోకంలో.

'నను' అనేది సంస్కృతంలో సంబోధనవంటిది. దీనికి ప్రత్యేకంగా 'ప్రేయసి' వంటి అర్థం ఏమీ లేదు నిజానికి. ఎవరిని సంబోధిస్తున్నామో (ఎవరితో మాట్లాడు తున్నామో) వారే దీనికర్థం – తెలుగు వారు మాట్లాడుతూ వేరే ఒక విషయం ప్రస్తావించవలసినప్పుడు –''మరి'' అని, ''అదిసరేకాని'' వంటి ప్రయోగాలు చేస్తారే ఆప్యాయంగా – అదే సంస్కృతంలో 'నను' శబ్దార్థం.

సుషమాదీధితులీనుతూ సర్వప్రాణి లోకానికీ పరమాహ్లాదాన్ని కలిగిస్తాడు. ఇక వియోగానంతర ప్రణయుల విషయంలో ప్రత్యేకంచెప్పవలసినదేముంటుంది? ఇంతటి భావాన్ని పరిణత శరచ్చంద్రికాసుక్షపాసు' అని ముచ్చటగా ముద్దులొలికే మూడు మాటల్లో చెప్పడం మహాకవికే చెల్లింది. అలం: ఉదాత్తం.

**భూయశ్చాహ త్వమపి శయనేకణ్ఠలగ్నాపురామే**
**నిద్రాం గత్వా కిమపిరుదతీ సస్వనం విప్రబుద్ధా।**
**సాన్తర్హాసం కథితమసకృత్పృచ్ఛతశ్చ త్వయామే**
**దృష్టః స్వప్నేకితవరమయన్కామపి త్వం మయేతి॥** **48**

**పదచ్ఛేదం** : భూయః, చ, ఆహ, త్వం, అపి, శయనే, కంఠలగ్నా, పురా, మే, నిద్రాం, గత్వా, కిం, అపి, రుదతీ, సస్వనం, విప్రబుద్ధా, స, అంతర్హాసం, కథితం, అసకృత్, పృచ్ఛతః, చ, త్వయా, మే, దృష్టః, స్వప్నే, కితవ, రమయన్, కాం, అపి, త్వం, మయా, ఇతి.

**అన్వయం** : భూయః, చ, ఆహ, పురా, శయనే, మే, కంఠలగ్నా, త్వం, నిద్రాం, గత్వా, అపి, కిమపి, సస్వరం, రుదతీ, (ఆసీః), విప్రబుద్ధా, అసకృత్, పృచ్ఛతః, మే, కితవ, త్వం, కామపి, రమయన్, స్వప్నే, దృష్టః, ఇతి, త్వయా, స అంతర్హాసం, కథితం.

**ప్రతిపదార్థం** : (హే, అబలే!) భూయః, చ, ఆహ = ఇంకా చెప్పేడు; పురా, శయనే, మే, కంఠలగ్నా = ఇదివరకు పాన్పునందు నాకంఠాన్ని కౌగలించుకొని; త్వం, నిద్రాం; గత్వా అపి= నీవు నిదురించుచున్నను; కిమపి, సస్వరం, రుదతీ (ఆసీః) విప్రబుద్ధా = ఎందుకో ఎలుగెత్తి ఏడ్చుచుంటివి, (లేచి); అసకృత్, పృచ్ఛతః, మే= చాలాసార్లు అడిగిన నాకు (కారణమును); (హే) కితవ, త్వం, కామపి రమయన్ దృష్టః ఇతి = ఓ మోసగాడా! నీవెవతెనో రమించుచు కలలో కనబడితివి అని; త్వయా సాంతర్హాసం కథితః= నీవు మందహాసముతో చెప్పితివి (అని అతడునాతో చెప్పెను).

**తాత్పర్యం** : ఆయన (యక్షుడు) ఇంకా ఏం చెప్పేడంటే ఇదివరకొకసారి నీవు నా కంఠాన్ని కౌగలించుకొని నిద్రిస్తూ కూడా ఎందుకో ఎలుగెత్తి ఏడ్చేవు. (కారణం) చాలాసార్లు అడిగిన నాకు ఓ మోసగాడా! నీవెవతెనో రమిస్తూ నాకు కలలో కనపడ్డావని నువ్వు మందహాసంతో పలికేవు. (అట!)

**'శ్రీకళా' వ్యాఖ్య** : మేఘుడు తాను వార్తాహరుడననే విశ్వాసాన్ని ఆమెకు కలిగించడం కోసం ఒక రహస్యాన్ని యక్షదంపతులకు సంబంధించినదాన్ని చెబుతున్నాడు. ఆప్రేయసీ

**'శ్రీకళా' వ్యాఖ్య:** శ్రీమహావిష్ణువు ఆషాఢ శుద్ధైకాదశి (తొలి ఏకాదశి) నాడు శేషశయ్యపై శయనించి కార్తీక శుద్ధైకాదశి నాడు మేలుకొంటాడని హైందవ సంప్రదాయం. ఈ నాల్గు నెలల కాలాన్నే 'చాతుర్మాస్యదీక్ష' గా సన్యాసదీక్షనొందిన వారు పాటిస్తారు. ఆషాఢ శుద్ధ పాడ్యమి నాడు (''ఆషాఢస్య ప్రథమదివసే'') యక్షుడు మేఘుని చూచి తన ప్రేయసికి సందేశం పంపేడు. కార్తీకశుద్ధ ఏకాదశి శాపాంతదినంగా ఈ శ్లోకంలో పేర్కొన్నాడు. ఖచ్చితంగా చెప్పాలంటే అతను కబురు పంపేనాటికి శాపాంతం సరిగా నాల్గు నెలల పదకొండు రోజులున్నదన్నమాట! ఆపదకొండు రోజుల మాట చెప్పకుండా నాల్గు నెలలన్నాడేమిటి? అని ప్రశ్నించడం సహృదయ లక్షణం అనిపించుకోదు. కావ్యంలో గణనీయమైంది హృదయపు 'లోతు' కాని 'లెక్క' కాదు. పోనీ అలా చూసి కొన్నా నెలకి సగం కంటే తక్కువ కనుక నాల్గు నెలలుగానే పరిగణించినట్టు పరిష్కారం పలుకవచ్చు. లేదా ఆపది రోజులు మేఘుడు ఆమె చేరడానికి పట్టవచ్చు.

వియోగదశలో సంయోగదశ సిద్ధించినపుడు జరుపబోయే వేడుకల గుఱించి కలలు కనడం, ఊహించుకోవడం విరహులకు పరిపాటే. నూతనంగా గృహస్థాశ్రమం స్వీకరించిన రోజులు జ్ఞప్తికి తెచ్చుకుంటే ఏదంపతులకైనా ఇందులో నిజం తెలుస్తుంది. యువదంపతులకు ఈ అనుభవం నిత్యం. తన ఉద్యోగధర్మాన్ని నిర్వర్తించుకొంటూ వరుడూ గృహకృత్యాల్లోనిమగ్నమై కూడా వధువూ రాత్రి కోసం నిరీక్షించడం– రాత్రివేళ '' ఈకృత్యాలతో సహచరుణ్ణి (సహచరిని) ఈవిధంగా అలరిస్తాన''ని అనుకోవడం సాధారణమైన విషయం. వయసు మళ్ళిన దంపతులు సైతం 'ఆ' రోజు స్మృతి పథంలో మెదలినప్పుడు మధురోహలతో ముచ్చట పడడమూ అనుభవవిరుద్ధం కాదు. అందునా ఈ సన్నివేశంలో దీర్ఘకాల వియోగానంతరం కలుగబోయే సంయోగ సన్నివేశాన్ని సంయోజించడం సమంజసమే.

ఆసన్నివేశానికి వారి సంయోగకాలం కూడా ఎంతో సానుకూలమైంది. శారద రాత్రుల్లో వారి సమాగమం జరుగబోతోంది. శరత్కౌముది వారినలరింపనుంది. ఆరాత్రుల సొగసును ఆది కవి నన్నయ్యగారు –

''శారదరాత్రులుజ్జ్వల లసత్తర తారకహారపంక్తులన్

చారుతరంబులయ్యె .........'' అంటూ ఎంతో మనోహరంగా వర్ణించేరు.

ఆశ్వయుజ కార్తిక మాసాలు శరదృతువు. ఆతర్వాతది హేమంతం, మంచుకురిసే కాలం. ఈ శరదృతువులో ఆకాశం నిర్మలమై చంద్రుడు శారద

దూరం కావడం వల్ల నూతన పరిచయాలేర్పడి పాతవారిని మఱచి పోతారనేది వారి వాదం. ఎందుకో ఈ వాదం తనకు రుచించడం లేదంటాడు. నిజంగా ప్రేమ ఉన్న చోట అనుభవరాహిత్యం రాగాన్ని మరింత వృద్ధి చేసి అంతకుముందున్న ప్రేమ ఒక పెద్ద మోపెడంత అవుతుందని తన స్వీయానుభవాన్ని ఆమెకు తెలియజేస్తున్నాడు. అలం: అర్థాంతరన్యాసం.

**ఆశ్వాస్యైవం ప్రథమ విరహోదగ్రశోకాం సఖీంతే**
**శైలాదాశు త్రినయన వృషోత్ఖాతకూటాన్నివృత్తః।**
**సాభిజ్ఞాన ప్రహితకుశలైస్తద్వచోభిర్మమాపి**
**ప్రాతఃకున్ద ప్రసవ శిథిలం జీవితం ధారయేథాః॥** 50

**పదచ్ఛేదం :** ఆశ్వాస్య, ఏవం, ప్రథమ విరహ+ ఉదగ్రశోకాం, సఖీం, తే, శైలాత్, ఆశు, త్రినయనవృష+ ఉత్ఖాత కూటాత్, నివృత్తః, సాభిజ్ఞాన ప్రహితకుశలైః, తద్వచోభిః, మమ, అపి, ప్రాతః, కుందప్రసవ శిథిలం, జీవితం, ధారయేథాః.

**అన్వయం :** ప్రథమవిరహ ఉదగ్రశోకాం, తే, సఖీం, ఏవ, ఆశ్వాస్య, త్రినయనవృషోత్ఖాత కూటాత్, శైలాత్, నివృత్తః, స్వాభిజ్ఞానం, ప్రహితకుశలైః, తత్, వచోభిః, ప్రాతఃకుందప్రసవశిథిలం, మమాపి, జీవితం, ధారయేథాః.

**ప్రతిపదార్థం:** ప్రథమ, విరహ, ఉదగ్ర శోకాం, తే, సఖీం= తొలివియోగముచే మిక్కుటమైన దుఃఖాన్ననుభవిస్తున్న నీ నీనెచ్చెలిని; ఏవం, ఆశ్వాస్య= ఈవిధముగా ఊరడించి; త్రినయనవృషోత్ఖాతకూటాత్, శైలాత్, నివృత్య= నందీశ్వరునిచే భేదింపబడిన(కైలాస) పర్వతమునుండి మరలి; సాభిజ్ఞాన, ప్రహితకుశలైః, తత్, వచోభిః = గుర్తుతో సహా పంపిన ఆమె క్షేమవార్తలపలుకులతో; ప్రాతః కుందప్రసవ శిథిలం= ప్రాతఃకాలమునందలి మొల్లపుష్పమువలె శిథిలీకృతమైన; మమాపి జీవితం= నా జీవితమును కూడ; ధారయేథాః = నిలుపుము.

**తాత్పర్యం :** తొలి వియోగంతో మిక్కుట దుఃఖభారాన్ననుభవిస్తున్న నెచ్చెలిని ఈవిధంగా ఊరడించి నందీశ్వరుడు భేదించిన కైలాస పర్వత్వం నుండి మరలి, ఆనవాలుతో పంపిన నా ప్రేయసి క్షేమవార్తలతో ప్రాతఃకాలంలో శిథిలీకృతమైన మొల్లపూవులాంటి నా జీవితాన్ని నిలుపు.

ప్రియులకు మాత్రమే తెలిసిన రహస్యాన్ని చెప్పడం వలన ఇతడు యక్షుని నుండే వస్తున్నాడని యక్షకాంత భావిస్తుంది.

**ఏతస్మాన్మాంకుశలిన మభిజ్ఞాన దానాద్విదిత్వా**
**మాకౌలీనాచ్చకితనయనే మయ్యవిశ్వాసినీ భూః।**
**స్నేహానాహుః కిమపి విరహే ధ్వంసినస్తే త్వభోగా**
**దిష్టేవస్తున్యుపచితరసా ప్రేమరాశీ భవన్తి॥** 49

**పదచ్ఛేదం :** ఏతస్మాత్, మాం, కుశలినం, అభిజ్ఞానదానాత్, విదిత్వా, మా, కౌలీనాత్, చకితనయనే, మయి, అవిశ్వాసినీ, భూః, స్నేహాన్ ఆహుః, కిమపి, విరహే, ధ్వంసినః, తే, అభోగాత్, ఇష్టే, వస్తుని, ఉపచితరసాః, ప్రేమరాశీ, భవంతి.

**అన్వయం :** ఏతస్మాత్, అభిజ్ఞానదానాత్, మాం, కుశలినం, విదిత్వా, చకితనయనే, కౌలీనాత్, మయి, అవిశ్వాసినీ, మా, భూః, కిమపి, స్నేహాన్, విరహే, ధ్వంసినః, ఆహుః, తే, అభోగాత్, ఇష్టే, వస్తుని, ఉపచితరసాః, ప్రేమరాశీభవంతి.

**ప్రతిపదార్థం :** ఏతస్మాత్, అభిజ్ఞానదానాత్, మాం, కుశలినం, విదిత్వా= ఈ గుర్తులను చెప్పుటను బట్టి నన్ను క్షేమంగా నున్నవానినిగాతెలిసికొని; చకిత నయనే! కౌలీనాత్, మయి, అవిశ్వానీ, మా, భూః= చంచలాక్షీ ! లోకవాదమునసనుసరించి నాయందు విశ్వాసమును కోల్పోకుము; కిమపి, స్నేహాన్, విరహే, ధ్వంసినః, ఆహుః= ఎందుకో స్నేహం వియోగంలో నశిస్తుందంటారు; తే, అభోగాత్, ఇష్టే వస్తుని, ఉపచితరసాః= అవి (ఆస్నేహాలు) అనుభవరాహిత్యము వల్ల ఇష్టమైన వాటియందువృద్ధి నొందిన కోర్కెలతో; ప్రేమరాశీభవంతి = ప్రేమ కుప్పగా రూపొందును.

**తాత్పర్యం :** ఈ గుర్తులననుసరించి నన్ను క్షేమంగా ఉన్న వానినిగా తెలిసికొని ఓ చంచలాక్షీ! లోకవాదాన్ననుసరించి నాపట్ల విశ్వాసాన్ని కోల్పోకుము. ఎందుకోగాని వియోగం వల్ల స్నేహం నశిస్తుందంటారు. కాని అది అనుభవరాహిత్యం వల్ల వృద్ధిపొంది నిజానికి మోపెడవుతుంది.

**'శ్రీకళా' వ్యాఖ్య :** యక్షుడు తమ ఉభయులకు మాత్రమే తెలిసినకొన్ని సన్నివేశాలను చెప్పడం ద్వారా మేఘుని పట్ల విశ్వాసాన్ని కలుగజేసి తనను క్షేమంగా ఉన్నవానినిగా తెలిపేడు. దీర్ఘవియోగం స్నేహాన్ని నశింపచేస్తుందని లోకంలో ప్రవాదం ఉంది. దాన్ని దృష్టిలో పెట్టుకొని తనపట్ల విశ్వాసాన్ని పోగొట్టుకోవద్దని అర్థిస్తున్నాడు. వ్యక్తులు

**'శ్రీకళా' వ్యాఖ్య :** మేఘునితో యక్షుడు తన ప్రియురాలికి సందేశం పంపుతున్నాడు. ఇందులో ఎంతటి అసంగతత్వం ఉందో ముందే – ''ధూమజ్యోతి స్సలిలమరుతాం .....'' అనే శ్లోకంలో చెప్పి యక్షకృత్యాన్ని ''కామార్తాహి ప్రకృతి కృపణాశ్చేతనాచేతనేషు'' అన్న వాక్యంలో సమర్థించేడు కవి. యక్షుడు చెప్పిన దానికి మేఘుడేం సమాధానం చెబుతాడు? ప్రాణి అయితే కదా సమాధానమివ్వడానికి ! దాన్ని – మహాకవి కనుకనే కాళిదాసు ఎంతో చాకచక్యంగా యక్షుని పలుకుల్లో సమర్థిస్తున్నాడు. ''నువ్వు నేను చెప్పిన పనిన పనిచేస్తానని నాకు మాటివ్వనక్కర్లేదు. అలా సమాధానం చెప్పడమే నీ ధీరత్వానికి భంగం. సమాధానంచెప్పకపోయినా ఈ మిత్రకార్యాన్ని నువ్వుచేపడతావని నాకు తెలుసు. జలం కోరిన చాతక పక్షులకి సమాధానం ఇవ్వకుండానే నీటి నిచ్చివారి అభిలషితార్థాన్ని ఈడేర్ప చేస్తున్నావు. సత్పురుషుల ప్రవృత్తే అటువంటిది. ఇష్టులకి ఇష్టార్థ ప్రదానమే వారిసమాధానం. మాటలు కావువారివి, చేతలే'' నంటూ ఎంతోయుక్తితో ఈ శ్లోకరచన కావించేడు మహాకవి. అలం: అర్థాంతరన్యాసం.

**ఏతత్కృత్వాప్రియమనుచితప్రార్థనావర్తినోమే**
**సౌహార్దాద్వా విధుర ఇతివా మయ్యనుక్రోశబుద్ధ్యా ।**
**ఇష్టాన్దేశాఞ్జలదవిచరప్రావృషా సంభృత శ్రీ**
**ర్మాభూదేవం క్షణమపి చతే విద్యుతా విప్రయోగః ॥** 52

**పదచ్ఛేదం :** ఏతత్, కృత్వా, ప్రియం, అనుచితప్రార్థనావర్తినః, మే, సౌహార్దాత్, వా, విధురః, ఇతివా, మయి, అనుక్రోశబుద్ధ్యా, ఇష్టాన్, దేశాన్, విచర, ప్రావృషా, సంభృతశ్రీః, మాభూత్, ఏవం, క్షణం, అపి, చ, తే, విద్యుతా, విప్రయోగః.

**అన్వయం :** హేజలద!, సౌహార్దాత్, వా, విధురః, ఇతివా, మయి అనుక్రోశబుద్ధ్యావా, ఆత్మనః, అనుచితం, అపి, మే, ఏతత్, ప్రియం, కృత్వా, ప్రావృషాసంభృతశ్రీః, ఇష్టాన్, దేశాన్, విచర. ఏవం, క్షణం, అపి, చ, తే, విద్యుతా విప్రయోగః, మాభూత్!.

**ప్రతిపదార్థం :** హే జలద! = ఓ మేఘుడా!; సౌహార్దాత్, వా; విధురః, ఇతివా, మయి, అనుక్రోశబుద్ధ్యా, వా = స్నేహముతోకాని, వియోగియని కాని, నాయందుదయచేగాని; ఆత్మనః, అనుచితం, అపి, మే, ఏతతే, ప్రియం, కృత్వా = నీకు తగనిదేయైనను నాకీ ప్రీతిని కలుగజేసి; ప్రావృషా, సంభృతశ్రీః, ఇష్టాన్, దేశాన్, విచర= వర్షర్తుశోభాయుక్తుడవై ఇచ్ఛకువచ్చిన ప్రదేశముల సంచరింపుము. ఏవం, క్షణం, అపి, చ, తే = ఇట్లు (నావలె) క్షణకాలమైను నీకు; విద్యుతా, విప్రయోగః, మాభూత్= సౌదామనితో వియోగము కలుగుకుండుగాక!

**'శ్రీకళా' వ్యాఖ్య :** గత శ్లోకంతో ప్రియురాలికి చెప్పవలసిన మాటలను పూర్తిచేసి ఈ శ్లోకంలో ఆమె కుశల వార్తలతో వచ్చి శిథిలప్రాయమైన నాప్రాణాన్ని నిలుపుమని యక్షుడు మేఘుని ప్రార్థిస్తున్నాడు.

కుందపుష్పం అంటే మొల్లపూవు. మొల్లలు సాయంత్రం వికసించి ఉదయానికి కాడవదులై ఉంటాయి. అలం: ఉపమ.

**కచ్చిత్సౌమ్య వ్యవసితమిదం బన్ధుకృత్యం త్వయామే**
**ప్రత్యాదేశాన్నఖలు భవతోధీరతాం కల్పయామి ।**
**నిశ్శబ్దో ఽపి ప్రదిశసి జలం యాచితశ్చాతకేభ్యః**
**ప్రత్యుక్తం హిప్రణయిషు సతామీప్సితార్థక్రియైవ ॥** 51

**పదచ్ఛేదం:** కచ్చిత్, సౌమ్య, వ్యవసితం, ఇదం, బంధుకృత్యం, త్వయా, మే, ప్రత్యాదేశాత్, న, ఖలు, భవతః, ధీరతాం, కల్పయామి, నిశ్శబ్దః, అపి, ప్రదిశసి, జలం, యాచితః, చాతకేభ్యః, ప్రత్యుక్తం, హి, ప్రణయిషు, సతాం, ఈప్సితార్థక్రియా, ఏవ.

**అన్వయం:** హే సౌమ్య! త్వయా, ఇదం, మే, బంధుకృత్యం, వ్యవసితం, కచ్చిత్, ప్రత్యాదేశాత్, భవతః, ధీరతాం, న కల్పయామి ఖలు; యాచితః, నిశ్శబ్దః, అపి, చాతకేభ్యః, జలం, ప్రదిశసి, సతాం, ప్రణయిషు, ఈప్సితార్థక్రియా ఏవ, ప్రత్యుక్తం, హి.

**ప్రతిపదార్థం :** హేసౌమ్య= ఓ సాధుశీలీ!; త్వయా, ఇదం, మే, బంధుకృత్యం, వ్యవసితంకచ్చిత్ = నీ చేత, ఈ, నా, బంధుకార్యము అంగీకరించబడినది కదా!; ప్రత్యాదేశాత్, భవతః, ధీరతాం, న, కల్పయామి, ఖలు = బదులు చెప్పుటచే నీ నిండుతనమును సమర్థించను కదా!; యాచితః, నిశ్శబ్దః, అపి, చాతకేభ్యః, జలం, ప్రదిశసి = యాచితుడవై మాటాడకున్నను చాతకములకు నీటినిచ్చుచున్నావు; సతాం, ప్రణయిషు, ఈప్సితార్థక్రియా, ఏవ, ప్రత్యుక్తం, హి = సత్పురుషులకు ఇష్టులకిష్టమగు పనిచేయుటే సమాధానము కదా!

**తాత్పర్యం :** ఓ సాధుశీలీ! నీచేత నా ఈ బంధు కార్యం స్వీకృతమైనట్లేకదా! బదులు చెప్పుటచే నీ గాంభీర్యమును సమర్థించను. యాచితుడవై, మాటాడకపోయినను చాతకపక్షులకునీటి నొసగుచున్నావు. ఇష్టులకిష్టమైన కార్యాచరణే సత్పురుషుల సమాధానము.

## మేఘునికి మార్గ నిర్దేశం ( ముఖచిత్రం)

*పూర్వమేఘం లో ప్రస్తావితమైన వివిధప్రదేశాలు (కుండలీకరణంలోశ్లోకసంఖ్య)*

| | | | |
|---|---|---|---|
| 1. | రామగిరి | : నాగపూర్ సమీపములోనున్న 'రామ్ టేక్' గా కొందరు భావిస్తుంటే మధ్యప్రదేశ్‌లో 'రామ్‌గఢ్' అని మరికొందరి భావన. | (1) |
| 2. | అలక | : కైలాసపర్వత ప్రాంతంలోని యక్షనగరంగా ప్రసిద్ధి | (7) |
| 3. | మానససరోవరం | : కైలాసపర్వత శ్రేణిలో నేటికీ ఈ పేరుతోనే ఉంది | (11) |
| 4. | కైలాసం | : దేవభూమిగా ప్రసిద్ధినొందింది. హిమాలయాలకు ఉత్తర దిక్కులోని పర్వతశ్రేణి. | (11) |
| 5. | మాల | : ఆధునిక ఛత్తీస్ గఢ్ ప్రాంతం. | (16) |
| 6. | ఆమ్రకూటం | : నర్మదానదీ జన్మస్థానం | (17) |
| 7. | రేవానది | : నర్మదానదికి మరోపేరు. | (19) |
| 8. | వింధ్యపర్వతం | : సుప్రసిద్ధ సప్తకులపర్వతాల్లో ఒకటి | (19) |
| 9. | దశార్ణదేశం | : మాళవదేశపూర్వ భాగాన్ని దశార్ణదేశమని పిలిచేవారు. దీనిరాజధాని విదిశ. వేత్రవతీనది ఇక్కడ ప్రవహిస్తోంది. దీనిని ఇప్పుడు 'బేత్‌వా' అంటున్నారు. | (23) |
| 10. | విదిశా | : దశార్ణదేశానికి రాజధాని. ఆధునిక నామం 'భిలాసా'. | (24) |
| 11. | వేత్రవతీనది | : 'బేత్‌వా' అనేపేరుతో నేటివ్యవహారం. వింధ్యపర్వ తోత్తరభాగంలో ఉద్భవించి యమునా నదిలో కలుస్తుంది. | (24) |
| 12. | నీచైర్గిరి | : విదిశా నగరసమీపంలో ఉన్న ఆనాటి చిన్నగుట్టకావచ్చు. | (25) |
| 13. | వననది | : బేతవానదితో కలిసే ఒక నదియై ఉండవచ్చు. పార్వతీనదీ వననది అని కొందరి అభిప్రాయం. | (26) |
| 14. | ఉజ్జయిని | : మాళవదేశానికి రాజధాని. అవంతి, అవంతిక, విశాల అనేవి ఈనగర నామాంతరాలే. మోక్షదాయకాలైన అయోధ్యాది సప్తనగరాల్లో ఇదొకటి. | (27) |
| 15. | నిర్వింధ్య | : వింధ్యపర్వతంలో పుట్టిన ఈ నది పార్వతీనది అని కొందరి మతం. | (28) |
| 16. | సింధు | : మాళవదేశంలో ప్రవహించే ఒకనది. ప్రస్తుతం పాకిస్థాన్‌లో ఉన్న ప్రసిద్ధమైన సింధు నది కాదు. | (29) |

**తాత్పర్యం:** ఓ మేఘుడా! స్నేహంతో కాని, వియోగి అని కాని, నాయందలి దయచేగాని, నువ్వు చేయదగిన పనికాకపోయినా నాకీ ప్రీతిని కలుగజేసి (సందేశాన్ని నా భార్యకు తెలిపి) వర్షర్తుశోభాయుక్తుడవై ఇచ్ఛవచ్చిన ప్రదేశముల సంచరింపుము. (నావలె) ఇట్లు క్షణ కాలమైనను నీకు సౌదామనితో వియోగము కలుగకుండుగాత!

**'శ్రీకళా' వ్యాఖ్య :** చివరి ముక్తాయింపుగా యక్షుడు మరొకసారి తన కార్యసిద్ధి కోసం మేఘుని పొగుడుతున్నాడు. ''నీ అంతటి వాడుచేయవలసిన పనికాదనుకో, అయినా స్నేహంతోకాని, అయ్యోపాపం ఎడబాటుతో బాధపడుతున్నాడే అని కాని, కేవలం నాపై అనుగ్రహ బుద్ధితో కాని నాకీ ప్రియతమమైన పని చేసిపెట్టు'' అని. అలం: సమాసోక్తి.

***''మంగళాదీని మంగళమధ్యాని, మంగళాంతాని శాస్త్రాణి ప్రథన్తే''***

అనే ఆభాణకాన్ననుసరించి మంగళాంతం ఆశీర్వచనరూపంలో '' నావలె నీ ప్రియమైన విద్యుల్లేఖతో నీకు క్షణమైనా వియోగం కలుగకుండుగాక'' అని కథావస్త్వనురూపమైన మంగళంచేయడంలో కవి ప్రతిభ ద్యోతకమౌతుంది. అమరుక శతకంలో ఇట్టి సాదృశ్యమే మంగళాదిశ్లోకాల్లో కనిపిస్తుంది.

***''తత్త్వాం పాతుచిరాయ కిం హరిహరబ్రహ్మాది భిర్దేవతైః''***

''అట్టి నాయిక నిన్ను సదారక్షించుగాక! హరిహర బ్రహ్మాదులతో పనేమి'' అని. శృంగార కావ్యమైన 'అమరుకం' లో తత్పురుషార్థ సాధనకు లక్ష్యమైన నాయిక అనుగ్రహాన్నే అతడూ వాంఛించేడు. ఇది విప్రలంభ శృంగార ప్రతిపాద్య ఖండకావ్యం కనుక కవికులతిలకుడైన కాళిదాసు ప్రియావిరహంపగవాడికి కూడా వద్దనే సూక్తిని చెబుతూ, ఇందులో (స్వాధికారాత్ప్రమత్తః) తన విధిని మఱచినందువల్ల కలిగిన అనర్థం కనుక, ''ప్రావృషాసంభృతశ్రీః'' అనే పద ప్రయోగంలో నీ విధిని నీవు నిర్వహింపుమని ధ్వన్యాత్మకంగా ప్రబోధించేడు. కర్తవ్య నిర్వహణ దక్షతతో సాగిననాడు ఆనందం కరతలామలకమౌతుందనే ఉపదేశాన్ని కాంతాసమ్మితంగా రసనిర్భరంగా వెలార్చేడు.

**మేఘదూతమ్**

**సంపూర్ణమ్**

**ఇతిశమ్**

| | | | |
|---|---|---|---|
| 17. | **విశాల** | : చూ. ఉజ్జయిని. | (30) |
| 18. | **అవన్తి** | : చూ. ఉజ్జయిని. | (30) |
| 19. | **శిప్రా** | : ఉజ్జయినిలో ప్రవహించే నది. గంధవతీ గంభీరా నదులు దీనికి ఉపనదులు. | (31) |
| 20. | **గంధవతి** | : శిప్రానదికి ఉపనది. | (33) |
| 21. | **గంభీర** | : శిప్రానదికి మరొక ఉపనది. | (40) |
| 22. | **దేవగిరి** | : ప్రస్తుతం దేవగఢ్‌గా వ్యవహారంలో ఉంది. ఉజ్జయినికి 'మందసోర్'కీ మధ్యలో ఉంది. దీన్ని దౌలతాబాద్ అని కూడా అంటారు. | (42) |
| 23. | **చర్మణ్వతి** | : ఇప్పుడు 'చంబల్' నదిగా ప్రసిద్ధమైంది. వింధ్య పర్వత వాయువ్య దిశలో ఆవిర్భవించిందంటారు. (రాజస్థాన్‌లోని 'కోట' ఈ నది ఒడ్డునే ఉంది.) | (45) |
| 24. | **దశపురం** | : రంతిదేవుని రాజధాని నగరం. ఇప్పటిపేరు మన్దసోర్. | (47) |
| 25. | **బ్రహ్మావర్తం** | : సరస్వతీ దృషద్వతీ నదుల నడిమి ప్రదేశం. నేటి కాన్పూర్‌కు దగ్గరగా నున్న 'బిఝూర్' ఆనాటి బ్రహ్మావర్తంగా భావిస్తున్నారు. | (48) |
| 26. | **కురుక్షేత్రం** | : మహాభారత యుద్ధం జరిగిన ధర్మక్షేత్రం. | (48) |
| 27. | **సరస్వతి** | : హిమపర్వతంలో పుట్టి కురుక్షేత్రానికి వాయువ్య దిశన ప్రవహించిన నదిగా ప్రసిద్ధం. నేడానది కనిపించదు. త్రివేణిలో అంతర్వాహినిగా ఖ్యాతినొందింది. | (49) |
| 28. | **కనఖలం** | : హరిద్వార సమీపంలో ఉన్నతీర్థం. | (50) |
| 29. | **జాహ్నవి** | : ప్రసిద్ధగంగానది. | (50) |
| 30. | **యమున** | : గంగా, యమునా, సరస్వతీ నదులు ప్రయోగలో కలిసే స్థలం 'త్రివేణి'గా ప్రసిద్ధి. ప్రస్తుతఅలహాబాద్‌లో. | (51) |
| 31. | **హిమాలయాలు** | : ప్రసిద్ధమైన హిమవత్పర్వత శ్రేణి. | (52) |
| 32. | **చరణన్యాసం** | : హరిద్వార ప్రాంతంలో పర్వత మార్గం. ఈశ్వరుని చరణాలిక్కడ ఉండటంవల్ల దీనికీ పేరు వచ్చిందని ప్రసిద్ధి. | (55) |
| 33. | **క్రౌంచరంధ్రం** | : మానససరోవరానికి వెళ్ళే త్రోవలోని ఇఱుకైన మార్గం. | (57) |